311 వ సంచిక
డిసెంబర్ 2003 ★ రూ.7/-

# చతుర



## వారసుడు

ఎ. అన్నపూర్ణ

## సచిత్ర విచిత్రం



# రమణీయమైన మంచు శిల్పాలు!



ఐస్‌తో అనేక కళాఖండాలను రూపొందించి, విందులు, వినోదాల్లో ఏర్పాటు చేస్తూ ఉంటారు అక్కడక్కడ. ఫ్రాన్స్‌లోని పాకశాస్త్ర ప్రవీణులు 200 సంవత్సరాలక్రిందట ఈ మంచు కళకు శ్రీకారం చుట్టారు! ప్రస్తుతం ఈ కళ రష్యా, జపాన్, చైనా, అమెరికా, ఫిన్‌లాండ్‌లలో విశేషమైన ప్రాచుర్యం పొందింది! ఇందులో జపాన్ వారిది అందె వేసిన చెయ్యి!

అప్పట్లో వేడుకలకు మాత్రమే పరిమితమైన ఈ కళ నేడు అనేక దేశాల్లో ఏర్పాటుచేస్తున్న మంచుకళల పోటీల పేరిట, ప్రతిభావంతులను ఎందరినో ఆకర్షిస్తోంది. ఆ రంగానికి చెందిన కళాకారులు ఆ పోటీలో పాల్గొని బహుమతులు పొందుతున్నారు. సాధారణంగా ఇవి 5 నుంచి 6 గంటలవరకూ అందాలను విరజిమ్ముతూనే ఉంటాయి. ఐస్‌తో ఓ చెయ్యి తిరిగిన శిల్పి రూపొందించిన అద్భుతమైన డ్రాగన్‌ను తిలకించండి!

# చతుర కతలు

## అమితాబూ... ఆడవేషమూ

అంతర్జాతీయంగా పేరుప్రఖ్యాతులు గడించిన మన హైదరాబాద్ నగర అందచందాల్ని, ముఖ్యంగా హుస్సేన్‌సాగర్‌లో బుద్ధవిగ్రహాన్ని చూడాలని ది గ్రేట్ బాలీవుడ్ సూపర్‌స్టార్ అమితాబ్‌బచ్చన్ ఎప్పటి నుంచో అనుకుంటున్నాడు. ఏదో పనిమీద అడపాదడపా నగరానికి వచ్చినా ఈ కోరిక తీర్చుకోవడానికి ఎప్పుడూ వీలు చిక్కేది కాదు. అందుకే ఈసారి ఓ నాలుగురోజుల ట్రిప్ పెట్టుకుని ముంబాయినుంచి హైదరాబాద్‌కు వచ్చాడాయన. దురదృష్టవశాత్తూ నగరంలో ఆయన కాలుమోపిన రోజునే సిటీలో ఏవో అల్లర్లు జరిగాయి.



పోలీసులు కర్ఫ్యూ విధించారు.

ఇక చెప్పేదేముంది? హోటల్ రూమ్‌లో బందీ అయిపోయాడు అమితాబ్. "ఏం చేయాలిప్పుడు? అనుకున్నదొకటి... అయినదొకటీ" అనుకుంటూ కాసేపు కూనిరాగాలు తీశాడు. తర్వాత నిముషం గడవడం భారమైపోయింది. అలాగే అతి భారంగా హోటల్‌లో రెండురోజులు గడిచిపోయాయి.

మూడోరోజున కర్ఫ్యూ రెండు గంటలపాటు సడలించారు. అదీ కేవలం మహిళలకు మాత్రమే. ఎందుకంటే ఇళ్ళలోకి అవసరమైన కూరగాయలు... ఉప్పులు పప్పులు తెచ్చుకోవడానికి. అన్నమాట మగవాళ్లు బయట కన్పిస్తే కాల్చిపారేసే మని పోలీసులు మైకుల్లో కరాఖండి

ఫొటోగ్రాఫర్: మధు ✦ మోడల్: మధురిమ

ప్రకటనలు చేశారు.

అప్పటికే రెండురోజుల నుంచీ రూమ్‌లో ఒంటరిగా కూర్చునీ కూర్చునీ బోర్‌కొట్టిన అమితాబ్ ఈ అవకాశాన్ని జారవిడుచుకో రాదనుకున్నాడు. ఎలాగో అలా అమ్మాయి వేషం వేసుకునైనాసరే బయట కాసేపు తిరిగి రావాలనుకున్నాడు.

తన ఆలోచన హోటల్ సిబ్బందికి చెబితే, 'హమ్మో డేంజర్‌సార్... మీరు మగ వారని గుర్తుపడితే పోలీసులు కాల్చిపారే స్తారు' అన్నారు వారు. 'సాహసాలు నాకల వాటే... మరేం ఫర్లేదు' అన్నాడు భరో సాగా అమితాబ్.

సిబ్బంది ఏం మాట్లాడకపోవడంతో 'ప్లీజ్ ఆడవేషం వేసుకోవడానికి కావల్సిన ఏర్పాట్లు చేయండి. మీకెంత డబ్బు కావా లన్నా ఇస్తా' అన్నాడాయన అర్థింపుగా.

★ ★ ★

అమ్మాయి వేషం వేసుకుని ఒయ్యారంగా నడుస్తూ వీధిలోకి వచ్చాడు అమితాబ్. ఎక్కడ బడితే అక్కడ పోలీసులు గుంపులు గుంపులుగా ఉన్నారు. వాళ్ళ చేతుల్లో ఏ క్షణానైనా గర్జించేందుకు సిద్ధంగా ఉన్న రైఫిళ్ళు. వాటిని చూస్తుంటే భయంతో గుండెలు పీచుపీచుమంటున్నాయి. రోడ్ల మీద అక్కడక్కడా మహిళలు పచారీకొట్ల వద్ద, కూరగాయల బళ్ళవద్ద నిలబడి బేర సారాలు సాగిస్తున్నారు.

అమితాబ్ కూడా ఒక షాపు దగ్గరకు వెళ్ళి తనకు కావాల్సిన మేగజైన్లు, న్యూస్‌పే పర్లు కొన్నాడు. అయితే ఆ షాపు యజ మాని అమితాబ్ భారీ పర్సనాలిటీని అను మానంగా చూశాడు. ఇక అక్కడ ఉండడం మంచిదికాదని అమితాబ్ ఇవతలకు నడి చాడు. అక్కడ ఒక మహిళ అతనివంకే గుచ్చిగుచ్చి చూడసాగింది.

అమితాబ్ గుండెల్లో రైళ్ళు... కొంపదీసి ఈవిడగానీ నాది వేషం అని గుర్తించిందా ఏం ఖర్మ. చటుక్కున వెళ్ళి పోలీసులకు చెబితే మరోమాటకు అవకాశం లేకుండా 'మారో గోలీ' అనడం ఖాయం. అది తల్చు కోగానే అంత పెద్ద హీరోకూ చెమటలు పట్టాయి. ఇక అక్కడ ఉండడం క్షేమం కాదు అనకుని గబగబా హోటల్‌వైపు నడక సాగించాడు.

ఆ మహిళ కూడా తన వెనకే రావడం గమనించిన అమితాబ్‌కు పై ప్రాణాలు పైనే పోయినంత పనైంది. అయిపో యింది... అనుకున్నంతా అయింది. ఈవిడ ఎవరోగానీ తనది వేషమని గుర్తుపట్టే సింది. ఇంకేదిరా దారి దేవుడా... అను కుంటూ వేగంగా నడవసాగాడు.

అంతలో ఆమె... 'హలో ఎక్స్‌క్యూజ్ మీ' అని పిలిచింది.

ఏదైతే అదే అవుతుంది అనుకుని దేవుడి మీదే భారం వేసిన అమితాబ్ ఆగాడు. నాలుగు అంగల్లో అతన్ని చేరుకున్న ఆమె 'మీరు... మీరు అమితాబ్‌కదూ' అంది.

'అమితాబ్ కౌన్? మాలూమ్ నై' అన్నాడు అమితాబ్.

'ఊరికే బూకరించకండి సార్. నేను కపి ల్‌దేవ్‌ని... మరేం భయం లేదు' అంటూ అదే హోటల్‌లోకి నడిచాడు.

– చంద్రప్రతాప్

---

## గుణపాఠం

అటక మీదనున్న ఆవకాయ జాడీని చూస్తూ లొట్టలేసుకుంటూ గబగబా గంజి తాగుతున్నాడు రామనాథం. అతని భార్య సుశీల కళ్లు వత్తుకుంటూ ముక్కు చీదు కుంటూ 'పిసినారి భర్త' అని చెడామడా తిట్టుకుంటూ పెరట్లో అక్కడక్కడ తుప్పల్లో పెరిగే చిలకతోటకూర మొక్కల కోసం వెదుకుతోంది పులుసుకని.

రామనాథం పూర్వాశ్రమంలో దరిద్ర నారాయణుడు. ఊహ తెల్సిందగ్గరనుండి






శ్రీమంతుడవ్వాలని తెగ తపన పడేవాడు. అదే అతని జీవిత ధ్యేయంగా మారింది. ఆ ధ్యేయమే అతడిని డబ్బున్న వాడుగా చేసింది. కష్టపడి సంపాదించిన సొమ్ముని వ్యసనాలకి, విలాసాలకి, విందులకి, దానధర్మాలకి తగలెయ్యకుండా జాగ్రత్తచేసేవాడు.

తన ఇద్దరు ఆడపిల్లల్ని అవసరమైనంత వరకే చదివించాడు. ఖర్చుకి బానిస కాని అతడు అరచేతిలో వైకుంఠం చూపించి డాక్టర్లను అల్లుళ్లుగా చేసుకుందామనుకున్నాడు గాని తలో రెండు లక్షలైనా కట్నం తక్షణం ఇవ్వందే మూడుముళ్లు వెయ్యమంటూ అల్లుళ్లిద్దరూ పెళ్లి పీటల మీద భీష్మించుకొని కూర్చోవటంతో ఇహ చేసేదిలేక ఇచ్చుకోక తప్పలేదు. ఆ తర్వాత వచ్చే పండగలు, పురుళ్లు వగైరాలు అతని జాగ్రత్తతనాన్ని కొరడా ఝుళిపించి మరీ వదలగొడుతున్నాయి. సంపాదిస్తున్నదంతా ఇలా నీళ్లలా ఖర్చయిపోవటంతో ఇక మీదట పైసా ఖర్చవకుండా బతికే మార్గాలని అన్వేషించి వాటిని తు.చ. తప్పకుండా ఆచరించటం మొదలెట్టాడు.

నాలుగు మొక్కల్ని పీక్కొచ్చిన సుశీల పులుసు పెట్టే ప్రయత్నంలో ఉండగా గుమ్మం ఎదురుగా ఆగిన ఆటోలోంచి కూతురు, అల్లుడు దిగారు. ఆ అకాల ఆగమనానికి హార్టయిన రామనాథం ఒక చేత్తో గుండె పట్టుకొని మరో చేత్తో స్వాగతిస్తూ ఏడవలేని నవ్వుతో వాళ్లని లోపలికి తీసుకువచ్చాడు. కూర పట్రండి మహాప్రభో అని సుశీల మరోసారి నెత్తీనోరూ మొత్తుకోవడంతో నాలుగు రూపాయలు లాల్చీ జేబులో వేసుకొని చేతిసంచీతో బజారుకు బయల్దేరాడు. కూరల ధరలన్నీ ఆకాశాన్నంటడంతో ఎలా అందుకోవాలా అని ఆ ఆకాశంవైపే చూస్తూ అక్కడున్న రాతిబండపై చతికిలబడ్డాడు.

అయినా పోతున్న తన మిత్రుడు కొడుకు సాయిని చూసి సాక్షాత్తు ఆ సాయినాధుని చూసినంత సంబరపడిపోయి సాయీ అని గట్టిగా కేకేశాడు. సాయి వచ్చాడు. "సాయీ! ఏమైనా కూరగాయలు పట్రావా, ఇంటికి చుట్టాలొచ్చారు. బాబ్బాబు, నీకు




పుణ్యం ఉంటుంది" అంటూ జేబులోంచి రెండు రూపాయలు తీసి వాడి చేతిలో పెట్టి దీనంగా అర్థించాడు.

"రెండ్రూపాయలకి ఆకుకూరలే రావట్లేదు గదండి" అన్నాడు వాడు.

"ఆమాత్రం నాకు తెలీదట్రా? ఏదో కుర్ర కారువికదా! అలా పోవాలంట, పోయి ఎవ రికీ కన్పడకుండా నీ చేతివాటం చూపించి నాలుగు కూరగాయలు కోసుకువచ్చి నన్నా దుకుంటావని చెప్పాను. బాబ్బాబు, త్వర గారా" అంటూ ఇంటి ముఖం పట్టాడు.

సాయి అరగంటలో కూరగాయలతో వాలాడు. రామనాథం ఆనందంతో నేనేదో పొరపడ్డానుగాని వీడు సబ్ జైల్ స్థాయికి చెందినవాడేనన్నమాట అని మనసులో అనుకుంటూ కూరగాయల్ని లోపలికి తీసు కుపోతూంటే.

"అయ్యా రాత్రికి కోడికూర ఏదైనా ఏర్పాటు చేయమంటారా" అని అడిగాడు సాయి. ఎన్నో సంవత్సరాల క్రితం జస్ట్ రుచిచూసిన రామనాథం నోరు జలజలా, జలజలా ఊరడం మొదలెట్టింది. ఎత్తుకొ చ్చిన ఆకుకూరో కాయగూరో కొన్నానంటే పెద్దగా ఇబ్బందుండదుగాని కోడో, గొర్రో కొన్నానంటే జనాలు తిరగబడరూ, అన్న ఆలోచన మదిలో మెదిలినా జిహ్వా చాపల్యం చంపుకోలేక ఒరేయ్ తెచ్చిన వాడివి ఏటవతల బాగా శుభ్రంచేసి ఎవరి కంట పడకుండా తీసుకొనిరా. అని ముందు జాగ్రత్తలు చెప్పి సాయిని పంపించేశాడు.

ఠంచనుగా సాయంత్రం ఆరో గంటల కల్లా శుభ్రం చేసిన బలిష్టమైన ఒకటో రకం కోడితో హాజరయ్యాడు సాయి. దాన్ని చూసిన రామనాథంకి మనసు పులకరించి ఒళ్లు జలదరించి నోరు ఊరిపోతోంది. ఎలాగోలా ఆ దివ్యానుభూతులకు బ్రేకులు వేసి తెచ్చిన కోడిని అందుకొని పది రూపా యలు చేతిలో పెట్టి పంపేసాడు. సాయి వెళ్లిపోయాడు. ఏమో అనుకున్నా గాని చేయి తిరిగిన ఘటికుడే. అప్పుడే సెంట్రల్ జైల్ లెవిల్‌కి ఎదిగి పోయాడనుకుంటూ దాన్ని తడిమితడిమి మురిసిపోతూ భార్య కోసం సెరట్లోకి వెళ్లాడు.

ఎదురుగా తల్లీకూతుళ్లిద్దరూ "క్కొ, క్కొ, క్కొ: క్కొ, క్కొ, క్కో అనుకుంటూ వస్తూ మన కోడి పుంజు కన్పడటం లేదండి" అన్నారు వారు. మూడు వందలు ఖరీదు చేసే మేలిరకం కోడిపుంజు తన చేతిలో శవమై ఉందన్న ఊహ కలిగేసరికల్లా రామ నాథం కాళ్లక్రింద ల్యాండ్ మైన్ పేలినట్ట యింది. ఎగిరెగిరి కూతవేటు దూరంలో పడకపోయినా అంగాంగం చిన్నాభిన్నం కాకపోయినా కొద్ది క్షణాల పాటు సరిగ్గా అటువంటి అనుభూతికే లోనయ్యాడు. ఆ తర్వాత తేరుకోబోతుంటే "అయ్యా రామనా థంగారూ సాయితో అంపిన కూరలకి ఇరవై రూపాయలు అయినాదండి. ఇప్పిస్తే ఎల్లి పోతాన"ంటూ గుమ్మం ఎదురుగా నిల్చున్న కీచకుడు లాంటి అప్పారావును చూసి నా పిసినారితనంతో సాయికి దొంగతనం నేర్ప బోయాను. కాని చక్కటి గుణపాఠం నేర్పి నా జాడ్యాన్ని వదిలించాడని మనసులో సాయిని అభినందిస్తూ అప్పారావుకి డబ్బు లివ్వడానికి ముందుకు కదిలాడు.

**– కావేరి జయంతి మణి**

---

## అత్తగారి మొహం

**క**నక మహలక్ష్మమ్మగారి పేరు సార్థకమ యింది. అష్టైశ్వర్యాలతోపాటు అహంభావం, ఆధిక్యతాభావం కూడా కాస్త ఎక్కువే. అచ్చంగా సినిమాల్లో యస్. వరలక్ష్మి పాత్ర లాగా వుంటారంటే సరిపోతుంది.

ఆవిడ గొంతెమ్మ కోరికలతో కూతురుకు సంబంధం కుదరడం చాలా కష్టమైంది. చివరకు ఒక సంబంధం కుదిరింది.



తాంబూలాలు పుచ్చుకొని నిశ్చితార్థం చేసుకోవటానికి నిర్ణయాలు జరిగాయి. ఎంతో ఆడంబరంగా ఏర్పాట్లు చేశారు. పెళ్లివారు వచ్చారు. ఇంక ఒక అరగం టలో కార్యక్రమం మొదలవుతుంది.

పెళ్ళివారంతా హాలులో కూర్చున్నారు. పెళ్లికూతురు అన్న రవి కూడా కాబోయే గర్వంగా పరిచయం చేశారు.

గిరిజగారు మోహన్‌తో మాట్లాడి కనక మహలక్ష్మమ్మగారి వైపు తిరిగి నవ్వుతూ మరి అల్లుడు వచ్చేశాడు. ఇంక కోడలె ప్పుడు వచ్చేది? అంటూ రవివైపు తిరిగి "ఏమోయ్ రవి! నీ పెళ్ళెప్పుడు?" అన్నారు.




బావగారి దగ్గర కూర్చున్నాడు. అంతా సరదాగా మాట్లాడుకుంటున్నారు.

ఇంతలో కనక మహలక్ష్మమ్మగారి క్లబ్ ఫ్రెండ్, బిజినెస్ మాగ్నెట్ అయిన మెహ తాగారి మిసెస్ గిరిజగారు వచ్చారు. కన కమహాలక్ష్మమ్మగారు ఆనందంగా, హడా విడిగా ఆమెను రిసీవ్ చేసుకున్నారు.

"రండి రండి మా అల్లుడిని పరిచయం చేస్తాను. ఆ తర్వాత అంతా మళ్ళీ హడా విడి అవుతుంది" అంటూ హాల్లోకి తీసుకు వచ్చారు. అల్లుడు కాబోయే మోహన్‌ను

వెంటనే రవి "అదేంటి ఆంటీ! మా చెల్లాయికి అత్తగారు లేని సంబంధం కోస మేగదా ఇన్నాళ్లు పట్టింది. మరి నా పెళ్లి ఇప్పుడెలా అవుతుంది?" అన్నాడు. వెంటనే అక్కడున్నవాళ్లంతా గొల్లుమని నవ్వారు. కానీ పెళ్లికొడుకు మొహం మాత్రం జేవురించింది. అంతలోనే సర్దు కొని "అలాగా రవి, అయితే నే అత్తగా రున్న సంబంధమే చేసుకుంటున్నా అల్లుడి తడాఖా ఏమిటో చూపించడానికి" అన్నాడు.

ఇప్పుడు అత్తగారి మొహం?

– దావులూరి జయలక్ష్మి



# ఆణిముత్యాలు

☞ నువ్వు భయపడితే అది భయపెట్టేవాని సమర్థత కాదు. భయపడే అసమర్థత నీది.

– జాన్ హేమంత్‌కుమార్

☞ పోతే రానివి మానం, ప్రాణం. వస్తే పోనివి కీర్తి, అపకీర్తి. వస్తూ పోయేవి కష్టం, సుఖం.

– శ్రీ ఆదిభట్ల నారాయణదాసు

☞ ఉపకారం పొందేవాడు మరిచిపోకూడదు. దానిని అందించేవాడు గుర్తుంచుకోకూడదు.

– శామ్యూల్ జాన్సన్

☞ అపారంగా ఇవ్వడం కాదు, అవసరాన్ని కనిపెట్టి ఇవ్వడం ఔదార్యం.

– అబ్రహాం లింకన్

☞ నాస్తికుని కన్నా దేముణ్ణి దుర్వినియోగం చేసే ఆస్తికుడే ప్రమాదకరం.

– గాంధీజీ

☞ క్షమాశీలునకు లోకమంతా వశమవుతుంది.

– విదురుడు

☞ మీరు మీరుగా ధైర్యంగా ఎవరివద్ద వ్యవహరించగలరో అతడే నిజమైన స్నేహితుడు.

– రవీంద్రనాథ్ ఠాగూర్

☞ ఏ జీవినీ చంపవద్దు. ఎందుకంటే తిరిగి ప్రాణం పోసే శక్తి మనకు లేదుకనుక.

– జాన్ హేమంత్ కుమార్

☞ ఆడంబరం లేకుండా, ఆత్మస్తుతి చేసుకోకుండా, కోపము వచ్చినప్పటికీ కఠినంగా మాట్లాడకుండా ఉండేవాడు అందరిచేతా ఆదరింపబడతాడు.

– విదురుడు

☞ తప్పుల నుంచీ, లోపాలనుంచీ భవిష్యత్తుకు పనికి వచ్చే పాఠాలు నేర్చుకోవడం వివేకవంతుల లక్షణం.

– రామకృష్ణపరమహంస

☞ ఉత్సాహాన్ని మించిన ఆస్తి లేదు. అది మనతో ఉన్నపుడు ధనము, శక్తియుక్తులు, ఆకర్షణశక్తి వాటికవే మనవద్దకొస్తాయి.

– సంస్కృత సూక్తి

సేకరణ: **శివప్రసాద్ పండా**

chatura:311 va sanchika




చతుర:311 వ సంచిక
సంపుటి:26 సంచిక:11 డిసెంబర్:2003

అంచెలంచెలుగా ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ స్వంత కంపెనీని ప్రారంభించి అమెరికాలో స్థిరపడిపోయిన అతడు అక్కడే ఓ బెంగాలీ అమ్మాయిని వివాహం చేసుకున్నాడు. తన పిల్లలకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనివ్వడంతో పెద్ద కూతురు అమెరికన్‌ని వివాహమాడింది. తోటి భారతీయ కుటుంబ స్నేహితులు ఈ వివాహాన్ని విమర్శించారు. అయినా అతడు పట్టించుకోలేదు. కానీ చిన్న కూతురి వివాహం అతడికో సమస్యగా మారింది. అయితే ఆ సమస్యకు అతడి భార్య ఓ చక్కటి పరిష్కారాన్ని సూచించింది. తన కూతురికిక పెళ్లేకాదనుకున్న ఆ తండ్రికి ఎదురయిన అద్భుతం ఏమిటి? అమెరికాలో స్థిరపడిన భారతీయ కుటుంబాల్లోని వివాహసమస్యలను విశ్లేషించిన ఎ.అన్నపూర్ణ రచన 'వారసుడు' ఈనెల చతుర సమగ్ర నవల.



అమెరికా కంట్రీ. కాలిఫోర్నియా స్టేట్. శాండియాగో సిటీ అది! మార్చి నెల వాతావరణం చిరుచలిగా వుంది.

జయచంద్ర ముప్ఫై ఏళ్లుగా అమెరికాలో వుంటున్నాడు.

ఉద్యోగరీత్యా ఎన్నో స్టేట్స్ తిరిగి చివరికి కాలిఫోర్నియా రాష్ట్రంలో స్థిరపడ్డాడు. ఇక్కడి వాతావరణం అతడికి ఎంతో ఇష్టం. ఏ సీజన్ అయినా భరించలేనంత అనేలా వుండదు. అతడికి నందిత, నీలిమా అనే ఇద్దరు అమ్మాయిలు. రాకేష్ అనే అబ్బాయి వున్నారు. అమెరికాలో స్థిరపడిన బెంగాలీ కుటుంబంలోని సుచిత్రను ఇష్టపడి పెళ్లి చేసుకున్నాడు. సుచిత్ర తండ్రి అతనికి యూనివర్శిటీలో కో-ప్రొఫెసర్. అదీ సుచిత్రతో పరిచయానికి నాంది. నందిత మెడికల్ కోర్స్ పూర్తిచేసి రెసిడెన్సీ చేస్తోంది. నీలిమ ఇంజనీరింగ్ పూర్తిచేసింది. ఎంబిఏ చేస్తోంది. రాకేష్ ప్లస్‌టూ చదువుతున్నాడు.

సమ్మర్ వెకేషన్‌కి ఏ ట్రిప్ వేయాలా అని ప్లాన్ చేస్తోంది నీలిమ. ఆ అమ్మాయికి తను కొత్తగా కొనుక్కున్న టయోటాలో లాస్‌వేగాస్ వెళ్లాలని ఆలోచన. కాని లాంగ్ డిస్టెన్స్ డ్రైవ్ చేయడానికి జయచంద్ర ఒప్పుకోడు. అతడికి నీలిమ రాష్ డ్రైవింగ్ అంటే భయం.

"వ్వాట్ డాడ్! ఈ దేశం వచ్చి ఇన్నేళ్లయినా నువ్వు మారవు. నా ఫ్రెండ్‌తో నేను ఎన్నిసార్లు వెళ్లలేదు? ప్లీజ్ డాడ్" అంటూ గారాలు పోయింది.

తన కారులో వెళ్లాలని నీలిమా, వద్దని జయచంద్రా!

"మామ్! నువ్వు డాడ్‌ని ఒప్పించవా? " అంటూ తల్లిని కాకాపట్టింది.

"ఏమోబాబూ! తర్వాత ఏం తేడా వచ్చినా నన్ను సాధిస్తాడు మీ డాడ్. అయ్ డోంట్ ఇన్టర్‌ఫియర్ ఇన్‌యువర్ ట్రిప్" అనేసి తప్పుకుంది సుచిత్ర.

"నందూ! ప్లీజ్ హెల్ప్‌మీ? " జాలిగా అడిగింది అక్కను. "నేను యూరప్ వెడుతున్నా. కావాలంటే నాతోరా" అంది నందిత ఎటూ కాకుండా.

"పోనీ వెళ్లనీ డాడ్! పాపం నీలు అక్క డిసప్పాయింట్ అవుతుంది!" అడక్కపోయినా అవసరానికి నన్ను సపోర్ట్ చేయక పోతుందా అనే ముందు చూపుతో అన్నాడు రాకేష్.

"ఓ షిట్! నీ వెకేషన్ ట్రిప్ ఎక్కడికీ అని నేను నిన్ను అడగలేదు. నా కారులో నేనే డ్రైవ్ చేసుకుంటూ వెళ్లాలి. అంతే!" నందిత మీద విరుచుకుపడుతూ కోపంగా చెప్పింది నీలిమ.

"కూల్ డవున్ నీలూ! అందరమూ కలసి హవాయ్ వెడదాం. ఓకేనా డియర్? " సుచిత్రవైపు చూస్తూ సజెస్ట్ చేశాడు జయచంద్ర.

ఆల్రెడీ నందిత తన వుడ్‌బీ ఫిలిప్స్‌తో యూరప్ వెళ్లాలని ముందే ప్లాన్ చేసుకుంది కనుక వాళ్లను వదిలి అంతా హవాయ్ ట్రిప్‌ని ఓకే చేశారు.

తన కారులో వెళ్లలేకపోవడం నిరాశ కలిగించినా ఈసారి డాడ్‌తో చెప్పకుండా ట్రిప్ వేస్తాను అని సరిపెట్టుకుంది నీలిమ.

జయచంద్ర ఇండియా నుంచి మెరిట్ స్టూడెంట్‌గా పిహెచ్‌డీ చేయాలని అమెరికా వచ్చాడు. అతడి విజ్ఞాన తృష్ణ అంతులేనిది. చురుగ్గా ఒకొక్క మెట్టే అంచెలంచెలుగా ఎదుగుతూ స్వంత కంపెనీ స్టార్ట్ చేశాడు ఆ బిజినెస్‌లో సక్సెస్ అతణ్ణి ఉన్నత శిఖరాన నిలబెట్టింది. ముగ్గురు పిల్లలూ, భార్యా చీకూచింతాలేని లైఫ్.

కోరుకున్న అమ్మాయి సుచిత్రను పెళ్లి చేసుకున్నాడు. సుచిత్ర ఎంతగా ప్రేమించి పెళ్లి చేసుకున్నా భర్తకు అనుకూలంగా నడుచుకునే పక్కా గృహిణి. పిల్లలనూ, ఇంటినీ తీర్చిదిద్దుకోవడమే ఆమె బాధ్యత.

అమెరికాలో వివిధ దేశాలవారు నివసిస్తున్నారు. అందరికంటే ఎక్కువ విదేశీ జనాభా భారతీయులే అని చెప్పవచ్చు మిగి




లిన దేశప్రజలు వ్యాపార నిమిత్తం వలస పోయినవారు. భారతీయుల్లో గుజరాత్ రాష్ట్రీయులు హోటల్స్, రెస్టారెంట్స్ షాపులు నడుపుతూంటే టీచింగ్ ప్రొఫెషన్‌లో వివిధ రాష్ట్రాలవారున్నారు. పంజాబీల్లో టాక్సీడ్రైవర్స్, గ్యాస్ స్టేషన్స్ నడిపేవారు ఎక్కువ. గ్యాస్ స్టేషన్స్ అంటే పెట్రోల్ బంక్స్.

న్యూయార్క్, న్యూజెర్సీ, చికాగో, హూస్టన్ స్టేట్స్‌లో ఇండియన్స్ చాలా ఎక్కువగా నివసిస్తున్నారు. మిగిలిన స్టేట్స్‌లో కూడా వున్నారు కానీ కంపేరిటివ్‌గా తక్కువ అనిపిస్తారు. విచిత్రం ఏమిటంటే అమెరికాలో బ్లాక్స్, మన ఇండియన్స్‌ని వాళ్లతో సమానంగా భావిస్తారు. మనతో ఎక్కువగా కలిసి వుండాలనుకుంటారు. కావాలని పలకరిస్తారు. బొట్టూ, గాజులూ, డ్రస్ గురించి కుతూహలంగా అడుగుతారు.. ఇండియా అనే కంట్రీ పేరు మాత్రమే వాళ్లకి తెలుసు. స్నేహపాత్రులుగానూ ఉంటారు. క్రైమ్‌లోనూ పేరున్నవాళ్లు. ఒకో స్టేట్‌లో వీరిగురించి విపరీతంగా భయపడతారు కూడా. మన భారతీయులు శాంతికాముకులు కాబట్టి అందరితోనూ మంచిగా ఉండాలని ప్రయత్నిస్తారు. 2002 సంవత్సరంలో చాలామంది సోమాలియా ప్రజలకు అమెరికా దేశం ఆశ్రయం ఇచ్చింది. అంతకుముందు ఎంతకాలంగా వలస ప్రారంభమయిందో తెలియదు కానీ 2002లో అయిదు వేలమందికి సిటిజన్‌షిప్ ఇచ్చింది. వీరు కూడా ఇంచుమించు ముస్లిం సంప్రదాయం పాటించినట్టు కనబడతారు. స్త్రీలలో తలకట్టు కనబడకుండా నిలువుగా అంగరఖా ధరిస్తారు. నీగ్రోలంత నలుపు రంగు కాకపోయినా, మన భారతీయుల నలుపును పోలివుంటారు. ఒక్క దుస్తులు ధరించడంలో తప్పితే, మనకూ వారికీ అంతగా తేడా తెలియదు.

ఇదే విధంగా బ్రెజీలియన్స్, ఇజ్రాయిలీస్, వియత్నమీస్ బ్యూటీపార్లర్లు, హెయిర్‌కటింగ్ సెలూన్‌లు నడుపుతూ వ్యాపారానికి భాష అడ్డుకాదని నిరూపించడం. మన ఇండియన్స్‌లో నర్సింగ్ జాబ్ చేసే మలయాళీలు, మన దేశానికి వలస వచ్చి స్థిరపడిన టిబెటియన్లు అమెరికాలో హాస్పటల్స్‌లో నర్స్‌లుగా ఉన్నారు. ఇప్పుడు ఏ కంట్రీలో చూసినా నర్సింగ్‌కి జాబ్ అవకాశాలు పుష్కలంగా ఉన్నాయి. వారికి 40,000 డాలర్స్‌నుంచి 65,000 డాలర్స్ వరకూ పేమెంట్ ఉంటుంది. కానీ పేషెంట్లకు అంకితభావంతో సేవ చేయాలి. చాలా ఓర్పుగా వృత్తిని నిర్వహించాల్సి ఉంటుంది. ఎంత జీతం లభిస్తుందో చిన్న పొరపాటు చేసినట్టు ఏ పేషెంట్ కంప్లయింట్ చేసినా అందుకు తగిన పనిష్మెంట్ కూడా వుంటుంది. మంచి హాస్పిటల్స్, నర్స్‌లకు సదుపాయాలు, ఓవర్‌టైమ్ చేసినవారికి ఎక్కువ మొత్తం పేమెంట్ లభించడంవలన పనికి తగిన ఫలితం పొందగలుగుతారని చెప్పవచ్చు. టిబెటియన్స్‌కి మూడు దేశాల సిటిజన్‌షిప్ వుంటుంది.

ఇండియన్ ఫామిలీస్ ఎక్కడైనా కలిసినప్పుడు ఎదుగుతున్న పిల్లల గురించీ, ముఖ్యంగా ఆడపిల్లల గురించి కొందరు చాలా భయపడుతుంటారు. కానీ జయచంద్రా, సుచిత్రలు అలా ఏమీ అనుకోలేదు. వీలైనప్పుడు పిల్లల్ని తీసుకుని ఇండియా రావడం, బంధువుల్ని, పుట్టి పెరిగిన వాతావరణం, సంస్కృతిని తెలియచేస్తూ అమెరికాకు ఇండియాకి మధ్యగల వ్యత్యాసాన్ని నోటితో చెప్పనవసరంలేని విధంగా కళ్లకి చూపిస్తూ వచ్చారు. అంతేతప్ప ఎటువంటి నీతిబోధలూ చేయలేదు. పరిమితులనూ విధించలేదు.

పెద్దమ్మాయి నందిత తనకు నచ్చిన ఫిలిప్స్‌ని, రెండు సంవత్సరాల క్రితమే ఎంచుకుంది. త్వరలో పెద్దలు వారి పెళ్లికి ఏర్పాట్లు చేస్తారు. నందితకూ నీలిమకూ

నాలుగేళ్లు తేడా వుంది. నీలిమకూ రాకేష్‌కీ నాలుగేళ్లు వయసు తేడా వుంది. ఎంబిఏ పూర్తిచేసి ఉద్యోగంలో చేరిన రెండు మూడేళ్ల తర్వాత కానీ నీలిమ పెళ్లి గురించి ఆలోచించకపోవచ్చు పిల్లలకు సంపూర్ణ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఇచ్చాడు జయచంద్ర. వాళ్లను స్నేహితుల్లా చూస్తాడు. పిల్లలు ఇండియా వెళ్లినప్పుడు అందరితోనూ మాట్లాడే విధంగా తెలుగు నేర్పించాడు. సుచిత్ర కూడా శ్రద్ధగా నేర్చుకుంది. ఆమె సహకారానికి జయచంద్ర ఎంతగానో సంతోషించాడు. అతను ఎవర్నీ ఇలా వుండాలని శాసించడు. ఇంట్లో వాళ్లంతా అందుకే అతణ్ణి ఇష్టపడి అతడికి నచ్చినట్టే ప్రవర్తిస్తారు. అలా అని పూర్తిగా వారికి నచ్చని పనీ చేయరు. అతణ్ణి అంగీకరింపచేసేలా నడుచుకుంటారు.

"జయా! మనం మూర్తి డాటర్ మేరేజ్‌కి శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్లాలి. గుర్తుందా? నువ్వు రాగలవా? లేక గిఫ్ట్ మెయిల్ చేయనా?" అడిగింది సుచిత్ర భర్తని.

"నిజానికి తీరిక లేదనుకో! మన నందిత మేరేజ్‌కి వాడు రావాలి. ముఖ్యంగా మనకు ఆత్మీయుడు. కనుక వెళ్లాలి తప్పదు" అన్నాడు.

వెంటనే సుచిత్ర ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసింది. ఇద్దరూ బయలుదేరి వెళ్లారు. అక్కడకు చేరిన వారిలో పెళ్లిళ్ల గురించిన చర్చ వచ్చింది. ఇండియాలో అయితే ఇంట్లో పెద్దవాళ్లుంటే మన బంధువులు వున్నారనో, ఎక్కడో పెళ్లిలో ఫలానా వారు పరిచయం అయ్యారనో ఎక్కడో ఎవర్నో చూశాను వివరాలు కనుక్కున్నాను, మన అమ్మాయికి అడిగితే బాగుంటుంది అనో పెళ్లి ప్రయత్నాలు చేసే వీలుంటుంది. అమెరికావంటి దేశంలో వున్నవారికి అంత సులువుగా పెళ్లి కొడుకుల వివరాలు, కుటుంబ వివరాలూ తెలుసుకోగల అవకాశాలు వుండవు. అందులోనూ సాంప్రదాయం, బంధుత్వం గల వారు కావాలనుకునేవారు ఇండియా వెళ్లిచూసుకోవాలని అనుకుంటారు. మహేష్ అనే అతను జయచంద్రను అడిగాడు.

"ఏమోయ్ చంద్రా! నందిత తండ్రిగా నీకివ్వాల్సిన గౌరవం ఇవ్వకుండా తనిష్టం వచ్చినట్టు అమెరికన్‌ని పెళ్లి చేసుకుంటోందని తెల్సింది. అంటే నీ చేతుల్లో ఏమీ లేదని అంతా నీ భార్య ఇష్టమనీ తెలిసిపోయింది. మరి నీ రెండో కూతురు ఏమంటోంది? నువ్వేమనుకుంటున్నావ్?" అన్నాడు.

"నేను అనుకునేది ఏమీ లేదోయ్ మహేష్! అంతా అమ్మాయి ఇష్టమే" అన్నాడు నవ్వుతూ జయచంద్ర.

"మరీ నువ్వలా ఇక్కడి పద్ధతిలో అందులోనూ అమ్మాయిల్ని వదిలేయడం మంచిది కాదు. అన్ని విషయాలూ భార్యకే వదిలిపెడితే జరిగే అనర్థాలే ఇవి! నేనూ నీతోబాటే అమెరికా వచ్చాను. నీ అంత రిచ్ కాకపోయినా బాగానే సంపాదించాను. నా భార్య నేను గీచిన గీత దాటదు. హడిలిపోతూ వుంటుంది. కొత్తలో నన్ను లొంగదీసుకోవాలని ప్రయత్నం చేయకపోలేదు. ఆడబుద్ధి కదూ? నేనా లొంగేది. ఆమెను నేచెప్పిన మాట వినేలా చేశాను. అందుకే చూడు భారతస్త్రీలాగే వుంటుంది. ఇంతకీ ఈ సంవత్సరం ఇండియా వెడుతున్నాను మా అమ్మాయికి సంబంధాలు చూడాలని. కావాలంటే చెప్పు మీ అమ్మాయికీ చూస్తాను" అన్నాడు.

"వద్దులే మహేష్! నీకెందుకీ శ్రమ? నాకు కావలసినవాళ్లు చాలా మందే వున్నారు. నువ్వు చెప్పిన మనక్కావలసిన సంబంధాలు ఇండియా వెళ్లి చూసుకున్నా అయినవాళ్లని చేసుకున్నా జరిగే అనర్థాలు జరుగుతూనే వున్నాయి. ప్రకాష్ తెలుసుగా! వాడు నీలాగే ఇండియా వెళ్లి ఎంతో అభిమానంగా అక్కకొడుక్కి కూతుర్నిచ్చాడు. ఈ బంధుత్వం ముందే కలుపుకోవాలని ఆ అక్కా బావగారికీ ఎంతో హెల్ప్ చేస్తుండే




వాడు. ఆ బావగారు పూర్తిగా ప్రకాష్ మీద బతికేస్తున్నాడు. ప్రకాష్‌కి ఒక్కటే బాధ. కూతురు పాపం డఫ్ అండ్ డమ్. ఈ కారణంగా అయినవాళ్లయితే అమ్మాయిని బాగా చూసుకుంటారని ఆశపడ్డాడు. వాళ్లకి ఏభై లక్షలతో ఇల్లు కొనిచ్చాడు. పిల్ల చదువుకీ, ఆడపిల్ల పెళ్లికీ సాయం చేశాడు. ఇంత చేసినందుకు ఏమయిందీ? అమెరికాలో ఎవరూ దొరక్క, తనకు ఎరవేశాడని నిందవేశాడు. ఏ పనీ చేయక మామ పోషిస్తాడన్నట్టు ఖాళీగా కూర్చునేవాడు. చివరికామ్మాయికి అతడి పద్ధతి నచ్చక విడిగా వుంటోంది. ఏరికోరి అక్క కొడుకే కదాని, అభిమానంగా ఎంతో ఖర్చు చేసినా చివరికి ఏమైందీ? " అన్నాడు జయచంద్ర.

"అంటే నువ్వీ అమెరికన్ కల్చర్‌నే ఇష్టపడతావా? " అడిగాడు మహేష్ సీరియస్‌గా.

"నాకైతే ఈ పద్ధతే నచ్చింది. మన జనరేషన్‌లో పెళ్లి చూపులంటూ అమ్మాయిని అబ్బాయినీ పదినిముషాలు ఎదురుగా కూర్చోబెట్టడం, మహా అయితే ఓ గంట వాళ్లిద్దర్నీ మాట్లాడుకోమని చెప్పినా, ఒకరి అభిరుచులు మరొకరికి ఆ గంటలోనే తెలిసిపోతాయా? ఆ తర్వాత పెళ్లయ్యాక నీలో లోపం వుందంటే నీలో లోపం వుందంటూ అభిప్రాయ భేదాలు రావడం, 'కావలసిన సంబంధం అంటూ చేశారు. మీవల్లనే వచ్చింది' అంటూ పెద్దవాళ్లని కారకుల్ని చేయడం, ఎటూ చెప్పలేక రాజీ చేయలేక సతమతమవడం ఎన్ని చూడటంలేదూ? ఇండియాలో మాత్రం ఎన్ని పెళ్లిళ్లు విఫలం కావడంలేదు? " అన్నాడు జయచంద్ర.

"అందుకు కారణం, నీలాంటివారు ఇండియాలో ప్రవేశపెట్టిన అమెరికన్ కల్చర్" అన్నాడు మహేష్ కోపంగా.

పోనీ అక్కడ్నించి వచ్చిన మన ఇండియన్స్ ఇక్కడి వారిని ఎందుకు బాగు చేయలేకపోయారు? బాగుపడటానికీ, చెడిపోవడానికీ ఎవ్వరూ కారకులు కాదు మహేష్. కాలంమారింది. మార్పు సహజం. నాకైతే పాతకాలం నుంచి కొత్తకాలానికి వచ్చిన మార్పు చాలా నచ్చింది. అమ్మాయిలు వాళ్లకి కావల్సింది ఏమిటో తెలుసుకుంటున్నారు. ముందుచూపుతో లైఫ్‌ని ప్లాన్ చేసుకుంటున్నారు. తండ్రిమీదా, భర్తమీదా ఆధారపడవలసిన అవసరం లేకుండా ధైర్యంగా వుంటున్నారు. చదువు, ఉద్యోగాల్లో ముందుంటున్నారు" అన్నాడు జయచంద్ర.

"సర్లేవోయ్! నీకు నచ్చినట్టే వుండు. నా కంఠంలో ప్రాణం వున్నంతవరకూ నేనీ సంకరజాతి వాళ్లని అల్లుడిగా చేసుకోను" అన్నాడు మహేష్.

"నేనేమీ నిన్ను రాబోయే అల్లుడి గురించి అడగనేలేదు. నువ్వే నన్ను అడిగావు. నీ ప్రతిజ్ఞ నిలబెట్టుకో.. ఆల్ ద బెస్ట్" అన్నాడు జయచంద్ర నవ్వుతూ.

మహేష్ తన నీతి సూత్రాలను మరొకరికి వర్ణించడానికి లేచివెళ్లిపోయాడు దురుసుగా.

అనసూయ అనే ఆమె సుచిత్రనూ వదిలిపెట్టలేదు. "చిత్రగారూ! ఎన్ని చెప్పండి మనం భారతీయులం. ఈ దేశం డబ్బు బాగా సంపాదించుకోవాలని వచ్చాం. అంతవరకే! పెళ్లిళ్లు, మన అలవాట్లు, పద్ధతులూ మాత్రం అక్షరాలా మనదేశ పద్ధతిలోనే అనుకరిస్తాం. ఆచరిస్తాం. అదెలాగంటే పిల్లలకి చిన్నతనం నుంచే ఇక్కడి ప్రజలగురించి వివరంగా చెబుతాం. వాళ్లకి దూరంగా వుండాలంటాం. కట్టుబాట్లను కఠినంగా అమలు చేస్తాం. ఏ అబ్బాయితో మన అమ్మాయి, అమ్మాయిలతో మన అబ్బాయి చనువుగా వుంటున్నా కఠినంగా శిక్షవేస్తాం. మన కట్టుబొట్టూ ఆచరిస్తే ఇక్కడ వుంటారు. లేదా మనదేశం పంపించేసి అక్కడి పద్ధతుల్లో చక్కగా పెరిగేలా శ్రద్ధ తీసుకుంటాం" అంది.

"అలాగా! మీ పిల్లల వయసెంత

ఇప్పుడు? " అడిగింది సుచిత్ర.

"అబ్బాయికి అయిదు, అమ్మాయికి మూడు. మేం ఈ దేశం వచ్చి రెండు సంవత్సరాలు అయింది. ఎప్పుడు ఇండియా వెళ్ల డానికైనా రెడీగా వున్నాం" అంది గర్వంగా అనసూయ.

"అలాగే చేయండి. మన దేశానికి మీవంటి వారే పేరు తెస్తారు" అంది సుచిత్ర.

"బహుశా మీకు నా మాటలు నచ్చలేదేమో! మరీ మూఢాచారం పాతకాలం మనిషిలా కనిపిస్తున్నట్టున్నాను" అంది అనసూయ.

"దానికేముందీ! మీ అభిప్రాయం మీరు చెప్పారు. మీ పరిచయానికి చాలా సంతోషం" అంది సుచిత్ర.

"మీరు ముప్పై సంవత్సరాలుగా ఈ దేశంలో వుంటున్నారనీ, అల్ట్రామోడ్రన్ అనీ, మీదీ మీ అమ్మాయిదీ ప్రేమ వివాహమనీ విన్నాను. ఈ దేశంలో ఇంతకాలంగా వుంటూ మీ భర్తతో బాగానే కలిసి వున్నారే!

ఈ దేశంలో డైవోర్స్ కేసులు చాలా ఎక్కువ. ఆకర్షణలూ ఎక్కువే! మీవార్ని వారి బారినుంచి కాపాడుకోగలిగారంటే చాలా గ్రేట్. అయినా అది మన భారతీయుల జీన్స్‌లోనే వుందండీ. ఒంటినిండా బట్టా, నరనరాన సంస్కృతీ, పొరబాటున కూడా ప్రలోభపడని మనస్తత్వం... జయచంద్రగారిని మెచ్చుకోవలసిందే" అంది అనసూయ.

మీ భర్తతో ఇంతకాలమూ బాగానే వున్నారే అనే అనసూయ మాట కొంచెం బాధ కలిగించినా, కొత్త మనిషి కదాని సౌమ్యంగా మాట్లాడింది సుచిత్ర.

"మిమ్మల్ని ఇప్పుడు చూశాను. తర్వాత కలిస్తే మన ఇద్దరిలో ఏమైనా మార్పు కనిపిస్తుందేమో చూద్దాం!! నైస్ టాకింగ్ టూ యూ..." అంటూ మరో చోటుకి కదిలింది సుచిత్ర.

"అయ్యో వుండండి. మిమ్మల్ని చాలా విషయాలు అడగాలనుకుంటున్నాను. కొత్తగా వచ్చాం కదండీ! అదిగో చూడండి, ఆ బ్లూషర్ట్, కళ్ళజోడూ, పొట్టిగా వున్నారే ఆయన మా హజ్బెండ్. పేరు గోపాలకృష్ణ" అంటూ దూరంగా వున్న భర్తను చూపించింది.

"సారీ అనూ... అనసూయా! ఇంకా చాలామందిని పలకరించాలి" అంటూ తప్పించుకుని వచ్చేసింది 'వయసుకి చిన్న. ఆలోచనల్లో పెద్ద! ఎవరో ఇంటి దగ్గిర ఈ అమ్మాయికి బాగా బ్రెయిన్ వాష్ చేసి పంపారు. మరో రెండేళ్ళ తర్వాత కనిపించినప్పుడు ఇలా మాట్లాడదు' అనుకుంటూ.

"చూసి కూడా చూడనట్టే వెళ్ళిపోతున్నావా సుచిత్రా? నేను విజయను" అంటూ సుచిత్రను పలకరించింది విజయ.

"ఓ విజయా! అయామ్ వెరీ సారీ. మీరు చాలా మారిపోయారు. గుర్తుపట్టలేదు" నొచ్చుకుంటూ చెప్పింది సుచిత్ర.

"అవును చాలా మారాను. ఓవర్ వెయిట్‌తో! నాలాంటివారు స్లిమ్‌గా వుంటే అందంగా వుండరు. ఛబ్బీగా వుంటేనే మంచి రంగుతో ముద్దుగా బాగుంటానంటాడు వెంకట్. అందుకని నేను డైటింగ్ జోలికి పోను. నా ఇష్టమైనట్టు వుంటాను" తన వెయిట్ గురించి సమర్థించుకుంది విజయ.

"సుచిత్రా! ఈమధ్యగానీ ఇండియా వెళ్ళావా నువ్వు? నేను వెళ్ళి సుమారు ఆరు సంవత్సరాలైంది. మా అబ్బాయి బదరీకి పెళ్ళి సంబంధం కావాలి. అమ్మాయి చదువుకోవాలి. అందంగా వుండాలి. భారతీయ సాంప్రదాయంతో అణకువగా పెద్దవారిని గౌరవించాలి. ఇంటిపనంతా చేయడానికి ఏమాత్రం విసుక్కోకూడదు. విలేజ్ గర్ల్ అయితే ఈ విధంగా వుంటారనుకుంటాను. ఈ పెళ్ళి సంబంధం గురించి ఇండియా వెళ్లాలి తప్ప, నాకు మహాబోర్ అనుకో వెళ్ళ

డమంటే!" అంది.

"మరయితే ఇక్కడ సెటిల్ అయిన ఇండియా అమ్మాయిని ఏ తానా మహాసభ ల్లోనో చూసుకుని ఎంపిక చేయవచ్చుగా! పనికట్టుకుని ఇండియా వెళ్ళాలా? " అడిగింది సుచిత్ర.

"నువ్వు ఇంకా రాకేష్‌కి అమ్మాయి సెలక్షన్‌దాకా రాలేదు. అనుభవం లేదు. ఇక్కడ పెరిగిన ఇండియన్ అమ్మాయి, అమెరికన్స్‌కి ఏమీ తీసిపోదు. మా బదరీ అసలే నోరులేని వాడు. ఎలా నెగ్గుకు రాగలడు? బంధువులంతా మన డబ్బు కోసం గాలం వేస్తారు. అందుకని మారేజ్ బ్యూరోలో రిజిస్టర్ చేయించి, సంబంధాలవేట ప్రారంభించాలి. ఇప్పుడు ఇండియా కూడా ఈ అమెరికాకి తీసిపోదట. ఎవరెవరో ఏదేదో చెబుతున్నారు" విజయ వాక్ప్రవాహం అలా కొనసాగుతుంటే మధ్యలో అడ్డుకుని,

"విజయా! ఎవరో ఏదో చెప్పారనుకోవడం దేనికీ? మీరూ వెళ్ళి చూడండి" అంది సుచిత్ర.

"ఆ... ఎలాగా వెడతాననుకో. నీ అభిప్రాయం కూడా తెలుసుకోవాలని అడిగాను" అంది విజయ.

విజయను తప్పించుకుని భర్త దగ్గరకు వచ్చి,

"హమ్మయ్య! అందర్నీ తప్పించుకుని నీ దగ్గిరకి వచ్చేసరికి ఇంత టైమ్ పట్టింది. లంచ్ పూర్తిచేసి మనం వెంటనే వెనక్కి వెళ్ళాలికదా..." అంది సుచిత్ర. జయచంద్రకో లంచ్ ప్లేట్ అందించి ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు.

"హలో! జయా, నువ్వు చాలా బిజీ. ఇలా ఈ మారేజ్‌కి వస్తావనుకోలేదు. హౌ ఆర్ యు సుచిత్రా? " రామారావ్, లక్ష్మి దంపతులు వచ్చి పలకరించేసరికి సుచిత్రకి తింటూన్న అన్నం గొంతుకడ్డంపడి ముక్కులోకి వెళ్ళి ఉక్కిరి బిక్కిరైంది. 'రిలాక్స్ డియర్... రిలాక్స్' అని సుచిత్రకి వాటర్ అందించి,

"రామారావ్! బిజీయే అనుకో. మరీ దగ్గిర వాళ్ళ ఫంక్షన్స్ మిస్ కాలేక వచ్చాను. ఏమిటీ సంగతులు? " అన్నాడు జయచంద్ర.

"సంగతులు కాక ఏమున్నాయ్? మనమంతా ఓ గ్రూప్ వాళ్ళమేకదా? ఎదిగిన పిల్లలూ, పెళ్ళి సమస్యలూను. నందితకి ఏమైనా సంబంధాలు వెదుకుతున్నారా? బెంగాలీయా? ఆంధ్రాయా? " అడిగాడు రామారావ్.

"ఆల్రెడీ నందితకి సెటిల్ అయింది. ఫిలిప్స్ అనీ, అతనితో. త్వరలో ఇన్విటేషన్ పంపిస్తాను" అన్నాడు జయచంద్ర.

"అదృష్టవంతుడివి. నీకు అట్టే కష్టంలేదు. మా లక్ష్మి సంగతి తెలుసుగా? ఇండియన్ అబ్బాయిని, ఆంధ్రా అబ్బాయినే చూడాలి అంటుంది" అన్నాడు రామారావ్ భార్యవైపు చూసి,

"అవునండీ! మనం ఈ దేశం వచ్చినంత మాత్రాన మన సాంప్రదాయం, మన సంస్కృతీ మరచిపోవాలా? అందుకని మా వాహినికి ముందే చెప్పాను. నువ్విక్కడ ఎవరో అబ్బాయిని చేసుకుంటానంటే కుదరదని. అయినా మా అమ్మాయిని మేం మొదటినుంచీ అలాగే పెంచాంలెండి. మా ఇద్దరిదీ మేనరికం. మా అమ్మాయికి వరస అయినవాళ్ళు లేకపోయారు కానీ, లేకుంటే వెదకాల్సిన పనేలేదు. అబ్బాయి విషయంలో కానీ, అమ్మాయి విషయంలో కానీ ఒప్పుకునేది లేదు. మన ఆచార వ్యవహారాలు, ఆ సంప్రదాయం ఎవరికి వస్తాయండీ? మా ఇంట్లో పిల్లల్ని చచ్చినా సరే ఇంగ్లీష్ మాట్లాడనీయను. తెలుగులో మాట్లాడవలసిందే! డ్రస్ విషయంలో నలుగుర్లో తిరిగేవాళ్ళని హేళన చేస్తారేమో, చిన్నబుచ్చుకుంటారని వూరుకున్నాను కానీ, జుట్టు కత్తిరించుకోనీయలేదు. తెల్లవాళ్ళతో స్నేహాలు చేయనీ లేదు మరి" అంటూ ఏదేదో మాట్లాడుతున్న





భార్యను మధ్యలో అడ్డుకుని,

"అబ్బ వూరుకో లక్ష్మీ! నీ పిల్లల గురించి ఎవరడిగారు...? మొదలుపెడితే ఆగవు కదా?" అని భార్యని మందలించి కాసేపు ఇండియా కబుర్లు చెప్పాడు రామారావ్.

అయినా లక్ష్మి సుచిత్రను వదిలిపెట్ట లేదు. "సుచిత్రా! మీ నందితకి ఏదో అయింది కానీ, మీ ఇంటికి తెచ్చుకునే కోడలి విషయంలో జాగ్రత్తపడు. మీ వంశం నిల బెట్టేది కోడలూ, మనవడే అనే విషయం మరచిపోకండి. మగపిల్లల్ని ఎర్రగా, బుర్రగా, సగం గుడ్డలతో తిరిగే ఆడపిల్లలు వల్లో వేసుకుంటారు. వెయ్యి కళ్ళతో కాసు కోవాలి. సుచిత్రా, ఇంకా మీ బెంగాలీ అమ్మాయిలైనా ఫర్వాలేదు. ఆంధ్రావాళ్ళ యితే రత్నాలే అనుకోండి. ఆ వినయం, ఒద్దికా చూస్తే ముచ్చటగా వుంటుంది. ఈ దేశం వచ్చి పదేళ్ళయింది. పిల్లలు ఎదుగు తున్నకొద్దీ, గుండెల్లో గుబులు మొదల య్యేది ఎలా వీళ్ళని కట్టడి చేయాలీ అని! నా శక్తి ధారపోసి, అనుక్షణం కనిపెడుతూ మొత్తానికి నా మాట వినేలా దారికి తెచ్చాను. అవునూ? నేనే అన్నీ చెబుతు న్నాను కానీ మీరేమీ మాట్లాడరు. నా మాటలు నచ్చలేదా?" క్షణం ఆగింది లక్ష్మి.

నన్ను మాట్లాడనిస్తున్నారా అనుకుని, "లక్ష్మిగారూ! నేను చెప్పేది ఏదీ లేదండీ. మీకూ, మాకూ చాలా తేడా వుంది. మా ఆలోచనలు మావి. మీ ఆలోచన్లు మీవి. మాది మంచి పద్ధతని సమర్థించుకోను. మిమ్మల్ని తప్పుపట్టను. మీరు అనుకున్నది జరగాలని మనసారా కోరుకుంటున్నాను. కానీ ఒక్క విషయం నేను చూసిన సంగతి చెబుతున్నాను. నాకు ఈ దేశంమీద ఎటు వంటి అభిప్రాయం లేదు. ఇక్కడ వీరిలా వుండాలనీ, ఇండియాలో ఇండియన్‌లా వుండాలనీ భావిస్తాను. అందుకే ఎవర్నీ విమర్శించలేను. అది నా బలహీనత కావచ్చు. పిల్లల గురించి మరీ ఎక్కువగా అంచనాలు వేయలేదు. వారికి నచ్చనివి బలవంతాన నెత్తిన రుద్దలేదు. ఇది తప్పో, ఒప్పో నాకు తెలియదు. మా పెళ్లిముందు జయచంద్ర ఇండియన్, నేనూ ఇండియన్‌ని అని ఇష్టపడలేదు. మా ఇద్దరిలో ఒకరికొ కరు నచ్చే గుణాలు వుండివుండాలి. వాటి గురించి కూడా మేము తర్కించుకోలేదు. అలాగే పిల్లల విషయం కూడా! మీరు నా పద్ధతి పాటించాలి అని జయను శాసించ లేదు. అలాగే అతను నన్ను శాసించలేరు. అడిగారు కాబట్టి చెబుతున్నాను. ఓసారి ఇండియా వెళ్ళినప్పుడు మా బంధువులతో కలిసి ఒక క్లబ్‌కి వెళ్లాం ఏదో మ్యూజికల్ ప్రోగ్రాం వుందంటే! ఓల్డ్ సాంగ్స్ వింటూంటే చాలా ఆనందం కలిగింది. అందరమూ మంత్రముగ్ధుల్లా వింటూ మంచి ప్రోగ్రాం చూస్తున్నాం అని చాలా సంతోషించాం. ఆ తర్వాత చూడండి అర్ధ నగ్న దుస్తులతో నృత్యాలు చేయడం మొద లుపెట్టారు ఆడా, మగా కలిసి! ఆరోజు వాలంటైన్స్‌డే సెలబ్రేషన్స్ కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేశారట. ఇక క్షణం కూడా కూర్చో లేక లేచి వచ్చేశాం. ఇది జరిగింది ఎప్పుడో తెలుసాండీ, అయిదు సంవత్సరాల క్రితం. ఒక నగరంలో! ఇండియా ఇంతగా ముందుకు పోయిందని సంతోషించమం టారా? ఇటువంటి విషయాలు వదిలిపెట్టి, మనకు నచ్చిన వాటి గురించి తృప్తి పడ మంటారా? నేను హేళన చేయడంలేదు. మంచీ చెడూ అనేవి అక్కడా, ఇక్కడా వుంటాయి. కేవలం ఒక్కదేశం, ఒక్క జాతికే సంబంధం వుంటుందని అనుకోరా దనే నా అభిప్రాయం"

అంతే! లక్ష్మి మొహం తెల్లగా పాలిపో యింది. నోటమాట రాక ఎలాగో తేరుకుని భర్తని వెళ్ళిపోదాం పద అంటూ లాక్కుని పోయింది. కూతురు పెళ్ళిచేస్తున్న ప్రసా ద్‌తో కాసేపు మాట్లాడి పెళ్ళయిన వెంటనే తిరుగుప్రయాణం కట్టారు.



"జయా! మనం ఈ దేశం వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాం. చాలామంది వచ్చిన కొత్తలో ఇక్కడివారితో బాగానే కలిసిపోయారు. పిల్లలు పెద్దవాళ్లు అయ్యేసరికి మనం, మనదేశం, సాంప్రదాయం... అది నిలబెట్టాలంటే ఇండియా వెళ్ళి తగిన సంబంధాలు వెదుక్కోవాలనే భావిస్తున్నారు. మనకులా ఇక్కడ స్థిరపడిన ఇండియన్ ఫ్యామ్లీస్‌లో అబ్బాయిలను అల్లుడిగా కానీ, అమ్మాయిలను కోడలిగా కానీ అంగీకరించడంలేదు. ఎందువలన అంటావు? " అడిగింది సుచిత్ర.

"చిత్రా! మనలాటి బేధభావం లేనివారూ వున్నారు. కానీ చాలావరకూ నువ్వు చెప్పిన విధంగా ఇండియా వెళ్ళి పెళ్ళి సంబంధాలు వెదుక్కోవడానికి ముఖ్య కారణం మన దేశంలో పెరిగిన అమ్మాయిల తీరు వేరు, అబ్బాయిల ఆలోచన్లు వేరు కావడమే అని అనుకుంటాను" అన్నాడు జయచంద్ర.

"నందిత అసలు ఇండియన్ అబ్బాయిల గురించి ఆలోచించలేదు. నీలూ ఏం చేస్తుందో... లక్ష్మి ఏం చెప్పిందో తెల్సా? అమ్మాయిలు ఇంకో ఇంటికి కోడళ్ళుగా వెడతారు కనుక ఏ దేశం అబ్బాయిని చేసుకున్నా మనకి బాధలేదు. మన ఇంటికి తెచ్చుకునే కోడలు ఖచ్చితంగా మన దేశం అమ్మాయే అయివుండాలి. మీ రాకేష్ గురంచయినా జాగ్రత్తపడమని, నాకు వార్నింగ్ ఇచ్చింది..." అంటూ పకపకా నవ్వింది సుచిత్ర.

"ఇకనేం! ఇంటికి వెళ్ళగానే రాకీకి లెసన్స్ స్టార్ట్ చెయ్" తనూ నవ్వుతూ చెప్పాడు జయచంద్ర.

నందితకీ, నీలిమకీ స్వభావంలో తేడా వుంది. అందుబాటులో వున్నది అందిపుచ్చుకుని సుఖపడగలదు నందిత.

తనకంటూ ఏంకావాలో తెలుసుకోలేనిది నీలిమ. కనుక మన సపోర్ట్ అవసరం అని నేను అనుకుంటున్నాను. అందుకు నేనొక ప్లాన్ చేశాను. ఇండియాలో నా ఫ్రెండ్స్ ఇద్దరు వున్నారు. వాళ్ళ అబ్బాయిల గురించి ఈసారి మనం వెళ్ళినప్పుడు తెలుసుకుంటాను. మనకి తగినవాళ్ళు అనిపిస్తే నీలిమకి పరిచయం చేద్దాం. నీలిమ వాళ్ళని ఎలా రిసీవ్ చేసుకుంటుందో చూద్దాం. అప్పుడు అబ్బాయి సెలక్షన్ సులువు అవుతుంది. ఇదంతా పూర్తి కావడానికి రెండు మూడు సంవత్సరాల టైమ్ పడుతుంది. వెంటనే ఎవరూ నిర్ణయాలు తీసుకోలేరు కదా? " అన్నాడు జయచంద్ర తన మనసులో మాట చెబుతూ.

"అంటే వాళ్ళు గ్రూమ్స్ అంటూ నీలూకి చెప్పకుండా వుండాలన్నదే నీ ప్లాన్. అవునా? " అడిగింది సుచిత్ర.

"అవును. ముందుగా చెప్పను. నా ప్లాన్ ఫెయిల్ అయితే నీదే తర్వాత అల్లుడి సెలక్షన్ ఛాన్స్" అన్నాడు జయచంద్ర.

"అంతేకానీ మొదటి ఛాన్స్ నాకివ్వరన్న మాట. కన్నతల్లినైన నాకు చివరి ఛాన్స్ ఇస్తారా? " కోపం నటిస్తూ అంది సుచిత్ర.

"మనిద్దర్లో మనకి మొదట చివర అని ఏముందీ? అమ్మాయి ఛాన్స్ నాది. అబ్బాయి ఛాన్స్ నీకు" అన్నాడు జయచంద్ర సుచిత్ర భుజంమీద చేయివేసి అనునయిస్తూ.

"రాకేష్ మాత్రం? నీ సుపుత్రుడేగా? అటువంటి పెద్ద ఆశ నాకు లేదు. కానీ ఈ సంవత్సరం మనం ఇండియా వెడతామా? మహేష్‌తో అలా చెప్పానుకానీ నీకూ కొన్ని సెంటిమెంట్స్ వున్నట్టున్నాయే" సరదాగా అంది సుచిత్ర.

"ఇప్పుడు మహేష్, రామారావు అన్నారని కాదు, నాకే ఈ ఆలోచన ఎప్పటినుంచో వుంది" అన్నాడు జయచంద్ర.

"అయితే నందితా, ఫిలిప్స్ వస్తారా మనతో? " అడిగింది సుచిత్ర.

"లేదు. అడగలేదు. బహుశా రాకపోవచ్చు వాళ్ళు యూరప్ వెళ్ళాలనుకుంటు

న్నారుకదా? వేరేగా ఇంకోసారి వెళ్ళచ్చు వదిలేద్దాం వాళ్ళనలా" అన్నాడు.

ఓరోజు డిన్నర్ చేస్తూ అందర్నీ అడిగాడు జయచంద్ర. "మామ్, నేనూ ఇండియా వెళ్ళాలనుకుంటున్నాం. ఎవరొస్తారు మాతో? " అని.

"డాడ్! నేను వస్తా" మొట్టమొదట చెప్పాడు రాకేష్.

"మామ్సుపెట్ నువ్వు ముందుగా రెడీ అవుతావని తెల్సులేవోయ్ బ్రదర్! ఎన్ని వారాల ట్రిప్ డాడ్? " అడిగింది నీలిమ.

"ఫోర్ వీక్స్ అనుకుంటున్నాను. అవసరం అయితే మరో రెండు వారాలు" అన్నాడు జయచంద్ర.

"నేను సమ్మర్ క్లాస్ తీసుకుందామనుకుంటున్నాను. ఈసారి మీరు వెళ్ళిరండి మామ్. నేను క్రిస్మస్ హాలీడేస్‌కే వెడతాను" అంది నీలిమ.

"అసలు సంగతి ఏమంటే మనం వెళ్ళేది క్రిస్మస్ హాలీడేస్‌కి. మేము ముందు వెడతాం. లాస్ట్ టూ వీక్స్‌కి నువ్వు రా" అన్నాడు జయచంద్ర.

"ఓ.కే. డాడ్" అంటూ అంగీకరించింది నీలిమ. డిసెంబర్ ఒకటోతేదీకి బయలుదేరుతున్నట్టు జనార్ధనం బాబాయికి ఈ మెయిల్ పంపించాడు జయచంద్ర.

"జనార్ధనం హైదరాబాద్‌లో చక్కని ఫామ్‌హౌస్ కట్టుకున్నాడు. అక్కడ మే నెల మండువేసవి కూడా చల్లగా హాయిగా వుంటుంది. జయచంద్రకి బాబాయి ఇల్లంటే చాలా ఇష్టం.

"ఏరా జయా, ఈసారి అమ్మాయిలిద్దరూ రాలేదు? ఇల్లు సందడే లేదు. వాళ్ళు లేకపోతే" అన్నాడు జనార్ధన్.

"ఎప్పుడూ మన కంపెనీయేనా బాబాయ్? వయసులో పిల్లలు తగిన జోడీ వెదుక్కుంటారు. ఆ విషయం తర్వాత తీరికగా చెబుతాను" అన్నాడు జయచంద్ర.

భోజనాలు అయ్యాక మధ్యాహ్నం కాస్త బడలిక తీర్చుకుని కబుర్లలో పడ్డారు. అప్పుడు నందిత ఎంచుకున్న కాబోయే వరుడు ఫిలిప్స్ గురించి చెప్పి ఫొటోలు చూపించాడు. జనార్ధనం భార్య జానకి ఆత్రంగా తనూ ఫొటోలు చేతికి తీసుకుని "బాగున్నాయ్ జయా! అమెరికన్ అల్లుడు. నీది సర్వమానవ సౌభ్రాతృత్వం. నా దేశం, పరాయిదేశం అంటూ బేధంలేని ఆదర్శం నీది. కాని మేము నందిత పెళ్లి చూడలేంకదా? " అని దిగులుపడింది.



"ఎందుకు చూడలేమోయ్ VCDలో మహా చక్కగా చూడవచ్చు" అన్నాడు జనార్ధన్.

"అదేమిటి బాబాయ్ మీరు పెళ్ళికి రావల్సిందే! టికెట్ పంపిస్తాను" అన్నాడు జయచంద్ర.

"అవునండీ వెడదాం. నాకు అమెరికా చూడాలనివుంది" అంటూ ఉత్సాహం చూపించింది జానకి.

"టెండరు పెట్టేశావూ? చూడరా జయా! తీర్థయాత్రలు చేయాల్సిన ఈ వయసులో హనీమూన్ బయలుదేరుతోంది మీ పిన్ని" పరిహాసంగా అన్నాడు జనార్ధన్.

"తీర్థయాత్రలైనా, హనీమూన్ అయినా అర్థం ఒకటే బాబాయ్. దేవుడు ప్రకృతిలో

లేదూ? కొత్త దంపతులు దైవదర్శనానికి ఆశీస్సులకోసమే కదా వెళ్లేది! ముక్తీ, రక్తీ పక్కపక్కనే వుంటాయిలే! ప్రకృతి వీక్ష ణంతో రక్తీ, భగవద్దర్శనంతో ముక్తీ ఏకకా లంలో ప్రాప్తిస్తాయి. అయినా బాబాయ్! ఇక్కడ మనదేశంలో ఏభై సంవత్సరాల వయసుకే వృద్ధాప్యం వచ్చిందనీ, కొన్ని కట్టు బాట్లు విధించుకుని ఎంజాయ్‌మెంట్‌కి దూరంగా వుంటారు. జీవితాంతం ఎంజాయ్ చేయడంలో తప్పులేదు. మనసు ప్రధానం కానీ వయసు కాదు. పిన్ని సరదా పడటం తప్పుకాదు" అన్నాడు జయచంద్ర.

"జయా! ఏదో మన ఎదుట అలా అంటు న్నారు కానీ, జనార్ధనం మామ ఓల్డ్‌మాన్ అనుకోవడంలేదు. మామా, అత్తా ఈ మధ్యన గోవా ట్రిప్ వెళ్ళి వచ్చారట. ఇవిగో పిక్చర్స్ చూడు" అంటూ ఆల్బమ్ ఒకటి తెచ్చి ఇచ్చింది సుచిత్ర.

ఆల్బమ్ చేతిలోకి తీసుకుని తిరగేస్తూ "ఔనా బాబాయ్? వరసకి మనం పిలుచు కోవడమే కానీ మనిద్దరికీ తేడా నాలుగేళ్లు కదా? మీరెప్పుడూ లైఫ్‌ని ఇలాగే ఎంజాయ్ చేయాలి. వెరీగుడ్" అంటూ మెచ్చుకు న్నాడు.

రెండు వారాలు గడిచాయి.

ఓరోజు జనార్ధనంతో తన ఆలోచన వివ రించాడు జయచంద్ర.

"బాబాయ్! జయదేవ్‌కి ఒక అబ్బాయి, భార్గవకి ఒక అబ్బాయి వున్నారని విన్నాను. నీలిమ నందితలా కాదు. తనంతగా వరుణ్ణి వెదుక్కోడానికి ముందుకురాదు. అందుచేత నేను జయదేవ్, భార్గవల కొడుకుల్ని చూసి, నీలిమ వచ్చే టైమ్‌కి పరిచయం చేస్తే బాగుండునని ఆలోచిస్తున్నాను. మన బంధువులే కదా? వారి గురించి నీ అభి ప్రాయం ఏమిటీ? " అడిగాడు జయచంద్ర.

"నీలిమను మొదట ఇండియన్ అబ్బా యిని, మన బంధువుల్లో వారిని ఇష్టపడు తుందో లేదో అడిగి చూశావా? " అన్నాడు సందేహంగా జనార్ధన్.

"లేదనుకో! తరచుగా వాళ్లని ఇండియా తీసుకురావడం అక్కడా ఇక్కడా మనుషుల్లో తేడాలు, ప్రవర్తనా తెలియాలనే ఆలోచన తోనే! పరిచయాలు ఇష్టంగా మారవచ్చున నేది నా సిద్ధాంతం" అన్నాడు జయచంద్ర.

"ఏమ్మా సుచిత్రా! నీ అభిప్రాయమూ అదేనా? అమెరికాలో పుట్టిపెరిగిన నీలిమ ఎన్నిసార్లు ఇండియా వచ్చినా తన లైఫ్ పార్టనర్‌ని ఎవరిని ఎంచుకుంటుంది అనేది మనం చెప్పలేం. నీకోసం తెలుగు నేర్చుకుని, నీకోసం ఇండియావచ్చి, నీ సంతోషంకోసం భారతీయ దుస్తులను ధరించినప్పటికీ, పెళ్ళి విషయంలో ఒక స్వంత ఆలోచన వుండక పోదని నేను అనుకుంటున్నానురా జయా" అన్నాడు జనార్ధన్.

"మామా! మేము ఇప్పుడు నీలిమకు మారేజ్ ప్రపోజల్ చేయం. జస్ట్ బంధువు లని పరిచయం చేస్తాం. ఈ రోజుల్లో అమ్మాయిలు ఒక అబ్బాయిని చూసిన వెంటనే పెళ్ళిచేసుకునే అభిప్రాయానికి రారు. చాలా టైమ్ తీసుకుంటారు. అంటే నాలుగు సంవత్సరాల తర్వాత తమ అభి ప్రాయం చెబుతారు. ఇలా అని, మా కపుల్స్ అనుకున్నాం" అంటూ చెప్పింది సుచిత్ర.

"సుచిత్ర అబ్బాయి జయచంద్రనే సపోర్ట్ చేస్తుంది. ప్రేమించడానికీ, పెళ్ళికీ ఈ కాలం అమ్మాయేకానీ ఇల్లాలిగా భర్త మాటనే బల పరుస్తుంది" అంది జానకి.

"మరి? నీలా అనుకున్నావా? అన్నింటికీ డామినేషన్ తమరిదే? నన్ను నోరు మెదప నిస్తావా? అమ్మాయి సుచిత్ర బుద్ధిమంతు రాలు" అన్నాడు కొంటెగా జానకిని ఏడిపిం చాలని.

సుచిత్రకి తెలుగు వచ్చినా, ఇలా నర్మగ ర్భంగా మాట్లాడితే అర్థంచేసుకోలేదు. భార్యాభర్తలిద్దరివైపూ వింతగా చూసి జయ చంద్రతో "నేను తప్పుగా అన్నానా? " అని




అడిగింది.

జయచంద్ర ఇంగ్లీష్‌లో సుచిత్రకి అర్థంఅయేలా చెప్పాడు.

"బాబాయి, పిన్నీ సరదాగా ఒకరినొకరు పరిహాసం చేసుకుంటున్నారు. నిన్ను కామెంట్ చేయలేదు.

★ ★ ★

జనార్ధనం, జానకి, జయచంద్ర, సుచిత్రా, జయదేవ్ వాళ్ళ ఊరికి విశాఖపట్నం వెళ్ళారు ముందుగా వస్తున్నట్టు ఫోన్ చేసి! ఇక జయదేవ్, జయచంద్రని మెప్పించడానికి నానా తంటాలూపడ్డాడు. అతని భార్య సుమిత్ర వెండి పళ్ళాలతో ఫలహారాలు, బంగారు ఆకుల్లో భోజనాలు... రంగరంగ వైభవంగా తమ తాహతు తెలియచేసింది. వాళ్ల అబ్బాయి మరో అడుగు ముందుకేసి ఏకంగా సుచిత్ర కాళ్ళకు వంగి నమస్కారం చేశాడు. ఎ.సి. రూమ్‌లో కూర్చోబెట్టి పట్టు విసినకర్రతో విసురుతూ ఉపచారాలు చేశాడు.

రాకేష్ తండ్రి పక్కన చేరి "డాడ్... మరీ ఓవర్ యాక్టింగ్‌లా కనబడుతోంది" అంటూ చెవిలో చెప్పాడు.

"య్యా...! నేనూ అలాగే అనుకుంటున్నాను. ఉష్... సైలెంట్" అన్నాడు జయచంద్ర కొడుకుని వారిస్తూ.

అడుగడుగునా మర్యాదలూ, అట్టహాసాలు చూసిన జనార్ధనానికి మతిపోయింది. 'ఆడపిల్లగల వాళ్లు మగపిల్లవారికి, మర్యాదా మంచీ చూపించడం మామూలు. ఇక్కడంతా రివర్స్ అవుతోంది. అమెరికా మహిమ' అనుకున్నాడు మనసులో.

జానకి, సుమిత్ర ఇంట్లో సామాను చూసి 'ఈసారి నేను ఇలాంటివి రెండయినా పళ్లాలు కొనాలి" అనుకుంటోంది.

సుచిత్రకి ఇలా వాళ్లు ధనవంతులమని అడుగడుగునా ప్రదర్శించడం చిరాకుగా అనిపించినా, అబ్బాయి మంచి పేరున్న ఇన్స్టిట్యూట్‌లో మెరిట్‌తో చదివాడు కదాని సరిపెట్టుకుంది.

"ఒరేయ్ దేవ్! నువ్వు నన్ను పరాయివాడుగా చూస్తున్నావ్. ఇదంతా ఏమిటీ? చాలాకాలం అయింది. ఓసారి చూసి వెళ్ళాలని వచ్చాను. మామూలుగా మన చిన్ననాటి జయదేవ్‌లాగే వుండరా" అన్నాడు జయచంద్ర.

"చిన్నప్పుడంటారా ఏమీ తెలియని వయసు. ఇప్పుడలా వుండగలమా? మీరు అమెరికాలో చాలా ధనవంతులనీ, ఆరు కార్లు, ఎనిమిది బంగళాలు వున్నాయనీ... చాలాచాలా వింటున్నాను. వెదుక్కుంటూ ఇన్నాళ్లకి మా ఇంటికి వస్తే, ఈ మాత్రం మర్యాద చేయడం తప్పంటావా? అమ్మా! సుచిత్రగారూ మీరు తెలుగు మాట్లాడటం నాకు చాలా ఆనందంగా వుంది. మా ఆవిడకి ఇంగ్లీషురాదు. ఏమనుకుంటారో అని భయపడ్డాను. చాలా సంతోషం అమ్మా! సుమిత్రా తీసికెళ్ళి ఇల్లు చూపించు. నీ నగలూ, పట్టుచీరలూ చూపించు" అన్నాడు భార్యతో.

జయచంద్రా, జనార్ధనం. జయదేవ్ కొడుకు శశికాంత్‌ని అతను చదివిన యూనివర్సిటీ, చేసే ఉద్యోగం వివరాలూ అడిగి తెలుసుకున్నారు. శశికాంత్ మరీ తల్లీతండ్రీలా లేదు. బాగానే మాట్లాడుతున్నాడు. లేనిపోని భేషజానికి పోలేదు. 'నయమే ఇతనూ తండ్రిలాగే ప్రవర్తిస్తే వెంటనే వెనక్కి వెళ్లాల్సివచ్చేది' అనుకున్నారు.

మర్నాడే బయలుదేరి చుట్టుపట్ల చూడాల్సిన ప్రదేశాలు చూసి, ఇంటికి వచ్చేశారు. వచ్చేముందు నీలిమ వచ్చాక పరిచయం చేసుకోవచ్చు శశికాంత్‌ని రమ్మని ఆహ్వానించారు.

భార్గవ బెంగుళూర్‌లో వున్నాడు. జయదేవ్‌కీ ఇతడికీ చాలా తేడా వుంది. బహుశా పరిసరాలు, చేస్తున్న ఉద్యోగం కారణాలు కావచ్చు ముందుగా ఫోన్ చేయడం వలన ఎయిర్‌పోర్ట్‌కి వచ్చి ఆదరంగా అభిమా

నంగా పలకరించాడు. ఇంటికి రాగానే కుటుంబసభ్యుల్ని పరిచయం చేశాడు. భార్గవ భార్య కూడా ఎంప్లాయీ. సింపుల్‌గా ఫ్రీగా మాట్లాడింది. ఆమె పేరు రత్న.

"జయచంద్రా! చాలా కాలానికి కలిశాం. నువ్వు తరచు ఇండియా వచ్చినా, ఆ టైమ్‌కి నేను ఊళ్లో లేకపోవడంతో కలుసుకోలేక పోయాం. నేను అమెరికా వచ్చినా, నువ్వు అందుబాటులో లేకపోవడం జరిగింది. ఏమైనా, అవసరాలు కూడా మనిషిని గుర్తుచేయచ్చు" అంటూ సగం నిష్ఠూరంగా మాట్లాడాడు భార్గవ. భార్గవ మాట్లాడిన మాట కొంతవరకూ నిజమే అయినా వూహించని అతడి మాటతో క్షణం జవాబు చెప్పలేకపోయాడు జయచంద్ర.

అతడి ఇబ్బంది కనిపెట్టిన జనార్ధనం "భార్గవా! నువ్వు చెప్పిన మాట అక్షరాలా నిజం. అయితే జయచంద్ర, నువ్వూ ఒకే ప్రొఫెషన్‌లో వున్నారు కాబట్టి, అతడి పరిస్థితిని నువ్వు గ్రహించగలవు. ఈసారి ట్రిప్‌లో మిమ్మల్ని కలుసుకోవాలని ముందే అనుకున్నాడు. టేకిట్ ఈజీ" అన్నాడు సౌమ్యంగా.

"వెరీసారీ! మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని కాదు. మనసులో వున్నది పైకి చెప్పడం నా అలవాటు. ఈరోజుల్లో అమ్మాయిగలవారు మాత్రమే పెళ్ళి సంబంధాలు చూసుకోవడంలో ఇబ్బందులు ఎదుర్కోవడంలేదు. అబ్బాయిలు కలవాళ్లం కూడా, అదే ఇబ్బందులను ఎదుర్కొంటున్నాం. కోడలిగా వచ్చే అమ్మాయి మా కుటుంబంలో కలిసిపోగలదా లేదా? లేక తనూ, భర్తా మాత్రమే ఒకటిగా వుండాలి. మిగిలినవారితో నాకు ఎటువంటి సంబంధమూలేదు అనే అమ్మాయిలు వస్తారా అని భయపడుతూంటాం. అందువలన పై సంబంధాలకు పోకుండా, దగ్గిర బంధువుల్లో అమ్మాయిలే నయం అని కూడా అనుకుంటూ వుంటాం" అన్నాడు భార్గవ.

భార్గవ సూటిగా పెళ్ళి సంబంధాల ప్రసక్తి తీసుకురాగానే ఇబ్బందిగా ఫీలయ్యాడు జయచంద్ర. భార్గవను చూసిన సంతోషం ఆవిరైపోయింది. ఎంత మనసులో మాట దాచుకోకపోయినా ఒక పద్ధతి, సమయం అంటూ పాటించని భార్గవలో ఒకరకమైన అహంకారం కనిపిస్తూంటే చొరవగా మాట్లాడలేకపోయాడు. ఎంత త్వరగా వెళ్ళిపోదామా అనిపించింది. పైగా భార్గవ తన కొడుకు అభిరాంని పరిచయం చేసిన తర్వాత అతను మళ్ళీ కనిపించనేలేదు. రత్న సంస్కారంగా, సభ్యతగావున్నా, ఎక్కువగా మాట్లాడటంలేదు. బహుశా భార్గవ ప్రభావం కాబోలు. జానకీ, సుచిత్రా కూడా చాలా ఇబ్బంది పడుతున్నారు ఆ వాతావరణంలో వుండలేక! కొంతవరకూ జయదేవ్ బెటర్‌గా అనిపించాడు.

"ఇంతకీ జయచంద్రా, మీ అమ్మాయిలు రాలేదన్నమాట" అడిగాడు జయదేవ్.

నందిత గురించి చెప్పకుండా వుండటం మంచిదని "రాలేదు. ఈసారి మేం ముగ్గురమే వచ్చాం" అన్నాడు జయచంద్ర.

"అయితే నువ్వు మీ అమ్మాయిల్లో ఎవరికి మా అబ్బాయిని అడగాలని వచ్చావూ? "

సమాధానం ఏం చెప్పాలా అని ఆలోచిస్తుంటే జనార్ధనం అన్నాడు, "అబ్బే! ఎవరికో అడగాలని కాదూ. వూరికేనే నిన్ను సరదాగా చూడాలని వచ్చాడు" అని.

"ఓహో! నేనింకా నీ కూతుళ్లు నీ చెప్పుచేతల్లోనే వున్నారనుకున్నాను. నా పిచ్చిగాని, అక్కడ పుట్టి పెరిగిన పిల్లలు ఎలా వుంటార్లే. అయితే నీకు సమస్యేలేదు. వాళ్లు పెళ్ళంటూ చేసుకోకపోవచ్చు చేసుకున్నా నిన్ను అడిగి చేసుకుంటారా? " అన్నాడు అదోలా.

ఎయిర్‌పోర్ట్‌లో అభిమానంగా, ఆదరంగా మాట్లాడిన మనిషి, ఇంటికి వచ్చాక ఇలా ఎందుకు మాట్లాడుతున్నాడో అర్థంచేసుకోలేక 'ఎరగకపోయి వచ్చాను' అనుకున్నాడు

జయచంద్ర.

జనార్ధనానికీ, జానక్కీ భార్గవ తీరు చూస్తే ఒళ్లు మండిపోయింది. మొహం వాచేలా జవాబు చెప్పాలనుకున్నారు. కానీ ఇటువంటి మనిషితో మాట్లాడటం మరింత ప్రమాదం అని వూరుకున్నారు.

ఎలా అయితేనేం భార్గవనుంచి తప్పించుకుని బయటపడి ఊపిరి పీల్చుకున్నారు.

నీలిమ వచ్చింది. శశికాంత్ గురించి చెబుదామా? వద్దా? అనుకున్నారు. తీరా నీలిమ వచ్చాక నువ్వోసారి రా అని శశికాంత్‌కి చెప్పాంకదాని "నీలూ, మన బంధువులు విశాఖపట్నంలో వున్నారు. వాళ్ళ అబ్బాయి నీకు కంపెనీ ఇస్తాడు. కబురు చేయనా? " అడిగాడు జయచంద్ర.

"అలాగే! నేను ట్రావెల్ చేయాలనుకుంటున్నాను. తోడుగా వస్తాడేమో" అంది.

ఫోన్ చేయగానే శశికాంత్ వచ్చాడు. తప్పకుండా నీలిమకి కంపెనీ ఇస్తానన్నాడు. వాళ్లు వెళ్లిపోయాక, "మనం మాత్రం ఏం చేస్తాం ఎటైనా వెడదాం" అంది సుచిత్ర.

"బాబాయ్, పిన్నీ మీరిద్దరూ కూడా బయలుదేరండి. ఎటైనా వెడదాం" అన్నాడు జయచంద్ర.

"అయితే సైట్‌సీయింగ్‌కా? హిస్టారికల్ ప్లేసెస్‌కా? పుణ్యక్షేత్రాలకా? " అన్నాడు రాకేష్.

"చాయిస్ నీదిరా రాకీ! నువ్వేదంటే అది" అన్నాడు జనార్ధనం.

"ఊ... నాకయితే హిస్టారికల్ ప్లేసెస్ అంటేనే ఇంట్రస్ట్" అన్నాడు రాకేష్.

"ఓకే... ఇప్పుడే ఏర్పాటు చేస్తాను" అంటూ జనార్ధనం ట్రావెల్ ఏజంట్‌తో మాట్లాడి అన్నీ సిద్ధంచేశాడు.

జయచంద్రా, సుచిత్రా ఇండియా అంతా ఇంతకుముందే చూశారు. రాకేష్ చూడనివి వుండటంతో ఇప్పుడు చాయిస్ వాడికే వదిలారు. రాకేష్‌కి హిస్టరీ సబ్జక్ట్ చాలా ఇష్టం చిన్నప్పట్నించీ. చాలా బుక్స్ చదివాడు. ఢిల్లీ, ఆగ్రా, జైపూర్, మొదలైనవీ వీలునుబట్టి, కవర్ చేయగలిగితే మిగిలినవీ చూడాలని అనుకున్నాడు.

"మనం ఫ్లైచేస్తే చాలా టైమ్ సేవ్ అవుతుంది. అప్పుడు ఇంకా కొన్ని చూడవచ్చు" అంది సుచిత్ర.

"అబ్బ! ఫ్లై చేయాలంటే బోర్. నాకు ట్రైన్ జర్నీయే ఇష్టం మామ్" అన్నాడు రాకేష్.

హైదరాబాద్‌నుంచి ఢిల్లీ ఫ్లై చేసి ఢిల్లీ నుంచి ఆగ్రా డ్రైవ్ చేసుకుని వెళ్లారు. ఆగ్రాలో తాజ్‌మహల్ చూసి రాకేష్ మురిసిపోయాడు. లెక్కలేనన్ని యాంగిల్స్‌లో పిక్చర్స్ తీసుకున్నాడు. వీడియో తీశాడు. వెన్నెల్లో పసివాడిలా గంతులు వేశాడు.

"రాకీ నీకు నచ్చింది కట్టడమా? లేక పరిసరాలా? దీని చరిత్రా? ఏదిరా" అన్నాడు జయచంద్ర.

"మొదట నచ్చింది ఇది కట్టినవారి పనితనం. ప్లాన్ చేసిన ఆర్కిటెక్ ఎవరో కానీ ఆయన గొప్పతనం. దీని వెనకాల స్టోరీ లవ్, ఎఫెక్షన్ గురించి అనుభవం లేదు. ఇక పరిసరాలు ఇంకా బ్యూటిఫుల్‌గా తీర్చిదిద్దవచ్చు ఇక చరిత్ర గురించి చెప్పుకోవాలంటే తండ్రి, కొడుకులనే అనుబంధం కంటే పరువు, ప్రతిష్టలూ, మాటపట్టింపులూ ఇప్పటి జనరేషన్‌కి సిల్లీగా కనిపించవచ్చును" అన్నాడు ఎంతో అనుభవం వున్న వాడిలా.

జానకి రాకేష్ భాషా పరిజ్ఞానికి విస్తుపోయింది. వీడు ఎన్ని బుక్స్ చదివాడో అనుకుని "తెలుగు పుస్తకాలూ, చదివావా రాకేష్? " అడిగింది.

"అవును గ్రాండ్‌మా! మామ్ ఎన్నో బుక్స్ తెచ్చి ఇచ్చేది. అలా చదివాను. నా ఫేవరెట్ సబ్జక్ట్ హిస్టరీ కదా? అందుకని ఇండియన్ హిస్టరీ బుక్స్ కూడా చదివాను" అన్నాడు రాకేష్.

"తెలుగు బాగా తెలిసిన నేనే అంత వివ

రంగా చెప్పలేను. అమెరికాలో పుట్టిపెరిగిన రాకేష్ ఎంత బాగా మనకు కూడా తెలియనివి చెప్పాడు?" అంటూ ఒకటే ఆశ్చర్య పడింది జానకి.

"అదేమరి. ఇక్కడ పుట్టి పెరిగినవాళ్ళం. మనదేశ చరిత్ర మనకు తెలియదు. ఏదో షాజహాన్ చక్రవర్తి తన భార్య మీద గల ప్రేమకు గుర్తుగా తాజ్‌మహల్ నిర్మించాడని మాత్రమే తెలుసు. ఒక్కక్షణం మనం ఈ మహల్ నిర్మించిన కూలీల గురించి కానీ, ఇంత అందంగా మందిర నిర్మాణానికి ప్లాన్ చేసిన ఇంజనీర్ గురించి కానీ ఆలోచించలేదు. ఇప్పటి పిల్లలు చూడు ఎంత డీప్‌గా ఆలోచిస్తారో. అందులోనూ అమెరికాలో పుట్టి పెరిగిన పిల్లల గురించి చెప్పాలా? రాకేష్ వంటి పిల్లలు అటు అమెరికా, ఇటు ఇండియాను సమానంగా ప్రేమించడం ఎంతైనా మెచ్చుకోవాలి. ఇదంతా వాళ్ళ అమ్మా, నాన్నల పెంపకంలోని గొప్పతనం" అన్నాడు జనార్ధనం.



"బాబాయ్ మీరు మరీ పొగిడేస్తున్నారు కానీ మేము ఈ దేశం గురించి పిల్లలకు ప్రత్యేకంగా వివరించలేదు. తరచుగా రెండేళ్ళకోసారి వాళ్ళని ఇండియా తీసుకురావడం, వాళ్ళంతగా వాళ్ళు ఇష్టపడి అన్ని విషయాలు తెలుసుకోవడం తప్పితే మేము ఏమీ చేయలేదు. సరికదా వాళ్ళకి ఎటువంటి ఆంక్షలూ విధించనూలేదు. చాలా మంది అనుకుంటారు. ఇలా చెయ్యమని శాసించినప్పుడే వాళ్ళకి మనదేశం పట్లా, మన సంస్కృతీ, సంప్రదాయాల పట్లా అవగాహన వస్తుందని! మేము మాత్రం అలా అనుకోలేదు. స్వతసిద్ధంగా తెలుసుకోవాలంటే కుతూహలం, శ్రద్ధా వాళ్ళకే వుండాలనుకున్నాం. నేను పుట్టి పెరిగిన ఊరు, పరిస్థితులు, కుటుంబం గురించి మాత్రమే వాళ్ళకి పరిచయం చేశాను. అలాగే సుచిత్ర తల్లితండ్రులూ, వాళ్ళ ఊరు గురించీ చెప్పాం. మేం అమెరికాలో కలుసుకోవడం, పెళ్ళి చేసుకోవడం గురించీ చెప్పాం. సరే వాళ్లు పుట్టి పెరిగిన అమెరికా గురించి ఎలాగా తెలుసుకున్నారు" అన్నాడు జయచంద్ర.

"చాలా బాగుందిరా జయా! నీ పాలసీ నాకు బాగా నచ్చింది. బలవంతాన ఏదీ నెత్తిన వేయకూడదూ అన్నావు చూడు అదే నాకు నచ్చింది. నెక్స్ట్ మనం జైపూర్ వెడుతున్నాం రాకేష్. జైపూర్ గురించి నీకు తెలిసింది ఏమిటో చెప్పు. వింటాను. వినడం కాదు. నేనూ తెల్సుకుంటాను" అన్నాడు జనార్ధనం రాకేష్‌ని ఉత్సాహపరచడానికి.

"పో. గ్రాండ్ ఫా. నీకంతా తెలుసు. వూరికే నన్ను అడుగుతున్నావు. నాకెంతవరకూ తెలుసో అని కూడా అడుగుతున్నావేమో" అన్నాడు రాకేష్.

"చెప్పు రాకేష్. గ్రాండ్ ఫాకి తెలుసు అనుకో. నాకు తెలియదుగా" అంది జానకి.

రాకేష్‌కి ఎలా చెప్పాలో తెలియలేదు. వాడు ఇంగ్లీష్‌లో హిస్టరీ బుక్స్ చదివాడు. జానకికి తెలుగులో చెప్పాలంటే వాడికి రాదు. అందుకని క్లుప్తంగా ఇలా చెప్పాడు.

"గ్రాండ్‌మా జైపూర్‌ని పింక్‌సిటీ అంటారు. అంటే పింక్ కలర్‌లో భవనాలు వున్నాయి చూడు... ఇక్కడ టూరిస్ట్ ప్లేస్ అజ్మీర్, భరత్‌పూర్, బికనీర్, చిత్తోడ్‌గఢ్ మొదలైనవి. చాలావరకూ శిథిలావస్థలో వున్నా సాంప్రదాయసిద్ధంగా కనిపించడానికి వాటిని అలాగే వుంచారనుకుంటాను. హిందూ, ముస్లిమ్ కల్చర్ కనబడుతుంది. సారీ గ్రాండ్‌మా! కొంచెం నువ్వే ఇంగ్లీష్ నేర్చుకుంటే, బుక్స్ చదవచ్చు"

"అవున్రా రాకేష్! మా కోసం నువ్వు తెలుగు నేర్చుకున్నట్టు గ్రాండ్‌మా ఇంగ్లీష్ నేర్చుకోవాలి" అన్నాడు జనార్ధనం.

"భరత్‌పూర్ వెడదాం గ్రాండ్‌ఫా. నాకు బర్డ్స్ అంటే చాలా ఇష్టం" అన్నాడు జనార్ధనంవైపు తిరిగి.

"సారీ రాకేష్! భరత్‌పూర్‌లో ఇప్పుడు ఈ సీజన్‌లో అంతగా బర్డ్స్ కనిపించవు. ఎందుకంటే ఇక్కడ ఫారిన్‌లోలా, ఎప్పుడూ వీటిని సంరక్షించే సదుపాయం వుండకపోవడంవలన! మనం నడవగలిగినా గ్రాండ్‌మా నడవలేదు. అందుకని మనం ఈ గుర్రం బండిలో వెడదాం. అంటూ బండి మాట్లాడి, అందరూ ఎక్కారు. నేచురల్ బర్డ్స్ సెంచరీ అంటూ పేరు పెట్టారు కనుక, వర్షం పడితేనే ఇక్కడికి వలసపక్షులు వస్తాయి. వాటికి ఆహారం, నీరూ కావాలిగా మరి"

ఎంతదూరం వెళ్లినా పచ్చటి మొక్కలూ లేవు. పక్షుల జాడా లేదు. రాకేష్‌కి బోర్ కొట్టింది. అయినా వాడు మాట్లాడకుండా కూర్చున్నాడు.

చివరికి జానకి అంది. 'ఇదేం బర్డ్స్ సెంచరీ అండీ, ఒక్క కాకీ, పావురమైనా లేవు. వెనక్కి తిప్పమనండి బండిని...' అని.

"నేను కూడా ప్రభుత్వం ఇంత నిర్లక్ష్యంగా వుంటుందని అనుకోలేదు. మన దగ్గిర ఇంత మనీ వసూలు చేస్తోంది. కేవలం





ఇక్కడి మనుషులు జీవించడానికే అన్నట్టు కనిపిస్తోంది. పేరు మార్చి 'వాకింగ్ డిజర్ట్' అని పేరు పెడితే మంచిదని ఒక సలహా ఇస్తానుండు" అన్నాడు బాధగా జనార్ధనం.

ఇంతలో "డాడ్ బర్డ్ అదిగో..." అంటూ ఆనందంగా అరిచాడు రాకేష్.

"బండి ఆపు. ఒకసారి దిగి చూద్దాం" అనుకుంటూ అందరూ దిగారు. కొంచెం నీళ్లు, నాలుగు చెట్లు వున్నచోట రంగురెక్కల పక్షి ఒకటి చెట్టుమీద చిటారుకొమ్మన కనబడింది. దానికే ఒక ఫొటో తీశాడు రాకేష్.

వాడికి అమెరికాలో తను చూసిన బర్డ్స్ సెంచరీ గుర్తుకొచ్చింది. అక్కడ పెద్ద నెట్ లాంటిది కట్టారు. వాటిమీద పక్షులు రణగొణ ధ్వనులు చేస్తూ, రకరకాల అరుపులతో, గంతులు వేస్తుంటాయి. బొటనవేలంత పక్షినుంచి, నెమలిసైజు పక్షులవరకూ రకరకాల సైజుల్లో కనువిందు, వినువిందు చేస్తాయి. ఆయా పక్షుల గూడు నిర్మాణం అత్యద్భుతం. చూసి తీరాల్సిందే. ఒక ఆడపక్షి గుడ్లు పెట్టి పొదిగితే మరొక ఆడపక్షి గుడ్లు పెట్టి మగపక్షికి పొదిగే డ్యూటీ అప్పగించి, తానేమో ఆహారం సమకూర్చింది. మనుషుల మల్లేనే బాధ్యతను భార్యాభర్తలు పంచుకున్నట్టు అనిపిస్తుంది. మనుషులయితే డ్యూటీ ఎగ్గొట్టడానికి కల్లబొల్లి కబుర్లు చెప్పి తప్పించుకుంటారు. కానీ పక్షులు, జంతువులూ ఒక నీతికీ, కట్టుబాటుకీ తలవంచడం అత్యద్భుతం.

ఆడవాళ్లు డ్రస్‌లు, నగలూ కొనడానికి షాపింగ్ చేశారు. రాకేష్ ఈ ట్రిప్‌కి గుర్తుగా రకరకాల రాజస్థానీ బొమ్మలు కొన్నాడు. ఆగ్రాలో తాజ్‌మహల్ కొన్నాడు. "ఇక మనం ఎక్కడికి వెడదాం గ్రాండ్‌పా? " అడిగాడు జనార్ధనాన్ని.

"రాకేష్! రేపు రుషీకేశ్, హరిద్వార్ అనే వూళ్ళు వెడదాం అని గ్రాండ్‌మా అంటోంది. మరి అవి పిల్‌గ్రిం ప్లేసెస్. ఆర్ యు ఇంట్రస్టెడ్? " అన్నాడు.

"ఎస్. అయ్‌నో! బట్ అయ్ లవ్ ఆర్కెటెక్చర్. టెంపుల్‌మీద చెక్కిన శిల్పాలు, డిజైన్స్ చూస్తాను. వాటి పిక్చర్స్ మా ఫ్రెండ్స్‌కి చూపించి చెబుతాను" అన్నాడు.

"హరిద్వార్‌లో గంగానది ప్రవహిస్తోంది. కావాలంటే పెద్దలకు తర్పణాలు విడవచ్చునట" అంది జానకి భక్తిగా.

"జానకీ! అవన్నీ సెంటిమెంట్స్. ఇక్కడి పాండాలకు జీవనభృతి. నాకు సెంటిమెంట్స్ లేవని నీకు తెలుసుకదా? కావాలంటే సరదాగా ఆ జ్యోతులు వెలిగించుకో. పాండాకు పది రూపాయలు మించి ఇవ్వకు" అన్నాడు.

సుచిత్రవైపు చూసి, "చిత్రా! నీకు పిన్ని చెప్పింది అర్థమైందికదూ? మీ బెంగాలీలు కూడా గంగను ఇలాగే పూజిస్తారుకదూ? " అన్నాడు.

"అవును. భక్తీ, ముక్తీ గురించి నాకు తెలియదు. కానీ ఆ జ్యోతి వెలిగించి నీటిలో వదిలితే ఎంతో ఆనందంగా అనిపించేది. నేను కూడా ఇప్పుడు అలాగే చేస్తాను. నువ్వు వీడియో తియ్" అంటూ ఎన్నో జ్యోతులు వెలిగించి, నీటిలో విడిచిపెట్టింది సుచిత్ర.

జానకి భర్తతో రహస్యంగా చెప్పింది. "ఏమండీ, నాకు సెంటిమెంట్ కాదుకానీ, మనకు అబ్బాయిలే లేరు. అంటే మనం మరణిస్తే తలకొరివి పెట్టేది ఎవరో పరాయివాళ్లు. ఎటూ వచ్చాం. మనం స్వయం తర్పణాలు వదులుకుందాం" అని!

"జానకీ! మన మరణానంతరం మన బాడీస్ డొనేట్ చేయాలని నా సంకల్పం. నీ మాటా కాదనలేను. అలాగే కానియ్" అంటూ అక్కడి పెద్దలతో చర్చించి వాళ్ళు చెప్పినట్టు ఆచరించాడు.

"మీరిలా చేయడం చాలా గొప్ప విషయం. మీరు నూరేళ్ళు అన్యోన్య దాంపత్యాన్ని కొనసాగించండి" అంటూ ఆశీర్వదించాడు పురోహితుడు అందర్నీ.



"మనం కూడా అలా చేయాల్సింది" అంది సుచిత్ర భర్తతో.

"మనం ముందుగా ఏమీ అనుకోలేదు. బహుశా ఈ ప్రదేశం మహిమవలన కాబోలు ఇలాటి ఆలోచనలు వచ్చాయి. అవసరంలేదు చిత్రా" అన్నాడు జయచంద్ర వారిస్తూ.

గంగాఘాట్ మెట్లమీద కూర్చుని ఒక్కొక్కరే దీపాలు వెలిగించారు. ఆ జ్యోతుల నీడలు నీటిలో మెరుస్తూ కన్నుల పండుగ చేస్తూంటే అద్భుతంగా తోచింది సుచిత్రకు.

జనార్ధనం, జయచంద్ర యథాలాపంగా చూశారు. రాకేష్ విచిత్రంగా చూడసాగాడు. జానకి భక్తి పారవశ్యంలో మునిగిపోయింది. "ఇక వెడదామా? ఇక్కడే వుండిపోతావా? " జానకిని కుదిపి అడిగాడు జనార్ధనం.

"పదండి. జన్మలో ఒక్కసారి దర్శించగలిగితే చాలు ఇలాంటి ప్రదేశం" అంటూ సంతృప్తిగా చెప్పింది జానకి.

"అత్తమ్మ చాలా ఎంజాయ్ చేసినట్టున్నారు" అంది సుచిత్ర.

"అవునమ్మా! మీ మూలాన మేం కూడా రాగలిగాం. ఈ పుణ్యమంతా మీదే" అంది కృతజ్ఞతగా జానకి.

"అంతా చాలా హేపీగా గడిపాం. తరచుగా ఇటువంటి ట్రిప్స్ వలన లోకజ్ఞానమూ, ఆత్మసంతృప్తీ కలుగుతాయి" అన్నాడు జనార్ధనం.

"అవును బాబాయ్. అందుకే అనుకుంటా, ఈమధ్య ఈ దేశంలో కూడా చాలామంది పర్యాటకులు పెరిగారు. ఒక్కటే బాధ. తగిన సౌకర్యాలు లేకపోవడం" అన్నాడు జయచంద్ర.

"ఈరోజు కొత్త కాదు కనుక మనమూ అలవాటు పడిపోయాంలే" అంది జానకి.

"ఇంతకీ ఢిల్లీ పూర్తిగా చూడనేలేదు మనం. రేపు చూద్దాం" అన్నాడు జయచంద్ర.

రెడ్ఫోర్ట్, కుతుబ్ మినార్, గాంధీ సమాధి, ఇందిరాగాంధీ మ్యూజియమ్, పాలికా బజార్, బిర్లా టెంపుల్ తీరికగా నాలుగురోజులు చూసి ఇంటిముఖం పట్టారు.

ఇంటికి చేరి బడలిక తీరాక కూర్చుని ఫొటోలన్నీ చూస్తుంటే వున్నట్టుండి జానకి అంది.

"ఏమండోయ్ ఢిల్లీ, ఆగ్రా, ఫతేపూర్ సిక్రీ, మధుర, జైపూర్, భరత్పూర్, హరిద్వార్, రుషీకేశ్ వెళ్ళాంకదా మనం! ఈ ఫొటోల వెనుక పెన్తో రాస్తాను. చెప్పండి. ఈ ఫొటో ఎక్కడ తీసుకున్నాం? "

"జానకీ నీకసలు గుర్తే లేదా? ఫతేపూర్ సిక్రీలోని పంచమహల్ ఇది" అన్నాడు జనార్ధనం.

"అబ్బ ఎంత బాగుందో ఫొటోలో. అక్కడ చూసినప్పుడు ఇంత అందంగా కనపడలేదు" అంది జానకి.

"పోనీ ఇది గుర్తుందా? " ఒక ఫొటో చూపించి అడిగాడు సీరియస్గా!

"అది తాజ్మహల్! ఆగ్రాలో చూశాం. నన్ను మరీ అంత తెలివతక్కువదాన్ని చేయకండి" కోపంగా అంది జానకి.

"ఏమోలే! ముంతాజ్మహల్ అనుకున్నా" అన్నాడు సరదాగా జనార్ధనం.

"మధురలో ఒక్క ఫొటో తీయలేదేమిటండీ మనం? "

"అది జైలుకదా! జైల్లో కృష్ణుడి ఫొటో తీయడం మనస్కరించలేదు" అన్నాడు జనార్ధనం.

"గ్రాండ్మాకి పిక్చర్స్ తీసుకోవడంలో చాలా ఇంట్రస్ట్ వుంది మామ్" అన్నాడు రాకేష్ తల్లితో.

"మరే! నీకంటే చిన్నపిల్లలా ఒకటే ఫోజులిచ్చింది కదూ? " అన్నాడు జనార్ధనం.

"ఛ... మీరేమిటి నన్నిలా ఆటపట్టించారు? జయచంద్ర వచ్చినప్పటినుంచీ

చూస్తున్నాను" అంది జానకి ఉడుక్కుంటూ.

నీలిమ, శశికాంత్‌లు కోణార్క్, ఖజురహో, అరకువాలీ చుట్టివచ్చి విశాఖనుంచి ఫోన్ చేశారు. "మా ట్రిప్పంతా చాలా బాగుంది. శశి మంచి కంపెనీ ఇచ్చాడు. శశీ వాళ్ళ పేరెంట్స్ ఇంట్లో ఒక వారం వుండి వస్తాను" అంది నీలిమ తల్లితో.

"నెక్ట్స్ ట్రిప్ ఎక్కడికో చెబితే అరేంజ్ చేస్తాను" అన్నాడు జయచంద్ర.

"మైసూర్, బెంగుళూర్" చెప్పింది నీలిమ.

"మనం అందరమూ లాస్ట్ టైమ్ చూశాం కదా? మళ్ళీ వెడతావా? " అడిగింది సుచిత్ర.

"ఔను. శశికి అక్కడ పనుందట. నన్ను తోడుగా రమ్మని పిల్చాడు. అతను నాకు కంపెనీ ఇచ్చినప్పుడు, నేను అతడికీ ఇవ్వాలి కదా? " అంది నీలిమ.



"అసలు ఈ శశిగాడికి ఇంత తీరిక ఎక్కడిది? వరసగా తిరుగుతున్నాడు. సెలవు ఇచ్చారా? " అన్నాడు జనార్ధనం.

"అసలు జాబ్ వుందో లేదో" రాకేష్ డవుట్‌గా అన్నాడు.

"మనకేం పోయిందీ? బాగా డబ్బుంది వాళ్ళ నాన్నకి. ఒక్కడే పుత్రరత్నం. మన మ్మాయికి కంపెనీ ఇచ్చాడు చాలు" అన్నాడు జనార్ధనం.

నీలిమ వచ్చాక అడిగాడు జయచంద్ర.

"నీలూ, విశాఖలో ఎలా వుంది ట్రీట్‌మెంట్? "

"ఫెంటాస్టిక్ డాడ్! ఇండియాలో రిచ్ ఫ్యామిలీస్ ఎలా వుంటాయో తెలిసింది. సిల్వర్‌లో ఎన్ని వెరైటీస్ ఆర్టికల్స్ వుంటాయో తెలిసివచ్చింది" అంది నీలిమ నవ్వుతూ.

"చిన్నక్కా! శశికాంత్ రోజూ నిన్ను పువ్వులతో పూజించి, పన్నీటితో కాళ్ళు కడిగి నెత్తిమీద జల్లుకునేవాడా? " రాకేష్ జోక్ చేశాడు.

"నీకెలా తెల్సురా రాకీ? శశి అలా చేస్తాడని? " ఆశ్చర్యంగా అడిగింది నీలిమ.

"మమ్మల్ని ఎ.సి. రూమ్‌లో కూర్చోబెట్టి వింజామరలతో సత్కరించినప్పుడు నిన్నెలా చూశాడో ఆమాత్రం అర్థం చేసుకోలేమా? " అన్నాడు రాకేష్.

"సరిగ్గా అలాటి పన్లే చేశాడు. నాకు చిరాకుగా అన్పించింది కానీ, పోన్లే పాపం ట్రిప్‌లో కంపెనీ ఇచ్చాడుకదాని వూరుకున్నాను" అంది నీలిమ.

"మళ్ళీ బెంగుళూర్, మైసూర్ ఎలా వెడతావే బాబూ ఈ బానిస మనస్తత్వం గలవాడితో? " అన్నాడు రాకేష్.

"ఒరేయ్! నీకు తెలుగు రావడం కాదుగానీ, ఉపమానాలు దంచేస్తున్నావ్" అన్నాడు జనార్ధనం.

"ఉపమానం అంటే ఏమిటి గ్రాండ్‌ఫా? బహుశా ఉపమానం అంటే ఎగ్జాంపుల్ కాబోలు. యామై కరక్ట్? గ్రాండ్‌ఫా? " అన్నాడు రాకేష్.

"ఆ... అదేలే కానీ రాకేష్ నువ్వు మీ గ్రాండ్‌మాకి ఇంగ్లీష్ నేర్పు. ఆవిడ నీకు తెలుగు నేర్పుతుంది. ఇద్దరూ మాట్లాడితే మేం మురిసిపోయి వింటాం" అన్నాడు

జనార్ధనం.

"ఆ... అవును. గ్రాండ్‌మా మనం గార్డె న్‌లోకి పోయి భాషను ప్రాక్టీస్ చేద్దాం. పద" అంటూ జానకిని లాక్కుపోయాడు. నీలిమా, శశికాంత్ వారం రోజుల కోసం బెంగుళూర్, మైసూర్ వెళ్ళారు.

"బాబాయ్ నీలిమ వచ్చేలోగా. నువ్వూ, నేనూ మన గోదావరి ప్రాంతానికి వెళ్ళివ ద్దామా? మన చిన్నప్పటి స్కూల్, కాలేజ్, టీచర్లు ఎలా వున్నారో చూద్దామా? " అన్నాడు జయచంద్ర.

"మరి సుచిత్ర రాదా? " అడిగాడు జనా ర్ధనం.

నేనూ, అత్తా మా బెంగాల్ వెళ్ళి వస్తాం'

"ఏమత్తా... వెడదామా? " అడిగింది సుచిత్ర.

"నీ ఇష్టం అమ్మా చిత్రా! నేను కోల్‌కతా చూడలేదు. అయితే మరి నీకు టైమ్ సరి పోతుందా? అది చూసుకో" అంది జానకి ఉత్సాహంగా.

"మనం ప్లెయిన్‌లో వెడదాం చిన్నత్తా! టైమ్ సేవ్ చేయచ్చు" అంది సుచిత్ర.

"సరే మరి! రాకేష్! నీ డైరక్షన్ ఎటురా? అటు అక్కతోనా, ఇటు మాతోనా? మామ్‌తోనా? " అడిగాడు జయచంద్ర. రాకేష్ కాసేపు ఆలోచించి "మీతోనే డాడ్!" అనేశాడు.

"సరే అయితే, నీ సరదా తీరేలా ట్రైన్‌లో రాజమండ్రీ వరకూ వెళ్లి అటునుంచి బస్‌గానీ, టాక్సీగానీ ఎంగేజ్ చేసుకుందాం" అన్నాడు జయచంద్ర.

ముందు జానకీ, సుచిత్రా కోల్‌కతా వెళ్ళి పోయారు. తర్వాత నీలిమా, శశికాంత్, జనార్ధనం, జయచంద్రా, రాకేష్ ఒకేసారి స్టేషన్‌కి బయలుదేరారు.

నీలిమ కూడా ఈసారి ట్రయిన్ జర్నీయే ప్రిఫర్ చేసింది, వెళ్లేముందు అంతా అను కున్నారు.

'ఈరోజు ఆదివారం. సరిగ్గా వారానికి అంటే మళ్లీ ఆదివారానికి ఇక్కడికి చేరుకో వాలి. మధ్యలో ఎటువంటి మార్పులూ వుండవు' అని!

జనార్ధనం, జయచంద్రా, రాకేష్ హైదరా బాద్ నుంచి గౌతమీలో బయలుదేరి మర్నాడు ఉదయం అయిదు గంటలకు రాజమండ్రి చేరుకున్నారు. అక్కడ్నించి హోటల్‌కి వెళ్లి స్నానం, టిఫిన్ చేసి టాక్సీ రెంట్‌కి తీసుకుని కొత్తపేట అనే ఊరికి చేరుకున్నారు. అక్కడ అంత మంచి హోటల్స్ లేవు. అందువల్ల జనార్ధనం భార్య దూరపు బంధువైన సూర్యంగారి ఇంటికి వెళ్ళారు.

సూర్యంగారు సామాన్య కుటుంబీకుడు. అయినా పర్ణశాలవంటి ఆ ఇల్లు, పరిసరాలు ఎంతో బాగున్నాయి. కాలవ ఒడ్డున కొబ్బరి తోటలో చిన్న ఇల్లు వేసుకున్నాడు ఆయన.

"రాకేష్! సూర్యం గ్రాండ్‌పా ఇంట్లో ఇంత వరకూ నువ్వు రుచి చూడనివి చూస్తావు. నీకు నచ్చకపోతే వదిలెయ్! అంతేకాని కామెంట్ చేయకు" అని జయచంద్ర కొడుక్కి ముందుగానే చెప్పాడు.

సూర్యంగారు ఆదరంగా ఆహ్వానించారు.

"రారా మనవడా? అమెరికా మనవడొ చ్చాడే పార్వతీ..." అంటూ భార్యను పిలి చాడు.

పార్వతికి జయచంద్ర గుర్తులేడు. 'వాళ్లె ప్పుడో అమెరికా వెళ్లిపోయారు. ఇప్పుడు గుర్తులేరు. అయినా వెదుక్కుంటూ మనల్ని చూడాలని వచ్చాడు. అంతకంటే ఏంకా వాలీ? ' అనుకుని.

"రారా చిట్టితండ్రీ. నీకు తెలుగు వచ్చునా? నన్ను ఇంగ్లీష్‌లో మాట్లాడమం టావా? హౌఆర్‌యూ! రాకీ? " అందావిడ.

"ఇదంతా టి.వి పాండిత్యంరా నాయనా? " అన్నాడు సూర్యంగారు.

"అయ్యా బాబోయ్! గ్రాండ్‌మా మీకు ఇంగ్లీషు వచ్చును కదా? అయినా తెలుగే మాట్లాడమని. మా అమ్మ చెప్పింది. నేను







# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.





ఎడిటర్:

## చతుర

'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.








శ్రీచంద్ర..




ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్త పడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

డిసెంబర్ చతుర నవల **వారసుడు**

సమీక్షకుని పేరు: ................................................

చిరునామా: ................................................

................................................

................................................

ఇప్పుడు తెలుగు మాట్లాడుతాను. మీరు అమెరికా వచ్చినప్పుడు ఇంగ్లీష్‌లో మాట్లాడండి. ఓ.కే. గ్రాండ్‌మా?" అన్నాడు రాకేష్ సరదాగా.

"నాబాబే, నన్ను అమెరికా రమ్మంటున్నావా? ఇప్పుడు నీతోనే వచ్చేస్తారా, ఎప్పటిదాకానో ఎందుకు? గారెలు, ఆవడలు, అరిసెలు చేశాను తిను" అంటూ ఆప్యాయంగా తినిపించింది పార్వతి.

"వీడు ఉద్దండుడురా జనార్ధనం, అందరితో కలిసిపోతున్నాడు" అంటూ మురిసిపోయారు సూర్యంగారు.

"అదంతా వాళ్లమ్మ సుచిత్ర ట్రైనింగ్. పిల్లలతో పిల్లవాడిలా వుంటాడు. పెద్దవాళ్లతో ఫ్రెండ్లీగా వుంటాడు" అన్నాడు జనార్ధనం.

రాకీ వచ్చింది మొదలు అదీ ఇదీ ఏమిటంటూ పార్వతి చేసిన పిండి వంటలు లాగించేస్తున్నాడు.

"నీ ఇల్లు బంగారంగానూ మధ్యాహ్నంవేళ నిద్ర లేచాక పెట్టొచ్చుకదా పార్వతీ. భోజనానికి ముందే అవన్నీ తినిపించావేమిటి? ఇక భోజనం ఏం చేస్తాడే" అన్నారు సూర్యంగారు.

"అప్పటికి వేరే రకాలు వున్నాయి లెండి. నాకంత తెలియదనా? నా మనవడు నా ఇష్టం. "మీరు ఊరుకోండి" అంది పార్వతి భర్తను కసిరి.

భోజనాలు చేసి, ఊరి ముచ్చట్లు చెప్పుకున్నారు. జయచంద్ర తండ్రిని, తల్లిని తల్చుకున్నారు. జానకి తల్లికి బాబాయి కొడుకే ఈ సూర్యంగారు.

"అమ్మాయి జానకీ, సుచిత్రా కూడా వచ్చి వుంటే బాగుండేది" అంది పార్వతి.

"వాళ్లు కలకత్తా వెళ్లారట. మొన్న మూణ్ణెల్లక్రితమే కదా జానకి వచ్చి వెళ్లిందీ. నీకు పనేమీలేదు కనుక వాళ్లు వస్తే బాగుండును, వీళ్లు వస్తే బాగుండును అంటావ్. వాళ్లకి మరే పన్లూ వుండవా? " అన్నాడు సూర్యంగారు.

తొంభైలయిదేళ్ల సూర్యంగారికి నడుం వంగలేదు. ఒక్క పన్ను వూడలేదు. కంటి చూపు మందగించలేదు. ఇప్పటికీ తోటా, మొక్కా, నేలా, నీరూ స్వయంగా చూసుకుంటూ ఆరోగ్యంగానే వున్నారు.

పార్వతికి కూడా ఎనభైఏళ్లున్నా అప్పటి మనిషి కావడంచేత స్వచ్ఛమైన గాలీ, నీరూ, ఆరోగ్యకరమైన ఇంటి పెరట్లో కాచే కూరగాయలూ, పండే పళ్లూ ఆవిడకు వృద్ధాప్యం అంటే తెలియనీయలేదు. అవలీలగా పది మందికి పంచభక్ష్యాలతో వంట చేయగలదు. ఒక్కగానొక్క మనవడు దూరంగా హాస్టల్లో చదువుకుంటున్నాడు. ఆదిదంపతుల్లా ఇద్దరూ ఈ కొత్తపేటలోనే సుఖంగా, సంతోషంగా వుంటున్నారు. ఎవరైనా వచ్చారంటే పండగే వాళ్లకు.

"నువ్వు చదివిన స్కూల్ ఇప్పుడు ఇంజనీరింగ్ కాలేజీగా మారిపోయిందయ్యా జయచంద్రా! నీ కొడుక్కి చూపించు. నీకు చదువు చెప్పిన మాస్టర్లు ఎవరూ లేరు. ఆ తరంలో మిగిలినవాణ్ణి నేను ఒక్కడ్నే మరి! చూశావుగా ఊరెంత మారిపోయిందో. ఎంత పెద్దవాడివైనా, ఆ నాటి బాల్యం మరపురాదయ్యా! అదే మరి మాతృభూమి, జన్మభూమి అనే మాటకు అర్థం. నువ్వు ఎన్నడో అమెరికా వెళ్ళినా, మరచిపోకుండా నీ కొడుక్కి తెలుగు నేర్పించి, పెద్దవాళ్ల ఎడల మంచీ, మర్యాదా నేర్పించడం నాకెంతో ఆనందంగా వుంది. నేనూ మీతో వద్దునుకానీ పార్వతి ఒక్కతీ వుంటుంది, వెళ్ళిరండి" అన్నాడాయన.

"రాకీ ఇదిగోరా మా క్లాస్‌రూమ్. ఈ ఫస్ట్ బెంచ్‌లోనే ఎప్పుడూ కూర్చునేవాణ్ణి. మా క్లాస్ టీచర్ వెనక్కితిరిగి బోర్డ్‌మీద రాస్తుంటే ఏమీ ఎరగనట్టు మామిడికాయలతో బోర్డ్‌మీద గురిచూసి కొట్టేవాళ్లం. ఆవిడ మమ్మల్ని చితకబాది వదిలిపెట్టేది. అయినా అల్లరి మానితేగా! మర్నాడు మరో అల్లరి. దీపావళి వస్తోందంటే నెలముందు

నుంచే టీచర్స్ అతిజాగ్రత్తగా తాము కూర్చునే కుర్చీ టేబుల్ పరీక్షించి చూసుకునేవారు. అయినా ఎప్పుడో టపాకాయలు కాల్చి పడేసేవాళ్లం. అది అల్లరి, తప్పనీ తెల్సినా అదో థ్రిల్. తనవయసేమిటో మరచి, చిన్నతనం రోజుల్లోకి వెళ్లి అన్నీ మళ్ళీమళ్ళీ గుర్తుచేసుకున్నాడు జయచంద్ర.

'ఓ అందుకా డాడ్ మమ్మల్ని ఎప్పుడూ కంట్రోల్ చేయాలనుకోలేదు? థాంక్యూ డాడ్! థాంక్యూ వెరీమచ్' అనుకున్నాడు రాకేష్ తండ్రివైపు చూసి.

"బాబాయ్! మేము ఇంటినుంచి స్కూల్‌కి వచ్చేదారిలో ఒక పెద్ద మేడ వుండేది. ఆ మేడలోని వ్యక్తుల గురించి రకరకాలుగా చెప్పుకునేవారు. ఆ మేడ వుందో లేదో చూద్దాం పద" అటువైపు అడుగులువేస్తూ అన్నాడు జయచంద్ర.

ఆ మేడ స్థానంలో ఇప్పుడు హాస్పటల్ వుంది. ఆ మేడకు కథ ఏదో వుంది. రాకేష్ వున్నాడని జయ చెప్పలేదు అని అనుభవజ్ఞుడైన జనార్ధనం గ్రహించాడు.

హాస్పటల్ దగ్గిరగా వెళ్లి, ఏదో గుర్తుచేసుకోవాలని ప్రయత్నించాడు జయచంద్ర.

"రాకేష్! డాడ్ మెమొరీస్‌ని మనం డిస్టర్బ్ చేయద్దుకానీ, మనం అటువైపు వెడదాం పద" అంటూ రాకేష్‌ని మరోవైపు తీసుకువెళ్లాడు జనార్ధనం.

ఇంటికి తిరిగివస్తూంటే జయచంద్ర అన్నాడు.

"బాబాయ్ పాపం సూర్యంగార్ని, పార్వతమ్మగార్ని బాధపెడుతున్నాం. రేపే వెళ్ళిపోదాం. ఇక చూడాల్సినవి కూడా ఏం లేవులే" అన్నాడు.

"అదేమిటి జయా! వారం రోజులు కాంప్ అన్నావ్. ఒక్కరోజుకే వెనక్కి వెడదామా? నువ్వేమీ సూర్యంగారింట్లో వుండాల్సివస్తోందని మొహమాటపడకు. అటువంటిదేమైనా వుంటే నేనే తీసుకురాకపోదును" అన్నాడు జనార్ధనం.

ఎందుకో జయచంద్ర మూడ్ అప్‌సెట్ అయిందని గ్రహించాడు జనార్ధనం.

మర్నాడు సాయంకాలం నాలుగింటికి "సూర్యంగారూ నువ్వూ అలా వెళ్ళి ఊరు చూడండి. నేను, రాకేష్, పార్వతమ్మగారూ టెంపుల్‌కి వెడతాం" అన్నాడు జనార్ధనం.

"సూర్యంగారూ! ఈ హైస్కూల్‌కి వెళ్లేదారిలో పెద్ద మేడ వుండేది. ఆరోజుల్లో ఆ ఇంట్లో వుండే తల్లీ, కూతుళ్ల గురించి రకరకాల కథలు చెప్పుకునేవారు. చెడుగానే అనుకోండి. వాళ్లేమయ్యారు? " ఆత్రంగా అడిగాడు జయచంద్ర.

"అవును... ఆ అద్దాల రంగుల మేడలో వుండేది పంకజ. కూతురు అరవింద" అని ఆగాడు సూర్యంగారు.

"ఆ... గుర్తువచ్చింది. వాళ్లే! వాళ్లేమయ్యారు? చెప్పండి సూర్యంగారూ" ప్రాధేయపడుతూ అడిగాడు జయచంద్ర.

"అది సరే! వాళ్ళ గురించి ఎందుకు నీకు? " సూర్యం ఎదురుతిరిగి అడిగాడు.

"ఎందుకంటే చెబుతాను వినండి. మాది చాలా పేద కుటుంబం. మా నాన్న, అమ్మ ముగ్గురు అక్కలు, నేను. మేం కాక, మా నాయనమ్మ, బాబాయిలు, అత్తలు ఇలా పెద్ద కుటుంబాన్ని నాన్నగారు ఒక్కరే పోషించాల్సివచ్చింది. ఒక్క కొడుకునైన నాకు ఏ ముద్దూ ముచ్చటా తీర్చలేకపోతున్నానని అమ్మ బాధపడుతుండేది. నాన్నకు ఏమీ చేయలేని నిస్సహాయత. అటువంటి పరిస్థితిలో స్కూల్‌కి వెడుతున్న నన్ను ఆ మేడలో వుండే పంకజమ్మగారు ఓరోజు పిల్చింది. నేను వెళ్లాను. నా చదువు, నాన్నగారి వివరాలు, మా కుటుంబం స్థితిగతులూ తెలుసుకుంది. రోజూ మధ్యాహ్నం భోజనానికి మా ఇంటికి రమ్మని చెప్పింది. నేనూ, అరవిందా ఒకే వయసువాళ్లం కావడంతో, ఇద్దరికీ జతకుదిరింది. నాకా ఇంట్లో చాలా హాయిగా కాలం గడిచిపోతోంది.

ఇంట్లో కడుపునిండా తిండయినా లేని




నేను, పంకజమ్మగారి ఆదరణతో పుష్టిగా, బలంగా తయారయ్యాను. ఎదిగేవయసులో వచ్చిన మార్పుని ఇంట్లోవాళ్లు అనుకున్నారు తప్పితే, పంకజమ్మ పోషణ అని ఎవరికీ తెలియలేదు. ఒకరోజు నాన్నగారు నన్ను పంకజమ్మ ఇంట్లో చూశారు. విషయం తెలిసింది. కానీ నన్ను ఏమీ అన్లేదు. పంకజమ్మకి కృతజ్ఞత తెలియచేసి. ఆడవాళ్లిద్దరే వుంటున్నారనే జాలితో వాళ్లకి సాయపడటం ప్రారంభించారు. కానీ లోకం అలా వున్నవాళ్లని చూసి కళ్లలో నిప్పులు పోసుకుంది. ఊరివాళ్లు నాన్నగారికీ, పంకజానికీ అక్రమ సంబంధం అంటగట్టారు. ఈ విషయం ఆనోటా ఈనోటా అమ్మకు తెలిసింది. నాన్నగారిమీదా, నామీదా విరుచుకుపడింది. వాళ్లింటికి వెడితే కాళ్లు విరగకొడతానని నన్నూ, కాలవలోపడి చచ్చిపోతానని నాన్నగార్ని బెదిరించింది. అయినా నేను వెళ్లడం మానలేదు. కేవలం ఆవిడ పెట్టే తిండికోసం నేను వెళ్ళడం కాదు. ఏదో అనుబంధం నన్నటులాగేది. అరవిందతో స్నేహమూ చల్లని మలయమారుతంలా వుండేది. ఇద్దరం ఒకే క్లాస్ వాళ్లం కావడంతో చదువులో పోటీగా వుండేవాళ్లం. మగ పిల్లలులేని పంకజమ్మకి నన్ను చూస్తే పుత్రవాత్సల్యం. వారి గతచరిత్ర ఏమిటో, ఎక్కడ్నించి వచ్చారో తెలియదు. ఆ వయసులో నాకు తెలుసుకోవలసిన అవసరమూ లేకపోయింది.

మా బాబాయిలు ఒక్కొక్కరే జీవనోపాధికి వేరే వెళ్ళిపోయారు. ఒకాయన మిలట్రీలోకి వెళ్ళాడు. మరొకాయన దుబాయ్ వెళ్ళాడు. పోనీ ప్రయోజకులై అత్తల బాధ్యతను పంచుకుంటారని బాబాయి గురించి ఆశపడిన నాన్నగారికి ఆశే మిగిలింది తప్ప, వాళ్ళు మళ్లీ ఇటువైపు రానేలేదు సరికదా పూర్తిగా వారి సమాచారాన్ని తెలియనీకుండా చేశారు.

ఇంట్లో బాధ్యతలు, నాన్నగారిని ఉక్కిరిబిక్కిరిచేస్తూ, మనశ్శాంతి లేకుండా చేశాయ్. అమ్మ వెళ్లిపోయిన బాబాయిలను తిడుతుండేది. అత్తలకు తనే పెళ్ళి చేయాల్సిరావడం, మా నాయనమ్మ మంచం పట్టడం, ఆవిడ మరింత సహనం కోల్పోయేలా చేసింది. నాకు ఇంటికి వెళ్ళాలంటే చాలా చిరాగ్గా వుండేది. ఎప్పుడూ ఏదో ఒక గొడవే!

నాన్నగారు కూడా సహనం కోల్పోయి అమ్మని లెక్కచేయక పంకజమ్మగారి ఇంటికి రాకపోకలు సాగించారు. పంకజం ఎన్నో మంచి సలహాలు చెప్పేది. అందులో ఒకటి రెండెకరాల భూమిని అమ్మి, అత్తలిద్దరికీ పెళ్లిచేసి పంపేయమని! నాన్నగారు అక్షరాలా ఆ సలహా ఆచరించారు. అదృష్టవశాత్తు మంచి సంబంధాలు దొరికి, అత్తలిద్దరూ సుఖంగా వుండటమే కాకుండా, తల్లి మందులకని కొంత డబ్బు కూడా ఇస్తుండేవారు. అలా అత్తలు నాయనమ్మ బాధ్యత పంచుకున్నా, మా అక్కలు ముగ్గురూ ఉన్నారు కదా? వీళ్లకి చదువు, పెళ్ళి, ఎలా అనే సమస్య వుండనే వుంది. నాన్నగారు చేసేది ఊరి పంచాయితీ ఆఫీస్‌లో క్లర్క్ ఉద్యోగం. అప్పట్లో నీతీ, నిజాయితీగా వుండేవారు కాబట్టి జీతంలోనే ఇల్లంతా నడిపించాల్సివచ్చేది. ఎదిగిన అక్కలతో మళ్లీ ఆర్థిక సమస్య మొదటికే వచ్చింది.

"పంకజంగారూ! ఈ పిల్లలతో సంసారాన్ని ఈదటం నా తరంగాదు. ఎప్పుడో సన్యాసుల్లో కలిసిపోతాను" అనేవాడు పంకజంగారితోకష్టం, సుఖం చెప్పి.

"భలేవారే! ఎప్పుడో జాగ్రత్తపడి వుంటే బాగుండేది. ఇప్పుడు ఏమనుకుని ఏంలాభం? మా భూములు కౌలుకి తీసుకుని సేద్యంచేసుకోండి. పెట్టుబడి, లాభం అంతా మీదే! నాకూ అరవిందకి సరిపడా ధాన్యం పంపితే చాలు హెచ్చుతగ్గులు వచ్చినప్పుడు చూసుకుందాం" అంటూ దారి చూపించింది.

నాన్నగారికి ఆవిడపట్ల కృతజ్ఞతకు అంతే

లేదు. ఇంట్లో అమ్మ పోరు ఎక్కువైంది. "ఏమిటీ మీరు ఆ పంకజం వలలో పడ్డారు. ఎదిగి వస్తున్న ఆడపిల్లల పెళ్ళిళ్లు చేయాలి. వంశోద్ధారకుడంటూ చివరిగా పుట్టిన అబ్బాయికి చదువైనా చెప్పించగలమా అని నేను బెంగపడుతుంటే మీరు మాత్రం ఏ బాధ లేకుండా, కొత్తకొత్త స్నేహాలు పట్టారు. నాకూ విరక్తిగానే వుంది సంసారం అంటే! నేను మీలాగ ఏ స్నేహాలూ చేయలేదు" అంటూ సాధించేది.

"చూడు! ఆ పుణ్యాత్మురాలి వల్లనే ఈమాత్రం రెండు పూటలా తిండయినా తినగలుగుతున్నాం. ఆవిడ స్త్రీ కాకుండా పురుషుడై వుంటే ఎవరూ పట్టించుకోరు. మన చంద్రంమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. ఆవిడపట్ల కృతజ్ఞత తప్ప మరే వాంఛా నాకు లేదు. మగబిడ్డలు లేని పంకజమ్మ జయచంద్రని కొడుకులాగే భావించింది. ఎక్కడ్నుంచో వచ్చారు. ఇద్దరూ ఆడవాళ్లు. ఆవిడ దయతలచి తన భూమిని సేద్యం చేసుకోమని చెప్పిందేతప్ప మన వలన ఆవిడకు ఏమాత్రమూ ఉపయోగం లేదు. కొందరిలో దేవతా స్వరూపులుంటారు. ఆవిడ ఆ కోవకు చెందిన పుణ్యమూర్తి. ఆవిడకు ఏంచేసినా మనం రుణం తీర్చుకోలేం. అయినవాళ్లుండి ఏం చేశారో చూశావుగా? దయచేసి లేనిపోని రాద్ధాంతం చేయకు" అంటూ సౌమ్యంగా నచ్చచెప్పాలని చూశారు.

అప్పటికి సరిపెట్టుకునే అమ్మ, మళ్లీ ఏదో ఒకరోజు నాన్నగారితో పేచీపెట్టుకునేది. నాన్నగారు విరక్తితో ఇంటికి రావడం మానేశారు. వ్యవసాయ భూముల దగ్గిరే ఒక పూరిల్లు వేసుకుని ఉండేవారు. అమ్మ ఏడుస్తుంటే నాకు చాలా బాధగావున్నా పంకజంగారి ఇంటికి వెళ్లద్దని శాసించడంతో ఆవిడ మీద కోపం వచ్చేది. అయితే ఎదుగుతున్న కొద్దీ ఆవిడ అనుమానం సహజమే అనిపించేది. 'ఆ పంకజంగారు ఒంటరి స్త్రీ. భర్త వున్నాడో లేడో తెలియదు. అమ్మకంటే అందమైనది. ఆస్తిపరురాలు. వూరికే జాలి, మంచితనంతో అదీ నాన్నగార్ని, నన్ను చూసి మాత్రమే జాలిపడటంలో ఏ స్వార్థమూ లేకుండా వుంటుందా? పాపం అమ్మ బాధ ఎవరికి తెలుస్తుంది' అనుకునేవాణ్ణి. అమ్మని చూసి ఇలా అనిపించినా మళ్లీ పంకజంగారి ఇంటికి వెళ్లకుండా వుండనూలేక సతమతమయ్యేవాడ్ని. అయితే నాన్నగారు పొలాల దగ్గిరే వుండటంవలన అప్పుడప్పుడు నేనూ, పంకజంగారూ నాన్నని చూడటానికి వెళ్లేవాళ్లం. అప్పుడు ఆవిడ నాన్నతో అనేవారు.

"రంగనాథంగారూ! మీరు ఇల్లు విడిచి రావడం మంచిపద్ధతి కాదు. సంసారం అన్నాక ఏవో కలతలు వుంటాయి. ఆవిడ స్థానంలో నేనువున్నా ఆవిడలాగే ప్రవర్తించేదాన్నేమో! మీరిలా వచ్చేసినందువలన లోకనిందను నిజం చేసినట్టుకాదా? మనం ఎటువంటి వాళ్లమో మనకి తెలుసు. పరాయివాళ్లకు తెలియదు వెళ్లండి. ఇంటికెళ్లిపొండి. మీరు మా ఇంటికి రావద్దు. నా వలన మీకు ఎప్పుడూ సహాయం వుంటుంది. అందుకు కృతజ్ఞతగా మీరేదో మాకు చేయాలని అనుకోకండి. మీ మనసు అర్థం చేసుకోగలను" అని.

నాన్నగారు మాట్లాడేవారుకాదు. ఆయనంతే! ఎప్పుడూ ఎవర్నీ తప్పుపట్టరు. పంకజంగారు లేనప్పుడు నాతో అన్నారు.

"బాబూ జయా! మీ అక్కల పెళ్లి బాధ్యత నాది. మీ అమ్మకూ ఏలోటూ రాదు. నాకిక్కడ ప్రశాంతంగా వుంది తప్పితే, బాధ్యతల నుంచి తప్పించుకోవాలని పారిపోలేదు నాన్నా! నువ్వయినా అర్థం చేసుకో. నువ్వు ఒక్క విషయం గుర్తుపెట్టుకో. ఎప్పుడయినా పంకజమ్మకి గాని, అరవిందకు గాని ఏ సహాయం కావలసివచ్చినా నీ శక్తిమేరకు చేయాలి సుమా? అటువంటి అవసరం రావచ్చు రాకపోవచ్చు వస్తే మాత్రం




బదులు తీర్చుకోవడం మరచిపోకు. ఆవిడ మనకు చేసిన సహాయం విలువకట్టలేనిది. అంతేకాదు ఊళ్లోజనం, మీ అమ్మా కూడా ఆవిడకూ, నాకూ మధ్య ఏదో సంబంధం వుందని పుకార్లు పుట్టించారు. బాబూ జయా! నేనంత నీతిమాలిన వాణ్ణికాదు. పంకజమ్మగారిపట్ల దేవతాభావమే కాని మరో ఆలోచన నాకు రాదు. మనిషి ప్రమేయం వున్నా లేకపోయినా జీవిత కాలం కూడా వచ్చేది నీతి, సంతృప్తి. ఇవి రెండూ నాకు లభించాయి" అంటూ నన్ను దగ్గరగా కూర్చోబెట్టుకుని చెప్పారు. ఆయన చెప్పినట్టుగా ముగ్గురు అక్కలకీ పెళ్లిళ్లు చేశారు. పంకజమ్మగారి ఆస్తిని రెట్టింపు చేసి అప్పగించారు. ప్రశాంతంగా తన బాధ్యత నెరవేర్చుకున్నాననే సంతృప్తితో కన్నుమూశారు. ఒక్క విషయంలో ఆయన చాలా ఆవేదన చెందారు. అది అమ్మ, ఆయనను పదిమందితో కలిసి అపార్థం చేసుకుందనే బాధ! చివరిరోజుల్లో అమ్మ పశ్చాత్తాపంతో ఆయనకు సేవచేసింది కానీ ఆయన ఒక్కమాట మాట్లాడలేదు. అంతటి అభిమానధనుడాయన.

నాకు ఈ ఊళ్లో చదువు ముగిశాక అత్తయ్య ఊళ్లో కాలేజీలో చేరాను. వెళ్లే ముందు అరవిందతోనూ, పంకజమ్మగారితోనూ చెప్పి వెడదామని వాళ్ల ఇంటికి వెళ్లాను. నాన్నగారు పోయాక అమ్మను, నన్నూ అక్కయ్యలు తీసుకువెళ్లారు. అమ్మకి చాలా జబ్బు చేసింది. ఆ కారణంగా ఆరు నెల్లపాటు నేనీవూరు రాలేకపోయాను. కాలేజీలో చేరి శలవులు ఇచ్చాక వచ్చేసరికి పంకజమ్మగారూ అరవిందా ఏమయ్యారో తెలియలేదు. ఇంటికి తాళం వేసివుంది. దరిదాపుల్లో ఇళ్లు ఏమీలేనందున వారు ఎవరితోనూ పెద్దగా పరిచయాలు పెంచుకోనందువల్లనూ పంకజంగారు ఎటువెళ్లారో ఎవరూ చెప్పలేదు. అప్పట్నించీ నా మనసులో పంకజంగారు ఏమయ్యారు? అరవింద ఏం చేస్తోంది? అనే ఆలోచనలు వేధిస్తూనే వున్నాయి. వాటికి జవాబు దొరకలేదు.

ఇదిగో ఇప్పుడు అంటే సుమారు ముప్పై అయిదు సంవత్సరాల తర్వాత ఈ ఊరును మా అబ్బాయి రాకేష్‌కి చూపించాలనే కోరికతో తీసుకువచ్చాను. నిన్నంతా బాబాయి, నేనూ ఆ మేడకోసం వెదికాం. ఆ ప్లేస్‌లో హాస్పిటల్ వుంది. వాళ్లిద్దరూ ఏమయ్యారో మీకు తెలుసా సూర్యంగారూ?" గతాన్ని వివరించి పంకజం, అరవిందల గురించి అడిగాడు జయచంద్ర.

"చాలాదూరం నడిచాం! రా... ఇలా కూర్చుని మాట్లాడు. నా గురించి నీకు తెలియదు. జానకి పిన్ని కొడుకుననే నీకు తెలుసు. అందులోనూ అమెరికాలో స్థిరపడ్డావు. మనం కలుసుకున్నది చాలా తక్కువ. ఇప్పుడు ఇన్నేళ్లకి కలుసుకున్నాం. పంకజం, అరవింద ఇద్దరూ నాకు తెలుసు. మీ నాన్న కూడా తెలుసు. అతని నిజాయితీ తెలుసు. అందుకే భద్రంగా అపురూపమైన నా సంపదను నాకు అప్పగించాడు. రంగనాథంలాంటి వ్యక్తులు నూటికీ, కోటికీ వుంటారు. ఆ రంగనాథం బిడ్డవు నువ్వు. నీలో అతడి లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. లేకపోతే మీనాన్న నీకు అప్పగించిన బాధ్యతను, నెరవేర్చాలనే తపన ఎందుకు వుంటుంది?

మా తాతగారిది ఛాందస కుటుంబం. ఆయన ఆచరించడమేకాదు ఇంట్లో కొడుకులూ ఆచరించి తీరాలనే మొండిమనిషి. మా పెదతండ్రులు ఆయన మాట జవదాటలేదు. కానీ మా నాన్నకి ఆయన పద్ధతి సుతారమూ నచ్చేదికాదు. తండ్రిని కాదని ఆయనతో చెప్పకుండా నన్ను పట్నం తీసుకెళ్లి బంధువులింట్లో వుంచి చదివించాడు. చదివించడం ఏముందిలే! అయిదు రూపాయలు అడిగితే రూపాయి చేతిలోపెట్టే పీనాసి మా తాత. డబ్బులేకుండా పొరు

గూర్లో చదివించడం మాటలుకాదు. అందు వలన వారాలు చేసుకుని బతకమని, ఆయా కుటుంబాలవారికి, ఏదైనా పనిచేసిపెట్టి స్కూల్ ఫీజుకట్టుకో. అంటూ నన్ను పంపించాడు. ఆ రోజుల్లో ఏడో క్లాసుచదివి, మిలట్రీలోకి వెళ్లిపోయాను. ఆ తర్వాత మా నాన్న చాలా ఏడ్చేవ్వేడు. ఏదో చదివి వృద్ధిరిస్తా వనుకుంటే మిలట్రీలోకి వెళ్లావేమిట్రా అని! ఏమో నాకు అలా చేయాలనిపించింది. చేశాను అన్నాను ధైర్యంగా.

అలా వచ్చి వెడ్తూన్నప్పుడు ఒకమ్మాయి పరిచయం అయింది. పెళ్లి చేసుకున్నాను. ఆ పెళ్లి కూడా ఎవరికీ ఇష్టంలేదు. మాకు ఓ అమ్మాయి పుట్టింది. పసిపిల్లను చూశాక ఉద్యోగం మానేసి వద్దాం అనిపించేది. కానీ నా భార్య, ఇక కొద్దికాలం ఓపికపట్టు. వచ్చేసి ఇంటిపట్టున వుందువుగాని. ఇప్పుడు మనకి సంపాదనలేదు. ఈ పసిపిల్లతో జీవించడం కష్టం. మానాన్నకి ఇష్టంలేని పెళ్లి చేసుకున్నానని కోపం. చివరికి నాకు గాక ఆస్తి ఎవరికి ఇస్తాడు? ఈమధ్యనే పంతం విడిచిపెట్టాడట. మెల్లిగా దిగివ స్తాడు. అంటూ నచ్చచెప్పింది. అలాగే వెళ్లి పోయాను. కానీ ఆ వెళ్లడం వెళ్లడం ఎని మిది సంవత్సరాల వరకూ తిరిగి రాలేకపో యాను. ఈలోగా మామావ చనిపోతూ ఆస్తిని కూతురికి అప్పగించాడు. పాపం అమ్మాయితో అలాగే ఆస్తిని సంరంక్షించు కుంటూ వచ్చింది. నేను రిటైర్ అయి ఇంటికి తిరిగివచ్చాను. అప్పటికి నా కూతు రికి పదిహేనేళ్లు. నా భార్యని, కూతుర్ని తీసుకుని విశాఖపట్నంలో కాపురం పెట్టాను. కాలేజీలో చేరింది అమ్మాయి. కొన్నేళ్లపాటు మా సంసారం హాయిగా గడి చిపోయింది. మా పొలాలు, ఆస్తిని సంర క్షించే మనిషి చనిపోయాడు. నాకు ఏమా త్రమూ వ్యవసాయం గురించి తెలియదు. మరో మనిషికి అప్పగించక తప్పలేదు. అమ్మాయి చదువుకుంటోంది. ఇంతకా లమూ దూరంగా వున్న నేను అమ్మాయి తోనే వుండాలని నిశ్చయించుకున్నాను. ఈ కారణంగా ఆస్తి గురించి కొంత నిర్లక్ష్యమే చేశాను. అలా అని ఈ పల్లెటూళ్లో ఖాళీగా కూర్చోవడమూ కష్టం. విశాఖపట్నంలో ఉద్యోగం చేశాను. అమ్మాయి ఎంఎస్సీ చది వింది. ఇక పెళ్లి సంబంధం చూడటం మొదలు పెట్టాను. పెళ్లిచేసి ఈ వూరికి తిరిగి వచ్చేయాలని నా ఆలోచన.

అమ్మాయికి మంచి సంబంధం చేయాలని చూశాను. చివరికి కుదిరింది. మా ఆస్తి బేరం పెట్టాను. పెద్దగా డబ్బురాలేదు. ఆ డబ్బు తెచ్చి కాబోయే వియ్యంకుడికి ఇచ్చాను. ముహూర్తాలు నిశ్చయించారు. నా కూతురు ఈ పెళ్లి ఇష్టం లేదనీ తానొక అబ్బాయిని ప్రేమించాననీ చెప్పింది. నా కూతురు ఇష్టానికి వ్యతిరేకంగా చేయాలని నేను అనుకోలేదు. నా దగ్గర ఈ రహస్యం ఎందుకు దాచిందో అర్థం కాలేదు. "ఏమి టమ్మా ఇది! ఇంతదాకా వచ్చిన సంబంధం కాదంటే మన మర్యాద పోతుంది. అలా అని నీకు ఇష్టంలేని పెళ్లి చేయలేను. సరే! ఏ నిష్ఠూరమైనా భరిస్తాను. అతనెవరో చెప్పు" అని అడిగాను.

చెప్పింది. వెళ్లి అతని తండ్రితో జరిగింది చెప్పి నా కూతుర్ని కోడలిగా చేసుకోమని అడిగాను. ఆయన నన్ను చిన్నచూపు చూశాడు. ఇంట్లోకి వెళ్లి భార్యతో చెప్పాడు. ఆవిడ వచ్చింది. బాబూ! అబ్బాయి ఈ విషయం మాతో చెప్పలేదు. వాడు మీ అమ్మాయినే పెళ్లి చేసుకుంటానూ అంటే మేము కాదనం. వాడు ఇప్పుడు ఊళ్లోలేడు. ఊళ్లోనేకాదు, ఈ దేశంలో లేడు. మరి వాడు రావడానికి రెండు సంవత్సరాలు పడు తుంది. అంతదాకా మీ అమ్మాయిని వుంచు తారా? మీ ఇష్టం. అందావిడ గడుసుగా.

నాకేమీ పాలుపోలేదు. ఇందులో ఎవరో మోసం చేస్తున్నారు. అబ్బాయా? ఈ తల్లీ తండ్రా? వాళ్లు చాలా పలుకుబడి గల




వారు. గొడవ పెట్టుకుని ప్రయోజనం లేదు. వూరుకుంటే ఏమవుతుందో తెలియదు. నిజానికి ఆ క్షణంలో కొడుకుతో ఫోన్‌లో మాట్లాడగల ధనవంతులు వాళ్లు. కాని ఆ పని వాళ్లు చేయాలని అనుకుంటే కదా చేయడానికి!

నేను మళ్లీ కలుస్తానని చెప్పి ఇంటికి వచ్చాను. జరిగిందేమిటో అమ్మాయికి చెప్పాను. అమ్మాయికీ తెలిసివచ్చింది. అబ్బాయి అమెరికా వెళ్లినా పెళ్లి ప్రసక్తి తల్లి తండ్రులతో చెప్పినా, అమ్మాయితో చెప్పకుండా వుండడు. ఈ రెండూ జరగలేదని కొన్ని రోజులకు మాకు తెలిసి వచ్చింది. మేం అమ్మాయికి కుదిర్చిన సంబంధం వారి దగ్గరకు వెళ్లి జరిగింది ఏమిటో చెప్పాం. వాళ్లు సంబంధం వదులుకోవడం కంటే చేసేదిలేదన్నారు. సరే మా సొమ్ము తిరిగి ఇవ్వమని అడిగాను. దానికి జవాబుగా అయ్యో! మీరిచ్చిన కట్నం సొమ్ము, మా అమ్మాయికి పెళ్లి కుదుర్చుకున్న అబ్బాయి తండ్రికి ఇచ్చాం. ఇప్పుడు ఈ సంబంధం తప్పిపోయింది కాబట్టి మా అమ్మాయి పెళ్లి కూడా రద్దు చేసుకుంటాం అని ఎలా చెప్పమంటారు? మీరే ఆలోచించండి. ఒక ఆడపిల్ల పెళ్లిని మీ అమ్మాయి కారణంగా చెడగొడతారా? ఇందులో మా తప్పు ఏమిటో చెప్పండి. మా అబ్బాయిని కాదన్నది మీ అమ్మాయి. మా అమ్మాయి నష్టపోవడం ఎంతవరకూ న్యాయం? అంటూ వారా డబ్బు విషయం వదులుకోమనే అర్థం వచ్చేలా చెప్పారు.

పెళ్లి గురించి కంగారుపడి అమ్మిన ఆస్తిలో సగం నష్టపోయాం. పోనీ అమ్మాయి కోరుకున్న వరుడితోనూ పెళ్లి జరగలేదు. చూస్తూ చూస్తూ మరో ఆడపిల్ల పెళ్లి మావలన చెడిపోవడం మనస్కరించనూలేదు. ఈ రకంగా సమస్తం పోగొట్టుకున్నాం. అమ్మాయి రోజురోజుకీ దిగులుతో కృంగి కృశించి పోతోంది. మరో పెళ్లి సంబంధం చూడగల స్తోమతు లేదు. అమ్మాయీ ఒప్పుకోదు. నాకు పెళ్లి వద్దు ఇలాగే వుండిపోతానంది. అందుకు కారణం ప్రేమించిన వాడు మోసం చేయడం. తను తల్లి కావడం మా భార్యాభర్తలిద్దరమూ జీవచ్ఛవాల్లా మిగిలాం. ఎలాగో ధైర్యం తెచ్చుకుని, పుట్టబోయే బిడ్డను మేమే పెంచాలని నిర్ణయించుకున్నాం. అమ్మాయికి నెలలు నిండాయి. మగబిడ్డ కలిగాడు. కాని అమ్మాయి వాణ్ణి మాకు అప్పగించి తనేమో శాశ్వతంగా ఈ లోకాన్ని విడిచి వెళ్లిపోయింది.

పసిబిడ్డను తీసుకుని ఈ ఊరు వచ్చాం. ఈ స్థలం కొనుక్కుని ఇక్కడే పూరిల్లు వేసుకుని వుంటున్నాం. మనవడి పేరు కార్తీక్. కార్తీక పున్నమిరోజు పుట్టాడు. అందుకని ఆ పేరు పెట్టింది పార్వతి. వాడు చదువులో ఫస్ట్‌గా వచ్చాడు. ఇప్పుడు ఉద్యోగ ప్రయత్నంలో బెంగుళూర్ వెళ్లాడు. పార్వతి ఎవరో తెలుసా జయా? పార్వతీ పంకజ ఆమె పేరు. అరవింద నా కూతురు. పంకజానికి తండ్రి ఇచ్చిన ఆస్తిని సంరక్షించిందీ, నా భార్యాబిడ్డలను అపవాదులెన్నో భరించి ఆదుకున్నదీ మీనాన్న రంగనాథమే బాబూ" సూర్యంగారు చెప్పిన ఆయన గతాన్ని వింటూంటే జయచంద్రకి కళ్లు చెమర్చాయి. మనసంతా బరువెక్కిపోయింది.

"అయ్యో పార్వతమ్మగారిని నేను పోల్చుకోలేకపోయాను. అంత మంచి మనసున్న పంకజమ్మగారికి ఎన్ని కష్టాలు వచ్చాయి? సూర్యంగారూ! మన చుట్టూ జరిగిన ఈ కథ ఇప్పటివరకూ నాకు తెలియలేదు. అరవింద ఎంత బుద్ధిమంతురాలు? ఎంత దయార్ద్ర హృదయ! సహనశీలి! ఆ అమ్మాయి మంచితనాన్ని ఆసరాగా తీసుకుని మోసం చేశాడు ఓ దుర్మార్గుడు. నాన్నగారు చెప్పినట్టు, ఏ రకంగానూ పంకజమ్మ, అరవిందలకు నేను ఏమీ సహాయం చేయలేకపోయాను" అంటూ విలపించాడు జయ

చంద్ర.

"జయచంద్రా ఎక్కడోవున్న నువ్వు ఏమీ చేయలేకపోయానని విలపించడంలో అర్థం లేదయ్యా! నేనుండి అరవిందను కాపాడుకోగలిగానా? విధి నిర్ణయాలు మన చేతుల్లో వుండవు బాబూ! సున్నితమనస్కులకు రోజులుకావు. కఠినత్వం, ఏదైనా ఎదిరించగల ధైర్యం వుంటేనే మనిషికి మనుగడ! పద బాబూ! పార్వతి ఎదురు చూస్తూంటుంది" అంటూ సూర్యంగారు ఇంటివైపు అడుగులు వేశారు.

"పార్వతీ ఈ అబ్బాయిని గుర్తుపట్టావా? రంగనాథంగారి అబ్బాయి, అరవింద వయసువాడు జయచంద్ర" అన్నాడు ఆ రాత్రి భోజనాలు చేశాక సూర్యంగారు.

"అలాగా? గుర్తులేదండీ! అబ్బాయి కూడా మారాడు మరి. ఏమిటో ఆరోజులే వేరు. చాలా హాయిగా, సుఖంగా గడిచాయ్. అందరం కలసి వున్నామనే సంతృప్తిలేకుండా అమ్మాయి జీవితం అస్తవ్యస్తం అయిపోయింది" అంటూ బాధపడి, అంతలోనే తేరుకుని "మీ నాన్నగారు మహదొడ్డ మనిషి. నాకు తోబుట్టువులు లేని లోటు తీర్చారు. మా ఆస్తిపాస్తులు కంటికి రెప్పలా కాపాడినవారు. మాకే అదృష్టంలేకపోయింది. ఆయన మేలు ఎన్ని జన్మలకూ మరచిపోము. ఆయన కొడుకువి నిన్ను చూస్తే మీ నాన్నగార్ని చూసినట్టే వుంది బాబూ! గుర్తు పట్టలేకపోయాను. ఏమీ అనుకోకు నాయనా" అంది పార్వతమ్మ ఆప్యాయంగా.

"ఇప్పుడు పార్వతమ్మగారు, అప్పుడు పంకజమ్మగారు! మన బంధుత్వాలు తర్వాత కలిశాయి కానీ మీరు నాకు మాత్ర దేవతా సమానులు. కడుపునిండా తిండిలేక పస్తులుండే రోజుల్లో కన్న కొడుకులా ఆదరించిన మీకు ఎన్ని కష్టాలు వచ్చాయమ్మా? నాన్నగారి మాట నిలబెట్టుకోలేకపోయానని చాలా బాధగా వుందమ్మా" పార్వతమ్మగారి పాదాలమీద చేతులువేసి అన్నాడు జయచంద్ర.

రాకేష్‌కి వాళ్ళ మాటలు అర్థం కాలేదు. కానీ ఈ గ్రాండ్‌మా, గ్రాండ్‌పా చాలా ముఖ్యులు, గ్రేట్ పర్సన్ అని మాత్రం అర్థం అయింది. వాడూ తండ్రితోపాటు పార్వతమ్మగారి దగ్గర వచ్చి కూర్చున్నాడు.

"రాకేష్ బాబూ! మీ నాన్న మాకు చాలా ఆప్తుడ్రా నాయనా! ఇప్పుడు నువ్వున్నట్టే వుండేవాడు. నాకు చాలా ఆనందంగా వుంది" అంటూ రాకేష్‌ని దగ్గరగా హత్తుకుంది.

"గ్రాండ్‌మా! అయితే కార్తీక్ ఫోటో చూపించు. నాకో ఫ్రెండ్ వున్నాడుగా" అన్నాడు.

"ఇదిగో ఆ ఆల్బమ్ ఇలా తీసుకురండి" అనగానే సూర్యంగారు తెచ్చి ఇచ్చారు.

అందులో పార్వతమ్మ పెళ్ళి ఫోటో, అరవింద చిన్ననాటి ఫోటో తర్వాత రంగనాథం, జయచంద్ర, కార్తీక్ ఫోటోలు వరసగా వున్నాయి. ఒక్కో ఫోటో తదేకంగా చూస్తూ ఆనాటి రోజుల్ని తలుచుకుంది పార్వతమ్మ.

"జనార్ధనం! నీ పుణ్యమాఅని, ఈరోజు ఎంత ఆనందంగా వుందోనయ్యా! ఇక నేనే మైపోయినా ఫర్వాలేదు" అందావిడ.

"ఊరుకోండి! మీరు నూరేళ్లు జీవించాలి. మేము వస్తూనేవుంటాం. మీరిలా కబుర్లు చెబుతూనే వుంటారు" అన్నాడు జనార్ధనం.

"సూర్యంగారూ! కార్తీక్ అడ్రస్ ఇవ్వండి. మేము కలుసుకుంటాం. అబ్బాయికి అమెరికాలో చదువుకోగల అవకాశం వుంది. అతనికీ, మీకూ ఇష్టమైతే నేను రప్పించుకుంటాను" అన్నాడు జయచంద్ర.

'జయచంద్ర కార్తీక్‌కి ఉపకారం చేయాలనుకోవడం వరకూ బాగానే వుంది. కానీ ఈ వయసులో కార్తీక్‌ని వదిలి ఈ దంపతులు జీవించగలరా? ' అనుకున్నాడు మనసులో జనార్ధనం.





సూర్యంగారు కార్తీక్ అడ్రస్ రాసిచ్చారు. ఫొటో కూడా తీసుకున్నాడు రాకేష్. వారం రోజులూ సంతోషంగా గడిపారు ఆ రుష్యాశ్రమంలాటి సూర్యంగారి కుటీరంలో ఇదో 'మధురానుభూతి' అనుకున్నాడు జయచంద్ర మనస్ఫూర్తిగా.

నీలిమా, శశికాంత్ బెంగుళూర్‌లో సాఫ్ట్‌వేర్ కంపెనీలు చుట్టివచ్చారు. బెంగుళూర్‌లో విశ్వేశ్వరయ్య ఏరో నాటికల్ మ్యూజియమ్ చూశారు. నీలిమకు మ్యూజియమ్ చాలా నచ్చింది. అమెరికన్ కొలాబరేట్ కంపెనీలను చూశారు. అన్నీ చూసిన తర్వాత శశికాంత్ అడిగాడు. "మా ఇండియా ఎలా వుంది మిస్?"

"మీ ఇండియా? అయామ్ ఆల్సో ఇండియన్ మరీ అంత సెల్ఫిష్ కాకండి శశీ" అంది నీలిమ.

"మీరు అమెరికన్ సిటిజన్ కదా. అందుకని అన్నాను. సారీ మనిండియా... సరేనా" అన్నాడు శశి.



"గుడ్! అలారండి దారికి. ఇండియా మనది కాబట్టి బాగుంది. చాలా బాగుంది. అయినా నాకు కొత్త కాదండీ. ఇవన్నీ ఎప్పుడో చూసేశాను. ఇంప్రూవ్‌మెంట్ ఎలా వుందా అని వస్తూంటానంతే" అంది నీలిమ.

"మీతో మాట్లాడలేనండీ బాబూ!" అన్నాడు శశికాంత్.

ఇద్దరూ పేరుపొందిన ఫైవ్‌స్టార్ హోటల్‌కి డిన్నర్ చేయాలని వెళ్ళినప్పుడు అక్కడ ఒకతను పరిచయం అయ్యాడు నీలిమకు.

నీలిమ ఆరోజు స్లీవ్‌లెస్ జాకెట్ ధరించింది. కళ్లు తిప్పుకోకుండా ఒకతను ఆమెనే పరీక్షగా చూస్తుంటే నీలిమ అతడ్ని ముప్పుతిప్పలూ పెట్టింది.

"ఏయ్ మిస్టర్? ఏంటలా గుడ్లు మిటకరించి చూస్తున్నావ్? ఇంతకుముందు ఇలాటి డ్రస్ చూడలేదా, లేక అసలు అమ్మాయిల్నే చూడలేదా?" అని అడిగింది.

"డ్రస్ చూశాను. అమ్మాయిల్నీ చూశాను. అయితే ఈ డ్రస్ ధరించిన ఈ అమ్మాయిని ఇండియాలో ఇప్పుడే చూస్తున్న" అన్నాడతను.

"అలాగా పాపం! నావైపు చూసిన అబ్బాయిల్ని చూశాను. కానీ నీలా చూసిన అబ్బాయిల్ని మాత్రం విడిచిపెట్టను" అంది.

"ఏం చేస్తారేం...? నాకు చూడటానికే కదా రెండు కళ్లున్నాయి" అన్నాడతను.

"కళ్ళున్నది చూడటానికే అయితే, నాకు చేతులున్నాయి కదా, మీ చెంపలు వాయించేదా?"

"ఏం తప్పు చేశానని నా చెంపలు వాయిస్తారు... మిస్?" అన్నాడతను.

"మీ కళ్లు నన్ను నిలువునా పరిశీలనగా చూస్తున్నాయి కాబట్టి, కంటికి కన్నే బెటర్ అంటారా" లేచి నిలబడి అతనివైపు అడుగులు వేయబోయింది నీలిమ.

శశికాంత్ ఏం గొడవ అవుతుందోనని భయపడి నీలిమని బైటకు తీసుకువచ్చేశాడు.

"లీవ్‌మి శశీ! సభ్యత లేని ఆ మనిషి మాటకి మాటా ఎలా బదులు ఇచ్చాడో!

అతనిపని పడతాను" అంది మొహమంతా ఎర్రగా చేసుకుని నీలిమ.

"నీలిమా ప్లీజ్! మనం అతని దారిన అతడ్ని వదిలేయడం మంచిది" అంటూ కారు సీట్‌లో కూర్చోబెట్టి, డోర్ లాక్ చేశాడు.

లాడ్జింగ్ దగ్గిర దిగి రూమ్‌లోకి వెళ్ళబో తుంటే "ఎక్స్‌క్యూజ్‌మి మిస్, నా బిహేవి యర్‌కి మీకు సారీ చెప్పాలని వచ్చాను" అంటూ డిన్నర్ దగ్గిర వాదులాడినతను వచ్చాడు.

"ఇట్స్ ఓ.కే! మీరు ఎక్కడుంటారు?" జరిగిందంతా క్షమించేసి మామూలు మూడ్‌లోకి వచ్చిన నీలిమ మాటలు కలి పింది. రూమ్‌లోకి పిలిచి శశిని పరిచయం చేసి తనను పరిచయం చేసుకుంది.

ఈ నీలిమ అతగాణ్ణి నిజంగానే చెంపలు వాయగొడుతుందని భయపడిన శశికాంత్ ఇద్దరూ రాజీకి రావడం చూసి రిలీఫ్ ఫీల య్యాడు.

ముగ్గురూ సరదాగా కబుర్లు చెప్పుకు న్నారు. ఎవరు ఎక్కడ్నించి వచ్చిందీ చెప్పు కున్నారు. నీలిమ తనెవరో చెప్పగానే "వాటె సర్‌ప్రైజ్? మీరు జయచంద్ర అంకుల్‌కి డాటరా? అంకుల్, ఆంటీ మా ఇంటికి వచ్చారు. మీరు వస్తున్నట్టు నాకు తెలి యదు. అఫ్‌కోర్స్ నేను అంకుల్‌తో ఎక్కువ టైమ్ స్పెండ్ చేయలేదనుకోండి" అన్నాడు అభిరాం.

"అయితే మా డాడ్, మీ డాడ్ భార్గవా ఫ్రెండ్సా, రిలెటివ్సా?" అడిగింది నీలిమ.

"మీ డాడ్ మా గురించి నీకు ఎప్పుడూ చెప్పలేదా నీలిమా?" బంధువేకదాని చొర వగా అన్నాడు అభిరామ్.

"లేదు అభిరామ్. మా ఇంట్లో అలా ఎవరు, ఎవర్ని కలవడానికి వెడుతున్నారో ముందుగా చెప్పుకోం. పరిచయం చేసిన ప్పుడే తెలిసేది" అంది నీలిమ.

'ఇంతకీ నీలిమకి ఈ పెళ్ళికొడుకుల సెల క్షన్ గురించి ముందుగా తెలియదన్న మాట. తెలిసే వెంట తిప్పుకుంటోందని మురిసిపోయాడు తను. అనవసరంగా బోలెడు డబ్బు తగలేశాడు. ఇప్పుడేమో, పోటీగా అభిరామ్‌గాడు తయారయ్యాడు. తను మెల్లిగా తప్పుకోవడం బెటరా? లేక రేస్‌లో నీలిమను గెల్చుకోవడం బెటరా? ఇంతదాకా వచ్చాక చవటలా పారిపో తావా? ఏం నువ్వు అభిరామ్ కంటే ఎందులో తక్కువా? నిజానికి అభిరామ్ ఫాదర్ రిచ్ అవునో కాదో తెలియదు కానీ, మీ నాన్న మాత్రం చాలా రిచ్... చివరి దాకా పోరాడు. గెలుపు, ఓటమి దైవాధీనం' అని మనస్సాక్షి ప్రోత్సహించడంతో ఉత్సాహం తెచ్చుకున్నాడు శశికాంత్.

'అసలు సంగతి ఇదా? ఈ శశికాంత్ గాడు నీలిమ వెంట చాలా ఊళ్లు తిరిగాడు ఆల్రెడీ! అంటే ఇద్దరూ బాగా దగ్గిరయ్యారు. మా నాన్న లేనిపోని స్టయిల్ చూపించి నన్నోసారి అలా చూపించి ఇలా పంపించే శాడు. అనెక్స్‌పెక్టెడ్‌గా ఈ అమ్మాయి కనబ డటం, ఇలా కలహంతో మొదలైన పరి చయం, కొంచెం దగ్గిరవడానికి కారణం కావడం లక్కే! కానీ ఈ అమ్మాయి ఇక అమెరికా వెళ్లిపోతుందే! ఈ అమ్మాయితో ఎక్కువగా గడిపే అవకాశం లేకుండా పోయిందే! ఇదంతా నాన్న చేసిన తెలివిత క్కువపని! అదే శశికాంత్ నాన్న ఎంత తెలి విగా కొడుకుని, నీలిమతో పంపాడు, అని ఒకటే ఇదైపోయాడు అభిరామ్ శశిమీద జలసీతో.

ఇదేమీ తెలియని నీలిమ 'ఇద్దరు స్పెసిమ న్స్‌తో బలే టైమ్‌పాస్ అయింది' అనుకుంది హాయిగా మనసులో.

★ ★ ★

అనుకున్నవి జరగటం మామూలే! అందులో వింతలేదు. అనుకోకుండా ఈ చిత్ర నాకు పవిత్ర గంగాస్నాన ఫలితం దక్కించింది. ఇదంతా జయచంద్ర ఈ

బెంగాలీ పిల్లని ప్రేమించి పెళ్ళాడబట్టేకదా? అయితే ప్రేమా, పెళ్ళీ వాళ్ళ స్వంత విషయం అయినా కుల, మత, దేశాంతర వివాహాలవలన నాబోటివాళ్ళకి ఉపయోగాలూ వుంటాయన్నమాట. ఇకమీదట ఎవరేనా ఇలాటి పెళ్ళిళ్ల చేసుకుంటామంటే నేనే దగ్గరుండి ప్రోత్సహించి మరీ జరిపిస్తాను" అనుకుంది జానకి.

"అందరూ అనుకున్నట్టుగా వారం రోజులకి సరిగ్గా హైదరాబాద్‌లో జనార్ధనం ఇంటికి చేరుకున్నారు. ఎవరి ట్రిప్ ఎలా జరిగిందో చెప్పుకున్నారు.

"డాడ్ నీ బంధువు జయదేవ్ గారబ్బాయి శశికాంత్, భార్గవగారి అబ్బాయి అభిరామ్ మంచి కంపెనీ ఇచ్చారు" అంది నీలిమ.

సుచిత్ర, జయచంద్రా, జనార్ధనం ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు ఆశ్చర్యంగా!

"అభిరామ్ కూడా నిన్ను కలిశాడా? ఎలా? మేము నువ్వు వస్తున్నట్టు భార్గవతో చెప్పలేదే...? " ఆశ్చర్యంగా అన్నాడు జయచంద్ర.

"అనుకోకుండా హోటల్లో కలిశాడు డాడ్. మాటల్లో తెలిసింది. నేను నీ కూతుర్నని. అదన్నమాట" అంది నీలిమ.

"సరే! మొత్తంమీద మన ఈ ఇండియా ట్రిప్ చాలా సరదాగా గడిచింది. మనం ఇక అమెరికా బయలుదేరుదాం. ఈ రెండు రోజులూ షాపింగ్ అంటూ తిరగద్దు. పూర్తిగా బాబాయి, పిన్నిలతోనే గడపాలి" అన్నాడు జయచంద్ర.

"డాడ్! ప్లీజ్, నేనూ, అక్కా ఒక్కసారి మ్యూజిక్ వరల్డ్‌కి వెళ్ళివస్తాం. తెలుగు, హిందీ సాంగ్స్, మూవీ డివిడిలు కొనుక్కుంటాం" అన్నాడు రాకేష్.

"సరే వెళ్ళండి. నాకూ మంచి ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్ ఆడియో కేసెట్స్ తీసుకు రండి" అన్నాడు జయచంద్ర.

"అంటే ఏమిటో నీకేమైనా అర్థం అయిందా చిన్నక్కా? " సైగచేసి అడిగాడు రాకేష్.

"నాకూ తెలీలేదు. ఏవో ఒకటి తెచ్చిద్దాంలే పద" అంటూ అభినయించింది నీలిమ.

"జానకి పిన్నీ! నీ చేతివంట అమృతం. మళ్ళీ మేం ఇండియా వచ్చేవరకూ గుర్తు వుంచుకుంటాం. నందిత పెళ్ళికి మీరు తప్పక రావాలి. ఏ కారణం చెప్పి తప్పించుకున్నా ఊరుకునేది లేదు.

బాబాయ్! ఇదిగో కార్తీక్ అడ్రస్. నువ్వు కార్తీక్‌తో మాట్లాడి, అతని ఫ్యూచర్ ప్లాన్స్ ఏమిటో తెలుసుకుని వివరంగా నాకు ఉత్తరం రాయి. మరచిపోవద్దు" అన్నాడు జయచంద్ర.

"చిన్నత్తా! పట్టుచీరల సెలక్షన్ నీకు బాగా తెలుసు. నేను ఎవరికి ఎన్ని కొనాలో రాస్తాను. నువ్వు వచ్చేటప్పుడు తీసుకురా! అలాగే వెండిసామాన్లు. పెళ్లికి వచ్చే వారికిచ్చే గిఫ్ట్స్ వగైరా అంతా నీదే బాధ్యత. నీచేతి చలవ మంచిది. అందుకని అన్నీ నీ చేతులమీదనే జరగాలని నా కోరిక" అంది సుచిత్ర.

"అంతా నీకు నామీద వున్న అభిమానం చిత్రా! అలాగేనమ్మా అలాగే కొనితెస్తాను. నా కన్నకూతురిలా కలిసిపోయావు. మీరు వెళ్ళాక కొన్నాళ్లు మాకు చాలా దిగులుగా వుంటుంది. రాకేష్ తెలుగు మాటలూ, పాటలూ... ఎప్పుడూ లేనంత సందడిగా గడిచిపోయింది" అంది జానకి అభిమానంగా.

పెళ్ళికి కొనాల్సిన వాటికి పది లక్షలకు చెక్‌లు రాసిచ్చాడు జయచంద్ర. "బాబాయ్, మీరు టికెట్స్‌కి ఈ డబ్బులో వాడండి. లేకపోతే నాకు బాధగా వుంటుంది" అన్నాడు.

"అలాగేరా జయా! నీ మనసుకి ఏది సంతోషం అనిపిస్తే అదే చేస్తాను సరా? " అని మాటిచ్చాడు జనార్ధనం.

"జానకీ! ఊరగాయలూ, అప్పడాలూ, వడియాలూ సర్దావా? ఏమీ మరచిపోలేదుకదా"

అన్నాడు.

"లేదండీ. ఏదీ మరచిపోలేదు. అన్నీ సర్దాను" అంది జానకి.

"ఊరుకో బాబాయ్. పిన్నిని హైరానా పెట్టకు. ఇచ్చినవి చాలు. ఇక్కడ తిన్నవీ చాలు. నీ చాదస్తం కానీ" అన్నాడు జయచంద్ర.

"ఏంలేదురా! మీరలా వెళ్ళగానే, అయ్యో జయకి అది ఏదో చాలా ఇష్టం మరిచేపోయాను. చిత్రకి ఆ నగ ఏదో అడిగింది. కొన్నాను. ఇవ్వడమే మరచిపోయాను. నీలూకి రేగుపళ్ళ వడియాలు పెట్టనేలేదు. జనవరి దాకా రావుకదా? పాపం అది ఇక్కడ వున్నన్నాళ్ళూ ఆ పాత వడియాలు ఎంత ఇష్టంగా తిందో... రాకేష్‌కి జున్ను ఇష్టం. ఇండియన్ పుడ్డింగ్ అంటూ మహా సరదాపడతాడు. వెళ్ళేరోజు చేద్దాం అనుకున్నాను. తీరా జున్నుపాలు లేకపోయాయ్. నందితకి ఆ గాగ్రా డ్రెస్ మరీ లైట్ కలర్ అయిపోయింది. పచ్చటి శరీర ఛాయ



దానిది. డార్క్ కలర్ కొని వుండాల్సింది అంటూ మూడురోజులు బాధపడుతుంది. నాకు తెలుసుకదా! అందుకే గుర్తు చేస్తు న్నాను. లేకపోతే మీకైనా బుద్ధిలేదు. గుర్తు చేయరు అని నాకు తలంటి పోసేస్తుందిరా బాబూ! అసలే బట్టతల ఆ నాలుగు వెంట్రు కలూ కూడా వుండనీయదు" అంటూ జనా ర్ధనం గుక్క తిప్పుకోకుండా జానకి అభి మానం గురించి చెప్పుకొచ్చాడు.

"అవును మామా నాకు అత్తగారూ, మామగారూ అంటే తెలియదు. మీరు అత్త గారూ, మామగారూ ఇలా వుంటారు అని గుర్తుచేస్తున్నారు. మీకు థ్యాంక్స్ ఏమని చెబితే బాగుంటుంది? " అంది సుచిత్ర వచ్చీ రాని తెలుగులో.

జయచంద్ర, సుచిత్ర, పిల్లలూ అమెరికా వెళ్ళిపోయారు. అనుకున్నట్టే నాలుగురో జులు జనార్ధనం, జానకీ వాళ్లని తల్చుకుం టూనే వున్నారు.

"నీలమ్మ ఎవర్ని ఇష్టపడుతుందంటారు? " భర్తని అడిగింది జానకి.

"నీ ఆత్రం బంగారంగానూ! ఇలా వెళ్ళ గానే పెళ్ళి గురించి ఆలోచిస్తున్నావా? నా దృష్టిలో అమ్మాయికి ఇద్దరూ నచ్చకపో వచ్చు. ఒకవేళ నచ్చితే...? "

"ఆ ఎవరు నచ్చుతారు? " ఆత్రంగా భర్త వైపు చూసింది జానకి.

"ఊహు... చెప్పలేను. ఊహకు అందటం లేదు" అన్నాడు జనార్ధనం.

"అయినా మీరు చెప్పినట్టు నందిత పెళ్లి అయ్యాక నీలిమ చదువు పూర్తి అయిన తర్వాత సంగతి కదా? వీళ్ళు కాకుండా మూడోవాళ్ళు తటస్థపడతారేమో ఎవరు చెప్పగలరు? చాలా టైమ్ పట్టవచ్చు. అవునూ... మనం నిజంగానే నందిత పెళ్ళికి వెడతామా? " అడిగింది జానకి.

"ఏం అనుమానం ఎందుకు? తప్పకుండా వెడదాం! ఇప్పట్నించే జున్ను, జంతికలు, చెగోడీలు చేయడం మొదలు పెడతావా ఏమిటి? అక్కడ అన్నీ దొరుకుతాయిలే" అన్నాడు జనార్ధనం.

"మళ్లీ హేళనచేయడం మొదలెట్టారూ? ఏం దొరికినా మన ఇంట్లో మనం చేసుకు న్నంత రుచిగా వుంటాయా? వేసవికాలం వచ్చివుంటే మామిడి పళ్లు, ముంజలూ వచ్చి వుండేవి. ఎంతో అపురూపంగా తినేవారు. పాపం ఎండలో తిరగడం అలవాటులేక బాధపడేవారేమో! ఇప్పుడు రావటమే మంచి దైంది. ఇక నందితకి ఫిబ్రవరిలోనే ముహూర్తాలు నిశ్చయిస్తారేమో"

"ఫిలిప్స్ అంటే అమెరికా అబ్బాయి. ముహూర్తాలు ఏమిటి? చర్చిలో పెళ్ళిచేస్తా రేమో. అడగనేలేదు. ఏ పెళ్ళి అయినా మనకి ఆనందమే! ఎప్పుడూ చర్చిలో పెళ్ళి చూడనేలేదు మనం" అన్నాడు జనార్ధనం.

"నేనైతే అటు వాళ్ళ పద్ధతిలోనూ, ఇటు మన పద్ధతిలోనూ చేయడం మంచిదం టాను. వాళ్లకీ మన పద్ధతి తెలుస్తుంది. వాళ్ళ పద్ధతి మనకు తెలుస్తుంది" అంది జానకి.

"వాళ్లలో పెళ్ళిళ్ళు కూడా చాలా ఆర్భా టంగా చేస్తారు. సంవత్సరం ముందునుంచే అనుకుంటారట. ప్రత్యేకంగా పెళ్ళి దుస్తులు కుట్టించుకుంటారు. పెద్ద ఎత్తున విందుభో జనాలు ఏర్పాటుచేస్తారు... జయ చెప్పాడు" అన్నాడు జనార్ధనం.

"నేను అమెరికా వెళ్ళడానికి నాలుగు పట్టుచీరలు కొనుక్కోవాలి. పాతకాలం నాటివి తీసుకెడితే బాగుండవు" పనిలో పనిగా తన కోరిక బయట పెట్టింది జానకి.

"ఒకటో రెండో చాలు. నాలుగెందుకు? అమెరికాలో పట్టుచీరలు ఎవరు కట్టుకుం టారు? ప్యాంట్, షర్ట్ వేసుకున్నా పట్టించు కోరు" అన్నాడు జనార్ధనం.

"ఇంకో నాలుగేళ్లు పోనీండి వేసుకుం టాను. వేళాకోళానికి హద్దుండాలి" అంటూ మూతిముడిచింది జానకి.

"నీతో కాకుండా, పక్కింటావిడతో హాస్య మాడితే వూరుకుంటానంటే సరే! నాకేమీ అభ్యంతరంలేదు" మరింతగా పరిహాసం చేశాడు జనార్ధనం.

"మిమ్మల్ని" అంటూ భర్త నోరుమూసింది అరచేత్తో జానకి.

జయచంద్ర అమెరికానుంచి ఉత్తరం రాశాడు, జూన్‌లో పెళ్లని అటు చర్చిలోనూ, ఇటు మా ఊరి టెంపుల్లోనూ, రెండు రకాలుగా పెళ్ళిచేయాలని నిర్ణయించుకున్నట్టు.

"చూశారా? జయకి నా మనసులోమాట తెలిసినట్టుంది. నేను అనుకున్నట్టే చేస్తున్నాడు. మొదట మద్రాస్ వెళ్ళి, పట్టుచీరలు కొందాం. సుచిత్ర ఎవరెవరికి ఎంత ఖరీదులో ఏ రంగులో కొనాలో వివరంగా రాసింది. ముందుగా బ్లౌజులు కూడా కుట్టించాలి కదా? రిజర్వేషన్ చేయించండి. అటునుంచి అటే మధుర చూసివద్దాం" అంది సంతోషంగా జానకి.

సుచిత్ర ఇచ్చిన లిస్ట్ ప్రకారం పట్టుచీరలూ, వెండిసామాన్లు కొని, తీసుకెళ్లాల్సినవన్నీ తయారుచేసి, నెలముందుగా బయలుదేరటానికి రెడీ అయిపోయింది జానకి. జానకి పట్టుచీరలంటే, వేళాకోళం చేసిన జనార్ధనం తను కూడా నాలుగు సఫారీ సూట్స్ కుట్టించుకుని, ట్రిమ్‌గా తయారయ్యాడు. పెళ్ళికి నెల ముందు అమెరికా విమానం ఎక్కారు. మొదటిసారి ప్రయాణం ఇద్దరికీ సంతోషంగా అనిపించింది. ఎక్కడా ఎటువంటి ఇబ్బందీ లేకుండా లాస్‌ఏంజిల్స్ ఎయిర్‌పోర్ట్‌లో దిగారు. చెకింగ్ వగైరాలు పూర్తిచేసుకుని వచ్చేసరికి జయచంద్ర, సుచిత్రా రెడీగా వున్నారు ఎదురుచూస్తూ. కుశలప్రశ్నలు వేసి, "బాబాయ్ మన ఊరికి రెండుగంటల ప్రయాణం కారులో. మీరు ఇక్కడే వుండండి. పార్క్‌చేసిన కారు తీసుకువస్తాను" అంటూ వెళ్ళి పావుగంటకి కారు తెచ్చాడు జయచంద్ర.

ఇంటికి వచ్చాక తాను తెచ్చిన వస్తువులన్నీ భద్రంగా, లెక్కప్రకారం సుచిత్రకి అప్పగించింది జానకి.

"చాలా బాగున్నాయి అత్తా! నీ సెలక్షన్ బాగుంటుందని నాకు తెలుసు. ఈ వెండిసామాన్లు కూడా నేను అనుకున్నకంటే బాగున్నాయి. తక్కువ ధరలో వచ్చాయి" అంటూ చాలా మెచ్చుకుంది సుచిత్ర.

నాలుగురోజులు ప్రయాణం బడలిక జెట్ లాగ్‌తో తనెక్కడుందో, ఏం తింటోందో తెలీకుండా నిద్రపోయింది జానకి. జనార్ధనానికి అంతగా అనిపించలేదు.

"పాపం పిన్ని చాలా అలసిపోయినట్టుంది బాబాయ్" అన్నాడు జయచంద్ర.

"అవున్రా జయా! పైకి విగ్రహం నిండుగా కనిపిస్తుంది కాని ఏమాత్రం బడలికనూ తట్టుకోలేదు. నీ ఉత్తరం వచ్చింది మొదలు ఒకటే హడావిడి, ఏం మరచిపోతానో అని ఒకటే ఆరాటం. ఒకపక్క నందిత పెళ్ళి, కలలో వూహించని ఈ అమెరికా ప్రయాణం అనే ఆనందంతో వుక్కిరిబిక్కిరైపోయింది. జానకి ముచ్చట తీర్చాలనే వచ్చాన్రా జయా!" అన్నాడు నిద్రపోతున్న జానకిని మురిపెంగా చూస్తూ.

ఒకపక్క నిద్రా, మరోపక్క ఇంట్లో సందడికి మెలకువా అనే అవస్థలో భర్త తన గురించి చెబుతూంటే హాయిగా అనిపించింది జానకికి.

"అవును బాబాయి!" జీవిత భాగస్వామిగా నీ జీవితంలో తన పన్నెండేళ్ల వయసులో అడుగుపెట్టిన పిన్ని నీకు చేదోడుగా వుంది. పిన్ని సంతోషం నీకు ముచ్చటు కావడం న్యాయమే" అన్నాడు జయచంద్ర.

ఫిలిప్స్ ఇంటికి తీసుకెళ్ళి బాబాయిని, పిన్నినీ పరిచయం చేశాడు. అమ్మా-నాన్నల తర్వాత అంతటి వారంటూ తన అభిమానం వెల్లడించాడు జయచంద్ర.

"అమెరికన్ ఫ్యామిలీ అయినా ఫిలిప్స్ తాత గారు, బాబాయిలు, పిన్నిలు, వారి పిల్లలూ అంతా ఒక పేలస్‌లాటి ఇంట్లో జాయింట్



ఫ్యామిలీగా వుండటం జనార్ధనానికి ఆశ్చర్యం కలిగించింది. తన పూర్వీకులు తాతగారి అన్నదమ్ములు నాటి వాతావరణం కనిపించింది. ఫిలిప్స్ తాతగారు డేవిడ్‌తో అదే విషయాన్ని ఆయనకు అర్థం అయేలా విడమరిచి చెప్పాడు.

"మీ ఇండియన్ హిస్టరీ అంతా నాకు తెలుసు. మహాభారత, భగవద్గీత, లార్డ్ కృష్ణ, రామాయణ వీడియో ఫిల్మ్స్ నా దగ్గిర వున్నాయి. మేము పుట్టుకకు క్రిష్టియానిటీ అయినా అన్ని మతాలను గౌరవిస్తాం. మాకు కుల, మత, దేశాల తేడా తెలియదు. అందరమూ ఆ క్రైస్ట్ కుమారులమే!" అన్నాడాయన. అంతేకాకుండా నందిత వలన మనం బంధువులుగా మరింత దగ్గిర కావడం అత్యంత ఆనందం అంటూ తన సంతోషం వెల్లడించాడు.

డేవిడ్ వయసు తొంభై సంవత్సరాలు. ఇప్పటికీ ఆయన తన పని తాను చేసుకుంటాడు. ఇంటిచుట్టూ వున్న తోటలో వాకింగ్ చేస్తాడు. అరగంట ట్రెడ్మిల్ చేస్తాడు. ఆయనకు భార్యలేదు. క్రితం సంవత్సరం మరణించింది. ఆవిడ జ్ఞాపకాలను జనార్ధనంతో పంచుకుంటూ ఆవిడ తన కాలేజీరోజుల్లో సాధించిన విజయాలు, ఫొటోలు న్యూస్‌పేపర్‌లో వచ్చాయనీ, వాటిని భద్రంగా కెమికల్స్‌లో తడిపి, ఆరబెట్టి దాచి, చూపించడం ఆయనకు భార్యమీదగల ప్రేమను తెలియచేసింది. నిజంగా ఈయన ఒక అద్భుతమైన వ్యక్తి అనుకున్నాడు జనార్ధనం.

డేవిడ్ రిటైర్డ్ ప్రొఫెసర్ కావడంవలన ఆనాటి టైప్‌రైటర్ నుంచి, ఈనాటి కంప్యూటర్ వరకూ ఉపయోగించడంలో అద్భుతమైన పరిజ్ఞానం వుంది. వాటికి తగిన జ్ఞాపకశక్తి ఏమాత్రమూ తగ్గకపోవడం విచిత్రం. ఈ ప్రొఫెసర్‌గార్ని కలుసుకోవడం, జనార్ధనానికి చాలా ఆనందం కలిగించింది. ఇద్దరూ ఎన్నో విషయాలు ఒకర్నొకరు అడిగి తెలుసుకున్నారు. ఆయన పరిచయం అంతులేని విజ్ఞానం పంచిపెట్టింది.

నందిత, ఫిలిప్స్‌ల మారేజ్ మొదట చర్చిలో, ఆ తర్వాత టెంపుల్లో జరగడం అందరికీ నచ్చింది. వచ్చినవారంతా జయచంద్రని మెచ్చుకున్నారు. నీలిమా, రాకేష్‌ల సందడి చెప్పక్కర్లేదు. పెళ్ళికి వచ్చిన వారిలో ముఖ్యమైన ఫ్రెండ్స్‌ని, సుచిత్ర బంధువుల్ని జనార్ధనానికి పరిచయం చేశాడు జయచంద్ర.

ఇదో ప్రపంచం. తూర్పు, పడమరల అద్భుత సంగమం. రకరకాల వ్యక్తులు, అనేక దేశాల ప్రజలు, వేషధారణ, పద్ధతులు, భాష చూస్తే జనార్ధనం, జానకిలకు ఎన్నో వింతలు తెలిసివచ్చాయి. జయచంద్ర చాలాకాలంగా స్థిరపడిన బిజినెస్ మాగ్నెట్ కావడంతో చాలామంది ఈ పెళ్ళికి వచ్చారు.

సుచిత్ర తన బంధువులకీ, స్నేహితులకీ జానకి గురించి మరీమరీ చెప్పడంవలన వాళ్ళతో ఫ్రీగా ఇంగ్లీష్‌లో మాట్లాడలేకపోవడం బాధగా తోచిందామెకు. దూరంగా నిలబడేది. అయినా వదిలిపెట్టకుండా జానకిని తీసుకువచ్చి ఇంగ్లీష్‌లో చెప్పింది సుచిత్ర. మొదట మొహమాటంగా అనిపించినా కొంతసేపటికి అలవాటుపడింది జానకి.

ఆరునెల్లు ఎలా గడిచిందో ఇట్టే గడిచిపోయింది. ఇక ఇండియా తిరిగి వెళ్ళాల్సి వచ్చేసరికి దిగులనిపించింది జనార్ధనం, జానకిలకి. అయినా తప్పదు. ఇక మళ్ళీ రాగల అవకాశం లేదు.

"గ్రాండ్‌ఫా మీరు కూడా ఈదేశం వచ్చేయండి" అన్నాడు రాకేష్.

"ఆయన తన పిల్లలను వదిలి ఇక్కడ ఎందుకు వుంటారు? మనం ఆయనకి బంధువులం మాత్రమే" అంది సుచిత్ర.

"కాదమ్మా! మీరు నా స్వంత కొడుకు, కోడలితో సమానమే! కాని పుట్టిపెరిగిన వాతావరణం నుంచి ఈ వయసులో ఇక్క




డకు వచ్చి ఖాళీగా కూర్చోగలమా? చేతి నిండా పనికావాలి. పని చేయాలంటే చదువుండాలి. నేను చదివింది ఇక్కడ ఎందుకూ కొరగాదు. ఇండియాలో జీవనోపాధికి చదువు తప్పితే, విజ్ఞానానికి అనుకోవడం చాలా తక్కువ. ఇక్కడ అంతులేని విజ్ఞానంతోపాటు, బతుకుతెరువూ వుంటుంది. ఇప్పుడు దీన్ని అందుకోవడం నాకు శక్యం కాదు. మా జీవితాలు అలా అక్కడ వెళ్ళ మారిపోవలసిందే! మీరు రాగలిగినంత కాలం మాకు ఆనందం పంచి ఇవ్వండి చాలు. మీకు మామీదగల ప్రేమాభిమానాలు, గౌరవం చాలు.

రాకేష్! మళ్లీ ఇండియా నువ్వు వచ్చేరోజు కోసం ఎదురు చూస్తుంటాం. మీ గ్రాండ్‌మా అప్పటికి ఇంగ్లీష్ నేర్చుకుంటుంది" అన్నాడు రాకేష్‌ని దగ్గరకు తీసుకుని.



"నేను కూడా తెలుగు ఇంకా బాగా నేర్చుకుంటాను తాతయ్యా! ఇక మీ ఇద్దరితో తెలుగే మాట్లాడతాను. ఈసారి ట్రిప్‌లో మనం చూసే ప్రదేశాలన్నీ తెలుగులో చెబుతాను నాన్నమ్మా" అన్నాడు రాకేష్. వాడికి కళ్లవెంబడి నీళ్లు వచ్చాయి.

బరువెక్కిన హృదయాలతో వీడ్కోలు తీసుకుని ఇండియాకి తిరుగుముఖం పట్టారు జనార్ధనం, జానకి.

మరో నాలుగు సంవత్సరాలు గడిచాయి. తీవ్రమైన పని ఒత్తిడిలో జయచంద్రకి ఇండియా వెళ్ళడం వీలుపడ లేదు. మనసులో వెళ్ళాలని ఆలోచనవున్నా సాధ్యం కావడంలేదు. నందిత, ఫిలిప్స్ వాషింగ్టన్‌లో వుంటున్నారు. రాకేష్ తండ్రికి చేదోడుగా వుంటానంటూ సి.ఏ. చేశాడు. నీలిమ ఎంబిఏ పూర్తిచేసి జయచంద్ర కంపెనీలోనే చేరింది. బైట కంపెనీకి పోలేదు.

జనార్ధనం దగ్గిర్నుంచి చాలాకాలానికి సుదీర్ఘమైన ఉత్తరం వచ్చింది.

"జయచంద్రా! మనం మాట్లాడుకుని చాలాకాలమైంది. నువ్వు ఎంత బిజీగా వుంటావో నాకు తెలుసు. అయినా జయదేవ్ నా వెంటపడి, వేధిస్తూంటే నీకు ఉత్తరం రాయడం మొదలుపెట్టాను. వేధింపు అని కాదు అమెరికా పంపడానికి తండ్రులు పడే తాపత్రయంలో భాగం. మిలీనియర్ వైన నీకు అల్లుడు కావడమే ఒక గొప్పవిషయంగా భావించిన జయదేవ్ ఆతృత కూడా అలాటిది మరి! నీలిమ శశికాంత్ గురించి ఏమనుకుంటోంది? ఇండియా వచ్చే ఆలోచన వుందా అని నన్ను అడుగుతున్నాడు. జవాబు నాకు తెల్సినా, నిన్ను అడిగిన తర్వాతనే జయదేవ్‌కి చెప్పడం న్యాయంకదాని నిన్ను అడుగుతానని చెప్పాను.

భార్గవ మళ్ళీ ఏం మాట్లాడలేదు కానీ, అతడి భార్య రత్న కూడా నాకొక ఉత్తరం రాసింది. బహుశా భార్గవకి తెలియకుండా అనుకుంటాను! మనం వాళ్ల ఇంటికి వెళ్ళినప్పుడు భార్గవ ప్రవర్తనకు తను చాలా సిగ్గుపడుతున్నాననీ, అభిరామ్, నీలిమను బెంగుళూర్‌లో చూసినప్పట్నించీ ఆమె పరిచయం కలిగిన తర్వాత నీలిమ మీద ఇంట్రెస్ట్

చూపిస్తున్నాడని, నీలిమతో కాంటాక్ట్‌లో వున్నాడనీ, జయచంద్రకి ఈ విషయం తెలియకపోయి వుండవచ్చుననీ నీలిమ తన కోడలైతే... అనే ధోరణిలో రాసింది. ఇదీ విషయం! వాళ్ళకి ఏం సమాధానం చెప్పమంటావో అడగటానికే ఈ ఉత్తరం. మీ పిన్ని అందర్నీ అడిగినట్టు రాయమంది. ఎప్పుడూ మిమ్మల్ని పలవరిస్తుంటుంది."

ఉత్తరం ఇంగ్లీష్‌లో రాయడం వలన సుచిత్రకి ఇచ్చాడు జయచంద్ర. ఆమె చదివి, "నీలిమకి ఇవ్వనా" అని అడిగింది.

"చూద్దాం! అలా వుంచు. మొదట మనం కూడా ఒక మాట అనుకుని నీలూకి చూపించటం మంచిది. జయదేవ్ మంచివాడే! అంత డబ్బు వుండి కూడా, ఒక్కకొడుకునీ అమెరికా పంపేయాలని తహతహలాడటం నాకు నచ్చలేదు. అంత డబ్బు యావ మంచిది కాదు. అయితే శశికాంత్ మరీ తండ్రిలా డబ్బు మనిషికాదు. ఒక్క నీలిమ అందాన్ని చూసి, చొరవగా మాట్లాడే స్వభావాన్ని చూసి, ఇష్టపడటం కాకుండా, నీలిమతో జీవితం ఎలా వుంటుంది అనేది ఇంకా తెలుసుకోవలసింది చాలా వుంది అతనికి.

ఇక అభిరామ్ కూడా తండ్రివంటి స్వభావికాడు. రత్న, అభిరామ్ నీలిమను కోరుకుంటున్నా, భార్గవ టెంపరమెంట్ వాళ్ళ ఆశను నీరుకారుస్తుంది. శశికాంత్ కంటే చాలా తక్కువ పరిచయం అభిరామ్‌కీ నీలిమకీ. కాబట్టి అతడి నిర్ణయం కూడా సమంజసంగా లేదు.

అంటే వారికి లభించిన టైమ్ చాలా తక్కువ. మరోసారి పరిశీలించాలంటే వాళ్లు ఇక్కడికైనా రావాలి. నీలూ ఇండియా అయినా వెళ్ళాలి. బహుశా నీలూ కూడా ఇదే సమాధానం చెబుతుంది. ఇండియాలో పెళ్ళికొడుకులంటే ఇలాగే వుంటుంది. వాళ్లు ఇలా చూసి, అలా పెళ్ళిచేసుకోవడం అలవాటు పడ్డవాళ్లు. కాని నీలిమ అలా కాదు. ఏం చేయాలి?" సాలోచనగా అన్నాడు జయచంద్ర.

"ఒక పని చేద్దాం జయా! మా నీలూ ఇంకా ఇప్పుడే పెళ్లి గురించి ఆలోచించడం లేదు. మీరు వేరే సంబంధం చూసుకోండని చెబుదాం" అంది సుచిత్ర.

"అవును, ఇదే బెటర్. బాబాయి కూడా 'నాకు తెలిసినా' అన్నాడంటే బాబాయికి కూడా వాళ్లిద్దరూ నచ్చలేదు. ఏ అభిప్రాయం లేని నీలూకి పనిగట్టుకుని చెప్పి ప్రయోజనం ఏముంది? నాలుగు రోజులు పోనీలే! చూద్దాం" అనుకున్నారు భార్యాభర్తలు.

ఓరోజు నీలూ పరిష్కారం చూపించింది. "డాడీ, నేను ఇండియా వెళ్లాలి ఓసారి" అంది లంచ్ చేస్తున్నప్పుడు

"ఏం పనీ?" అడిగాడు జయచంద్ర.

"మన కంపెనీ బ్రాంచ్ ఇండియాలో స్టార్ట్ చెయ్యాలి అనే ఆలోచన నా ఫ్రెండ్ లూసీకి వచ్చి అందుకు సిద్ధపడింది. ఇక్కడికి ఇండియన్స్‌ని తీసుకువచ్చి డాలర్స్‌లో పే చేయడంకన్నా ఇండియాలో తక్కువ పేమెంట్‌తో ఎక్కువ వర్క్ రాబట్టవచ్చని నాకు అయిడియా వచ్చింది. మేమిద్దరం డిస్కస్ చేసి ఈ నిర్ణయానికి వచ్చాం. ఇండియా వెళ్లి చూద్దామని అంటోంది లూసీ. అదీ ప్లాన్" చెప్పింది నీలిమ.

ఇదేదో బాగానే వుంది. బాబాయి నీలిమతో మాట్లాడి ఒక నిర్ణయానికి వస్తాడు అనుకుని "సరేనమ్మా! బాబాయితో చెబుతాను డేట్ ఫిక్స్ చేశావా?" అన్నాడు.

"అనుకున్నాక ఆలస్యం ఎందుకు? నెక్స్ట్ వీక్ బయలుదేరుతామని చెప్పు డాడ్" అంది నీలిమ.

"బాబాయ్! నీలిమ ఫలానా పనిమీద ఇండియా వస్తుంది. నువ్వు నేరుగా నీలూతోనే మాట్లాడు" అంటూ నీలిమ వెళ్లే డేట్ చెప్పాడు.

"అలాగా! చాలా సంతోషంరా జయా!

నీలిమ కోసం ఎదురుచూస్తాం. అమ్మాయి లిద్దరికీ అన్ని ఏర్పాట్లూ చేస్తాను" అన్నాడు జనార్ధనం.

"జానకీ! నీలిమ తన ఫ్రెండ్ లూసీ అనే అమ్మాయితో మన ఇంటికి వస్తుందట. మరి నీకు మడీ ఆచారానికి పనికివ స్తుందా? ఇంకెక్కడికైనా పంపేయమం టావా" అడిగాడు భార్యని.

"చాల్లెండి. మనం అమెరికాలో ఫిలిప్స్ ఇంటికెళ్లి భోజనం చేయగాలేంది, ఈ లూసీ వస్తే మాత్రం అభ్యంతరం ఏముంటుందీ? నాకు ఒక్కటే దిగులు. ఇంగ్లిష్ రాదుకదాని" అంది జానకి.

"రాకపోవడమే మంచిది. లేడీస్ డామినే షన్ పెరిగిపోతుంది. నేనా ఒక్కణ్ణి అయి పోతాను" అన్నాడు జనార్ధనం.

"ఆ మరే! ఆ పిల్ల మనతో కబుర్లు చెప్ప డానికా వస్తుంది? కంపెనీ పనిమీద అంటున్నారుకదా? బెంగుళూరులోనే వుంటారు ఎక్కువ రోజులు" అంది జానకి.

హైదరాబాద్‌లో ఒక వారం వుండి బెంగుళూరు వెళ్లారు లూసీ, నీలిమలు. లూసీకి జనార్ధనం ఇల్లు చాలా నచ్చింది. గ్రీనరీ అంటే ఆ అమ్మాయికి చాలా ఇష్టం. జనార్ధనం, జానకిలు కూడా నచ్చారు. నీలిమ, జానకి చెప్పిన మాటలను లూసీకి ఇంగ్లిష్‌లో చెప్పేది. 'అయినా ఫర్వాలేదు. నాకు మీ కంపెనీ చాలా బాగుంది' అనేది.

"వద్దు! ఒకేసారి రెండు చోట్ల పెడితే మంచిదికాదు. అదీగాక తట్టుకోవడం కష్టం! బెంగుళూర్ ఫార్‌బెటర్" అని నచ్చచెప్పింది.

"అయితే మనం మూడు నెలలపాటు ఇక్కడే వుండి కంపెనీ వర్క్ పూర్తిచేసి వెడదాం" అంది లూసీ.

"ఆ ఇక్కడ మాకు తెలిసిన వాళ్లు వున్నారు పిలుస్తానుండు" అంటూ అభిరా మ్‌కీ, శశికాంత్‌కీ ఫోన్ చేసింది. వాళ్లు అమాంతం పరిగెత్తుకుని వచ్చేశారు.

"హాయ్ నీలిమా! మమ్మల్ని మరచిపో యారనుకున్నాం. నాలుగేళ్ల తర్వాత గుర్తు వచ్చామా? ఎన్ని ఇ-మెయిల్స్ పంపించాం. ఒక్కదానికీ రిప్లైలేదు" అన్నారు అలిగిన ట్టుగా.

"ఓ, సారీ ఫ్రెండ్స్. నాకు అస్సలు తీరిక లేకపోయింది. మిమ్మల్ని మరచిపోలేదు. మరిచిపోతే ఇప్పుడు మాత్రం పిలిచే దాన్నా? బైదిబై మై కంపెనీ పార్టనర్ మిస్ లూసీ! 'లూసీ! శశికాంత్, అభిరామ్" అంటూ ఒకరికొకర్ని పరిచయం చేసింది.

"గ్లాడ్‌టు మీట్‌యూ" అంటూ లూసీ వారితో చేతులు కలిపింది. అంతే అభిరామ్ లూసీ వల్లో పడిపోయాడు. లూసీ పైకి కనిపించినంత అమాయకురాలు కాదు. ఇద్దర్నీ ఒక్కచూపుతో అంచనావేసింది. శశి కాంత్‌కి స్వతహాగా ఎదిగే తెలివితేటలు లేవు. ఎవరో వెనకాల వుండాలి.

అభిరామ్ చాలా త్వరగా ఆకర్షణలో పడి పోతాడు. అంత త్వరగానూ వదిలించేసు కుంటాడు. ప్రస్తుతానికి వీళ్లిద్దరూ మాకు బాగా ఉపయోగపడతారు. పూర్తికాలం ఉప యోగపడాలంటే ఇద్దరికీ మన కంపెనీలో ఉద్యోగం ఇచ్చేస్తే అంతే ఇక. పొమ్మన్నా పోరు. ఇంకా కొందర్ని అపాయింట్ చేసు కోవాలి. మెరిట్‌లో వచ్చిన కాండిడేట్స్ కావాలి. ఎక్స్‌పీరియన్స్ వున్న వారు కావాలి. కంపెనీ వర్క్ స్టార్ట్ చేయడానికి ప్రస్తుతానికి అయిదుగురు చాలు. ఆల్రెడీ మేం నలుగురం వున్నాం కాబట్టి అయిదో వాణ్ణి వెదకాలి అని నిశ్చయించుకున్నారు లూసీ, నీలిమలు.

జనార్ధనంతో చెప్పింది నీలిమ. జయదేవ్ అంకుల్ సన్‌ని, భార్గవ అంకుల్ సన్‌ని మా కంపెనీలోకి తీసుకున్నాం. ఇంకా ఒకరు కావాలి. మీకు తెలిసిన వారు న్నారా? లేక యాడ్ ఇద్దామా అని అడి గింది.

"అవసరంలేదు నీలిమా! యాడ్ చూసి చాలామంది వస్తారు. అందరిలో ఒకర్ని

సెలక్ట్ చేయడం చాలా కష్టం. నాకు తెలిసిన అబ్బాయి కార్తీక్ వున్నాడు. అతడ్ని పిలిపిస్తాను. చూడు, పనికొస్తే తీసుకో లేకుంటే అప్పుడే యాడ్ ఇద్దాం" అన్నాడు జనార్ధనం.

"సరే! కబురు పెట్టండి గ్రాండ్‌పా" అంది నీలిమ.

ఇండియా గురించి లూసీకి తెలియదు కనుక పూర్తిగా నీలిమకి వదిలేసింది లూసీ.

మరో నాలుగు రోజులకి కార్తీక్ వచ్చాడు. జనార్ధనం లూసీని, నీలిమనీ "మీ ఇష్టం వచ్చినట్టు ఇంటర్వ్యూ చేసుకోండి. నన్నడిగితే మీ ఫీల్డ్‌లో నాకు అనుభవం లేదుకానీ మీ నలుగుర్నీ మించినవాడు కార్తీక్. ఇది నా నమ్మకం. కాకపోతే అతడి వెనకాల ఎవరూ లేరు. చాలా పూర్ ఫ్యామ్లీ నుంచి వచ్చాడు. చాలా బుద్ధిమంతుడు" అన్నాడు జనార్ధనం.

రెండు గంటలపాటు లూసీ, నీలిమా, శశికాంత్, అభిరామ్ ఎన్ని తికమక క్వశ్చన్స్ వేసినా తడుముకోకుండా జవాబు చెప్పడంతో జనార్ధనం నమ్మకం ఏమాత్రమూ అసత్యం కాదని తెలుసుకున్నారు.

"గ్రాండ్‌పా! యు ఆర్ వెరీ గ్రేట్. మా కంపెనీకి అసలైన ఉద్యోగి ఈ కార్తీక్! థాంక్యూ గ్రాండ్‌పా! థాంక్యూ వెరీమచ్. కంగ్రాచ్యులేషన్స్ కార్తీక్. నీకే కంపెనీ బాధ్యతలు అప్పగిస్తున్నాం. మా అందరికీ సీనియర్‌వి నువ్వు. ఒక్క విషయం మనం అయిదుగురం ఈ కంపెనీని టాప్ పొజిషన్‌కి తీసుకుని రావాలి. మీరు ఎంప్లాయీస్‌గా కాక పార్ట్‌నర్స్‌గా భావించి తేడా లేకుండా మాతో ఒక్కటిగా వుండాలి. అప్పుడే మన కంపెనీ టాప్‌లో వుంటుంది" అంటూ నీలిమ జనార్ధనంతోనూ, కార్తీక్‌తోనూ చెప్పింది.

ఇకనేం రెండు రకాలుగా కాంపిటీషన్ ప్రారంభమైంది అనుకున్నాడు జనార్ధనం.




ఎప్పటికప్పుడు తండ్రితో చెప్పేది నీలిమ. అయితే జయచంద్ర అభిరామ్‌కీ, శశికాంత్‌కీ కంపెనీలో ఉద్యోగాలు ఇవ్వడం అంతగా నచ్చలేదు. నీలిమతో ఏమీ అనలేదు కానీ జనార్ధనంతో అన్నాడు.

"బాబాయ్! ఇలా ఉద్యోగాలిచ్చి వాళ్లలో లేనిపోని ఆశలు పెట్టడం భావ్యం కాదేమో! నీలిమ ఇటువంటి పని చేస్తుంది అనుకో లేదు" అన్నాడు.

"అదేమీకాదు జయా! నీలిమా, లూసీ చాలా తెలివైన పనే చేశారు. ఉద్యోగంవేరు. పెళ్లి సంబంధం కుదుర్చుకోవడం వేరూను. పైగా ముందుగా మనం ఈ విషయం అమ్మాయికి చెప్పనేలేదు. డోంట్ వర్రీ" అన్నాడు జనార్ధనం.

"వర్రీ అంటూ ఏమీలేదు. జయదేవ్ లేనిపోని ఊహాగానాలు చేస్తాడని. చూడు ఆ సమస్య ఏదో నువ్వే పరిష్కరించు" అన్నాడు జయచంద్ర.

"అమ్మాయి, అబ్బాయి ఒకచోట వుంటున్నారు టైమ్ వచ్చినప్పుడు వాళ్లే చెబుతారని జయదేవ్‌తో చెబుతాను సరా? " అన్నాడు జనార్ధనం.

మూడు నెలలు గడిచిపోయాయి. లూసీ నీలిమా ఇక అమెరికా వెళ్లాలనుకుంటున్నారు. "మేమిద్దరం సంవత్సరానికోసారి వస్తాం. మీరు కంపెనీ మంచి చెడ్డలు జాగ్రత్తగా చూసుకోండి" అన్నారు శశికాంత్, అభిరామ్‌లతో! కంపెనీలో చేరినప్పట్నించీ అభిరామ్, లూసీ చేరిక అయినట్టు గ్రహించింది నీలిమ. అభిరామ్ ఆలోచన ఏమిటో తెలియదుకానీ లూసీకి అతను జస్ట్ బాయ్ ఫ్రెండ్ మాత్రమే అనుకుంది. ఇద్దరూ కంపెనీ పార్ట్‌నర్స్ తప్పితే వ్యక్తిగత విషయాలు చెప్పుకునే అలవాటులేదు నీలిమ, లూసీలకు.

అమెరికా వెళ్లేముందు ఇద్దరూ హైదరాబాద్ వచ్చారు. జనార్ధనం శశికాంత్ విషయంలో నీలిమ అభిప్రాయం తెలుసుకోవా లనుకున్నాడు.

# ఏరిన ముత్యాలు

* నెమ్మదిగా పెరిగే మొక్కవంటిది స్నేహం.

  - జార్జి వాషింగ్‌టన్

* ఆలోచించకుండా మాట్లాడడం అనేది గురి చూడకుండా తుపాకీ కాల్చడం వంటిది.

  - చర్చిల్

* నీ రహస్యాన్ని ఎవరికో చెప్పి, ఆ విషయాన్ని ఇంకెవ్వరికీ చెప్పద్దు అనడంకన్నా, ఆ రహస్యాన్ని మనలోనే దాచుకోవడం మంచిది.

  - ఎర్నెస్ట్ మిల్లర్ హెమింగ్వే

* జీవితం ఒక బ్యాంక్ వంటిది. నువ్వు దానిలో ఏదైతే వెయ్యగలుగుతావో దానినే తీసుకోగలుగుతావు.

  - సోమర్‌సెట్ మామ్

* ఈరోజుగురించి మనం జాగ్రత్త తీసుకుంటే రేపటి రోజు గురించి దైవం జాగ్రత్త తీసుకుంటాడు.

  - సిసిరో

* ఇతరులకు జరిగేవన్నీ మనకు తమాషాగా కనిపిస్తాయి. మన విషయంలో జరిగేవి మాత్రం తమాషాలు కావు.

  - బాబ్‌హోప్

* నీ చెవులు అప్పగించి అందరూ చెప్పేది విను. అయితే కొద్దిమందికి మాత్రమే నీ గొంతు వినిపించు.

  - షేక్స్‌పియర్

* ఏది మంచిదయినదీ మనకు తెలుసు, కానీ ఏది చెడో అదే చేస్తాము.

  - సోక్రటీస్

* నిజాయితీని మించిన గొప్ప ఆస్తి లేదు.

  షేక్స్‌పియర్

* నీతి, నియమాల ముందు రాజులు, వారి కత్తులూ ఎందుకూ పనికిరావు.

  - మహాత్మాగాంధీ

* అన్యాయానికి తల వంచడం, తప్పును సమర్థించడం.... ఘోరమైన పొరపాట్లు చెయ్యడం వంటిది.

  - సుభాష్‌చంద్రబోస్

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

"నీలిమా! శశి వర్క్ ఎలా వుంది? కంపెనీకి పనికివస్తాడా? " అంటూ అడిగాడు.

"ఫర్వాలేదు గ్రాండ్‌పా! ఆల్రెడీ ఎక్స్‌పీరియన్స్ వుంది కాబట్టి. బాగానే చేస్తున్నాడు. శశికాంత్ కంటే బెటర్ అభిరామ్. అభిరామ్‌కంటే ఫార్ బెటర్ కార్తీక్ అని నీకు వేరే చెప్పాల్సిన అవసరంలేదు" అంది.

"నీలిమా! నాలుగేళ్ల క్రితం నువ్వు డాడ్‌తో వచ్చినప్పుడు జయదేవ్ అంకుల్ అంటే శశికాంత్ డాడ్ నిన్ను వాళ్ల కోడలిగా చేసుకోవాలని అనుకున్నాడు. మీ డాడ్ కూడా ఇండియన్ అబ్బాయిని ఇష్టపడతావో, అక్కడ అమెరికాలో అబ్బాయిని లైక్ చేస్తావో అని చిన్న టెస్ట్ కోసం అభిరామ్, శశికాంత్‌లను నీకు పరిచయం చేయాలని భావించాడు. జయదేవ్ మీనాన్నతో సరదాగా మాట్లాడేడు. తన సంపాదన, స్టేటస్ మీకు చూపించాడు. మేము బెంగుళూర్‌లో అభిరామ్ ఫాదర్ భార్గవని కలిసినప్పుడు అతని ట్రీట్‌మెంట్ వేరుగా వుంది. అభిరామ్‌ని కానీ భార్య రత్ననుకానీ మాతో ఎక్కువగా మాట్లాడనీయలేదు. నీకు అర్థం అయేలా చెప్పాలంటే స్టయిల్ చూపించాడు. కర్టెసీ లేకుండా మాట్లాడాడు. మీ నాన్నకి అతడి పద్ధతి నచ్చలేదు. మీ నాన్నకే కాదు, నాక్కూడా నచ్చలేదు. వాళ్లిద్దరూ మనకు బంధువులు. అంటే రెలెటివ్స్. భార్గవ ఇంటికి ఎందుకు వెళ్లామా అనుకున్నాం. ఈ కారణంగా నీకు అభిరామ్ గురించి పరిచయం చేయలేదు. అసలు ఆ అవకాశమూ భార్గవ ఇవ్వలేదు. అయితే నువ్వు, శశి బెంగుళూరు వెళ్లినప్పుడు అనుకోకుండా అభిరామ్ మీరూ కలుసుకున్నారు. అప్పుడు నువ్వు ఇండియాలో వున్న టైం చాలా తక్కువ కాబట్టి అభిరామ్‌కీ నీకూ అంతగా ఫ్రెండ్‌షిప్ ఏర్పడలేదు.

మీరు అమెరికా వెళ్లిపోయారు. రెండు సంవత్సరాలుగా శశీవాళ్ల ఫాదర్, పెళ్లి విషయంలో నీ అభిప్రాయం అడుగుతూండేవాడు. మీ నాన్న నేనూ టైమ్ పడుతుందని వెయిట్ చేయాలనీ చెబుతూ వచ్చాం. నువ్వు వచ్చేముందు మళ్లీ మీనాన్నకి ఉత్తరం రాయమన్నాడు జయదేవ్ అంకుల్! రాశాను. నువ్వు వస్తావు అడిగి తెలుసుకోమన్నాడు మీ డాడ్. ఇప్పుడు నువ్వు శశికాంత్‌కి ఉద్యోగం ఇచ్చి మరింతగా అతడి గురించి తెలుసుకున్నావ్ కదా? ఇప్పుడు చెప్పమ్మా శశి, భార్గవ విషయంలో నీ ఆలోచన ఏమిటో" అన్నాడు జనార్ధనం.

"గ్రాండ్‌ఫా! డాడ్ మనసులో ఆలోచన నాకు ఇప్పుడు మీరు చెప్పేదాకా తెలియదు. మనిషిని చూడగానే పరిచయం ఏర్పడగానే పెళ్లి ఆలోచనరాదు. ఇద్దరమూ ఒకేచోట కలిసి వుండాలి. ఒకరికొకరం తెలుసుకోవాలి. మంచి చెడ్డలు మాట్లాడుకోవాలి. ప్రేమ పుట్టాలి. ఆకర్షణా. ఏర్పడాలి. ఇదంతా ఒకరోజు, నెలా, సంవత్సరంలో సాధ్యంకాదు. నేను ఇండియాలో అంత కాలం వుండను. సో గ్రాండ్‌పా నేను ఇండియన్ అబ్బాయిల్ని మారేజ్ చేసుకునే ప్రసక్తిలేదు. ఇక ఇక్కడి అబ్బాయిలు కూడా అమెరికా రావడంకోసం గ్రీన్‌కార్డ్ ఆశించి నన్ను పెళ్లి చేసుకోడానికి వెంటనే సిద్ధపడచ్చు. ఈ పద్ధతి నాకూ ఆ అబ్బాయికీ కూడా మంచిదికాదు" అంది స్పష్టంగా నీలిమ.

"అయితే నందితలా అమెరికన్ అబ్బాయినే చేసుకుంటావా? నువ్వయినా మన దేశం అబ్బాయిని చేసుకుంటావని ఆశపడ్డానే తల్లీ" అంది జానకి.

"ఏం గ్రాండ్‌మా? నేను ఇండియన్ అబ్బాయినే ఎందుకు పెళ్లిచేసుకోవాలి? ఏ దేశమైనా నాకు ఒకటే. రష్యా, సౌతాఫ్రికా, చైనా, జపాన్ నలుపు, తెలుపు, పసుపు, ఎరుపూ" అంది సరదాగా నీలిమ.

"అలా అని కాదమ్మా! నిజమే అందరూ





ఒకటే! కొద్దికాలం బాగానే వుంటుంది. ఏమైనా భేదాభిప్రాయాలు వస్తే నువ్విలా, నువ్వలా అనే తేడాలు రావచ్చు. పిల్లల సమస్య, ఆస్తి సమస్య, ముఖ్యంగా ఆహారపు అలవాట్లూ అవీను. అంతకుమించి మరో కారణం లేదమ్మా! నీకు నచ్చితేనే చేసుకో. ఎవరికోసమో అని కాదు. నాకు తెలిసిన అబ్బాయి, అమ్మాయి వేరువేరు దేశాల, జాతివారు ప్రేమించి పెళ్లిచేసుకున్నారు. అతను మనదేశం. అమ్మాయి ఏదో యూరప్ కంట్రీ. అతను అవిటివాడు. అయినా ప్రేమకు అదేమీ అడ్డుకాదు అనుకున్న అమ్మాయి తీరా పెళ్లయిన ఎనిమిది సంవత్సరాల తర్వాత ఒక కొడుకు వుండీ విడిపోయింది. అదమ్మా! మాభయం" అంది జానకి.

"పిచ్చి బామ్మా! నా విషయంలో అలాంటి భయం అవసరంలేదు. నల్లజాతి వాడు అంటే నీగ్రో. అయినా చింపాంజీలాంటి వాడు అయినా ప్రేమ కలిగి పెళ్లంటూ చేసుకుంటే లైఫ్‌లాంగ్ అతడ్ని నేను విడిచి పెట్టను. వాడ్ని విడిచిపెట్టి పోలేను. గ్యారంటీ సరా? " అంది జానకి భుజంమీద వాలి చిన్నపిల్లలా రెండు చేతులూ చుట్టేసి ఊగుతూ నీలిమ.

"అమ్మా నీలూ తల్లీ... నువ్వన్నట్టు ఎరుపు, ఆకుపచ్చ రంగు ఏదైనా ఆ నీగ్రో వాణ్ణి మాత్రం చేసుకోవద్దు తల్లీ! చూళ్ళేక మేం ఆత్మహత్య చేసుకోవాలి" అంది జానకి హాస్యంగా.

"అదేం పాపం? వాళ్ళూ మనుషులే బామ్మా! వాళ్ళూ ప్రేమించగలరు. బాగా డబ్బు సంపాదిస్తారు. ఎవర్నైనా చితకబాదేయగలరు. మంచి బలంగా, ఆరోగ్యంగా వుంటారు" అంటూ నవ్వేసింది నీలిమ.

తనకూ, జయచంద్రకూ మనసులో వున్నది నీలిమ నిర్భయంగా, నిర్మొహమాటంగా పైకి చెప్పేసింది. ఇంతవరకూ ఈ పిల్ల దృష్టిలో ఎవరూ లేరు అని కూడా రూఢీ అయిపోయింది అనుకున్నాడు జనార్ధనం.

లూసీ ఎదురుగా జరిగిన ఈ సంభాషణ అర్థంకాక అందరి మొహాలవంకా మార్చి మార్చి చూస్తూంది.

"ఎనీ ప్రాబ్లమ్? " అంటూ నీలిమను అడిగింది తర్వాత "యా. మై మారేజ్ ప్రపోజల్..." అంటూ వివరించింది. నేను మాత్రం ఇప్పుడే పెళ్ళి గురించి ఆలోచించడంలేదు అని చెప్పింది. కానీ అభిరామ్, శశికాంత్‌ల గురించి చెప్పలేదు.

"నీలూ! అభిరామ్ నన్ను లైక్ చేస్తున్నానంటూ వెంటపడుతున్నాడు. అతడి ఆలోచన అమెరికా రావాలని. అందుకోసం పెళ్లి చేసుకుంటాననీ అన్నాడు. మీ ఇండియన్స్ అంత తొందరగా నిర్ణయానికి రావడం నాకు చాలా వింతగా వుంది. జస్ట్ వన్ మంత్ పరిచయానికే మ్యారేజ్ ప్రపోజల్ తీసుకువస్తారా? " అంది.

"ఇంకా నెలరోజులంటే నయమే! ఒక్క గంటలోనే మా దేశంలో పెళ్ళిళ్లు కుదిరిపోతాయి. మంచో, చెడో; కష్టమో, సుఖమో ఒకసారి మెళ్లో తాళి కట్టాడా అతణ్ణి జీవితాంతం భరిస్తుంది మా దేశంలో అమ్మాయి. ఇప్పుడిప్పుడే రివల్యూషన్ వచ్చింది, కొంత మా దేశాలనుంచి దిగుమతి అయింది. అయితే పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్లు అన్నీ సక్సెస్ కాకపోవచ్చు. పిల్లలు ఇష్టపడి చేసుకున్నా ఫెయిల్యూర్ కావచ్చు. మ్యారేజస్ ఆల్సో లాటరీ... యూనో? " అంది నీలిమ భారతీయ సంస్కృతిని వివరించి.

"యా! దట్స్ ట్రూ. సమ్‌టైమ్స్ వుయ్ ఆర్ ఆల్సో ఫేసింగ్ దిస్ టైప్ ఆఫ్ ప్రాబ్లమ్స్ ఇన్ అవర్ కంట్రీ" అంది లూసీ.

"మరి నువ్వొక విషయం చెప్పలేదు నీలూ..."అన్నాడు జనార్ధనం.

"ఏమిటది గ్రాండ్‌పా? " అడిగింది నీలిమ.

"అదే! కార్తీక్ గురించి నీకు తెలియదా? అతని గురించి ఉత్తరంలో రాసానే. మీరు చదవలేదా?" అడిగాడు జనార్ధనం.

"నాకు తెలియదు గ్రాండ్‌ఫా. ఏం రాశారు?" అడిగింది నీలిమ.

"కార్తీక్ తాతయ్యా, అమ్మమ్మా చనిపోయారు. నాలుగు సంవత్సరాల క్రితం మీరంతా ఇండియా వచ్చినప్పుడు మేము మా ఊర్లో వాళ్ళని కలిశాం. కార్తీక్ అప్పటికే చదువు పూర్తిచేశాడు. నేను కార్తీక్‌ని అమెరికా తీసుకువెడతాను. నా కంపెనీలో ఉద్యోగం ఇస్తాను అన్నాడు మీ నాన్న. కార్తీక్ తాతా, అమ్మమ్మ ఒంటరివారైపోతారని నేను అడ్డుపడ్డాను. ఆ తర్వాత మీ నాన్న వాడి విషయం మరచిపోయివుంటాడు" అన్నాడు జనార్ధనం.

"కార్తీక్ మా కంపెనీలో ఇక్కడ, ఈ దేశంలో వున్నప్పుడే ఈ కంపెనీ నిలబడుతుంది. లేకుంటే లేదు" అంది నీలిమ.

"సరే! ఈ విషయమే మీ నాన్నకి చెప్పు" అన్నాడు జనార్ధనం.

యధాప్రకారం ఏవేవో చేసిచ్చింది జానకి. "వెయిట్ చాలా వుంటుంది గ్రాండ్‌మా! ఎక్సెస్ ఛార్జ్ కట్టాల్సిందే..." అంటూ కాదన్లేక అన్నీ సర్దుకుంది నీలిమ.

లూసీ, నీలిమా ఆరోజే బయలుదేరి వెళ్ళిపోయారు. "ఇక దీనికి పెళ్ళి ఎప్పుడు అవుతుందో. ఏమాత్రమూ ఇప్పట్లో ఆశలేదు" అంది జానకి నిరాశగా!

"ఏం, మళ్ళీ నీలూ పెళ్ళి వంకన అమెరికా ప్రయాణం అవుదామనా నీ ప్లాన్?" అన్నాడు జనార్ధనం.

"ఆ మరే! నా ఒక్కదానికే కాదు, మీకూ వెళ్ళాలనే వుంది. పైకి చెప్పరుగాని! అమాయకురాల్ని బైటపడిపోతుంటాను" అంది జానకి తనపైతనే జాలిపడుతూ.

"నువ్వా అమాయకురాలివి? నీ కోరికను ఏదోరకంగా గడుసుగా నీలిమ పెళ్ళితో ముడిపెట్టావు" అన్నాడు జనార్ధనం.

"ఆ... కారణం దొరికితే చాలు. వాదన చేస్తారు. పనా? పాటా?" అంది జానకి.

"నీతో ఇలా వాదన వేసుకుంటేనే కదా టైమ్ గడిచేది? నీ దారిన నువ్వు, నా దారిన నేనూ తలో మూలా కూర్చుంటే ఏం కాలక్షేపం అవుతుంది?" అన్నాడు జనార్ధనం.

"అవును జీవితయానంలో ఎన్నో మజిలీలు. పెళ్ళి, పిల్లలు, బాధ్యతలూ తీరి ఇక విశ్రాంతిగా వున్నప్పుడు, ఈ సాహచర్యమే కదూ, సంతృప్తినిచ్చేది. ఎంత దుర్మార్గులైనా ఒక వయసులో మనసు మార్చుకుని, చేసిన పొరపాట్లకు పశ్చాత్తాపపడి, నా కోసం నువ్వు, నీ కోసం నేనూ అన్నట్టుగా జీవించడమే దాంపత్య జీవితానికి శోభను చేకూరుస్తుంది. వెనకా ముందూ ఎవరో ఒకరు పోవలసిందే! అంతదాకా భార్యాభర్తలిద్దరూ కలిసి వుండటం, ఆనందంగా జీవించడం అదో గొప్ప చివరిమజిలీయే"



నీలిమ ఇంటికి వచ్చాక ఇండియాలో విశేషాలన్నీ చెప్పింది. కార్తీక్‌ని ప్రత్యేకించి మెచ్చుకుంది. అభిరామ్, శశికాంత్‌లు వర్క్ విషయంలో ఫర్వాలేదు. లూసీని అభిరామ్ కాకా పట్టడం గురించి చెప్పినప్పుడు జయచంద్ర ఒకటే నవ్వాడు. "అయితే లూసీమీద చాలా హోప్స్ వున్నాయన్నమాట అతగాడికి!" అన్నాడు. శశికాంత్ వున్నదాంతో సరిపుచ్చుకున్నాడో మరో ప్రయత్నం చేస్తాడో తెలియదు.

"డాడ్, నన్ను గ్రాండ్‌పా అడిగినప్పుడు కానీ, మీరు నా కోసం వాళ్ళ ఇంటికి వెళ్ళారని తెలీదు. ఎలా అనుకున్నారు డాడ్ నేను వారిలో ఒకర్ని సెలక్ట్ చేసుకుంటానని? గ్రాండ్‌మా అడిగిందికదా, ఏం నీలూ ఇండియన్ అబ్బాయిని ఎందుకు పెళ్ళి చేసుకోవూ అని! అప్పుడు నేను చెప్పానూ... ఇండియన్ అబ్బాయి అని కాదు, ఒక్కరోజు, ఒక్క నెలలో నిర్ణయం తీసుకునే విషయం





కాదిది. కొన్ని సంవత్సరాలు మేము ఒక చోట వుండి మాట్లాడుకోవాలి. కలుసుకుంటూ వుండాలి. అతనిమీద ప్రేమ కలగాలి. అప్పుడు పెళ్లి విషయం ఆలోచిస్తానూ" అన్నాను.

"సరే, అయితే నీగ్రో అబ్బాయిని మాత్రం పెళ్ళిచేసుకోవద్దు. చేసుకుంటే నేను సూసైడ్ చేసుకుంటానంది"

సుచిత్ర కూడా నవ్వింది. జానకి, నీలిమల సంభాషణను 'అవును. మా అమ్మా నాన్నలు జీవించివుంటే నేను సుచిత్రను పెళ్ళిచేసుకుంటానని చెప్పినప్పుడు, వాళ్ళూ ఇలాగే మనవాళ్ళ అమ్మాయిని చేసుకోకపోతే నూతిలో దూకుతాను అని వుండేదా?' అనుకుని చిన్నగా తనలోతనే నవ్వుకున్నాడు జయచంద్ర.

"డాడ్! ఇంతకీ మీలో నేను ఇండియన్ అబ్బాయిని పెళ్ళి చేసుకోవాలనే కోరిక వుండివుండాలి. అందుకే ముందుగా నాతో అయినా చెప్పకుండా శశి, అభీ వాళ్ళ ఇళ్లకు వెళ్ళారు. అవునా? " అంది.

"అలా అని కాదు. నీకు ఏ సమయానికి ఏంకావాలో ఇప్పటికే మీ మామ్ అమర్చిపెట్టడం అలవాటుకదా? ఇక లైఫ్ పార్టనర్ విషయంలో కూడా మేము ప్రయత్నం చేయాలనుకుని ఫెయిల్ అయ్యాం. సారీ డియర్" అన్నాడు జయచంద్ర.

"దిసీజ్ టూమచ్? మామ్‌కి అలా చేయడం ఇష్టం కదాని, ఫుడ్ విషయంలోనో, మరో విషయంలోనో ఆమె నచ్చినట్టే చేశాను. బట్ డాడ్... నా భర్తను ఎంచుకొనే అవకాశం మాత్రం నాదే! అక్క విషయంలో కలగచేసుకోని మీరు, నా విషయంలో ఇలా ఎందుకు అనుకున్నారు. అంటే డాడ్... మీరు మనసులో ఇండియన్, మీ బంధువు అయిన అబ్బాయినే అల్లుడిగా చేసుకోవాలని వుందన్నమాట" అంది నీలిమ.

"అవునేమో నీలూ! మనం ఇండియా వెడుతున్నాం. జనార్ధనం బాబాయి, జానకి పిన్నిల బంధుత్వం వదులుకోలేదు. బంధువుల్నీ వీలైనప్పుడు కలుస్తున్నాం. మనం ఏదీ దూరం చేసుకోనప్పుడు, అల్లుడిగా ఇండియన్‌ని ఎందుకు సెలక్ట్ చేయకూడదు? అనుకున్నాం" అన్నాడు జయచంద్ర.

"కూడదు అనలేదు డాడ్. అవకాశం లేదు అంటున్నాను. మీరు ఇక్కడేకదా మామ్‌ని కలిసి, పరిచయం అయిన అయిదు సంవత్సరాల తర్వాతనే పెళ్ళిచేసుకున్నారు? మా జనరేషన్ వచ్చేసరికి మీలో మార్పు వచ్చిందా? మరో విషయం డాడ్. నాకు ఇండియన్స్, మన బంధువులు అంటే ద్వేషం ఏమీలేదు. ఆ సిస్టమ్ నాకు నచ్చదు అంతే! ఇలా ఎప్పుడో ఒకసారి వెళ్ళి ఎవర్నో చూసి పెళ్ళి కుదుర్చుకోవడం నచ్చదు. మనం ఫేస్ టు ఫేస్ ఈ విషయాన్ని డిస్కస్ చేయకపోవడంవలన వచ్చింది ఇబ్బంది" అంటూ చెప్పింది నీలిమ.

"సరే! పోనీయ్ నీలూ! నీ ఇష్టం వచ్చిన అబ్బాయిని సెలక్ట్ చేసుకో. జరిగిన విషయం నీకేమైనా బాధ కలిగిస్తే ఎక్స్ట్రీమ్లీ సారీ!" అంది సుచిత్ర నీలూని అనునయిస్తూ.

జయచంద్ర కూడా సారీ చెప్పగానే కరిగిపోయింది నీలిమ.

"డాడ్ ఈరోజు నా వలన నీ మనసుకి గాయం అయిందికదూ? నేను తప్పు మాట్లాడాను కదూ? " అంటూ పసిపాపలా తండ్రి ఒడిలో ఒదిగిపోయింది.

★ ★ ★

జనార్ధనం ఎలా వున్నాడో అని ఓరోజు ఫోన్ చేశాడు జయచంద్ర.

"బాబాయ్! పిన్ని, నువ్వు బాగున్నారు కదా? కార్తీక్ గురించి నువ్వు వేరే రాసిన ఉత్తరం చాలా ఆలస్యంగా చూశాను. ఆరోజు పరధ్యానంగా సగం చదివి, ఏదో పనిలో పడిపోయాను. ఇప్పుడు నీలూ వచ్చి

చెప్పేవరకూ చూడలేదు. సూర్యంగారు, పార్వతమ్మ చివరికి కార్తీక్ చేతుల్లోనే ప్రాణాలు వదిలినట్టు తెలిసి సంతోషించాను. వారికి అంతకంటే ఏంకావాలి? లూసీ కంపెనీలోనే కార్తీక్ వర్క్ చేస్తున్నాడనీ, నువ్వే రికమెండ్ చేశావనీ, నీలిమ చెప్పినప్పుడు చాలా ఆనందం కలిగింది బాబాయ్! కార్తీక్ తెలివైనవాడనీ, కంపెనీని చక్కగా హేండిల్ చేయగలుగుతున్నాడనీ, ఒక్కమాటలో చెప్పాలంటే అతను కనుక మా కంపెనీకి రాకపోతే, అక్కడ కంపెనీయే వుండకపోనని నీలూ చెప్పినప్పుడు మరీ ఆనందం కలిగింది. కానీ అలాంటి విజ్ఞుడు నా దగ్గిర వుంటే బాగుండును అనే నా కోరిక తీరలేదు బాబాయ్"



"అదేరా జయా! నీకు తెలిసేసరికి ఆలస్యం అయింది. ఉత్తరం రాసినా నువ్వు కార్తీక్ గురించి మాట్లాడలేదేమిటా అనుకున్నాను. కానీ ఉత్తరం చదవలేదని అనుకోలేదు. ఇప్పుడిక ఏం చేయగలం? లూసీ, నీలిమల చేతిలో వున్నాడు కార్తీక్"

"నీలిమ నిర్ణయాన్ని జయదేవ్‌కి చెప్పావా. చాలా డిజప్పాయింట్ అయ్యాడు. 'చాలా ఆశగా ఇంతకాలమూ ఎదురుచూశాను. ఇక ఇక్కడే ఎవరో అమ్మాయి చూడాలి' అన్నాడు. మరి శశికాంత్ ఏమనుకున్నాడో తెలియదు. వాడికి స్వంత నిర్ణయం చేసుకునే అవకాశం లేదు. జయదేవ్ చెప్పినట్టు వినాల్సిందే. అభిరామ్ లూసీ వెంటపడినట్టు తెలిసేవుంటుంది. మరి లూసీ ఏమనుకుంటుందో తెలియదు" అన్నాడు జనార్ధనం.

"ఫోన్లే మనకి సమాధానం చెప్పుకోవలసిన అవసరం తప్పింది. పిన్నితో సుచిత్ర మాట్లాడుతుంది. ఇవ్వు బాబాయ్" అంటూ సుచిత్రకు ఇచ్చాడు ఫోన్.

నందిత, ఫిలిప్స్ వచ్చారు. వస్తూనే గుడ్‌న్యూస్ చెప్పారు జయచంద్రకి, గ్రాండ్‌పా ప్రమోషన్ రాబోతోంది. అప్పటికప్పుడు పార్టీ అరేంజ్ చేశాడు హోటల్లో. 'రాకేష్ నువ్వు మామ అవుతావురా. మనింటికి బేబీ రాబోతోంది' అంటూ అందరూ సంతోషాన్ని పంచుకున్నారు.

'నందిత దగ్గిర కొన్నాళ్లు వుండి వస్తాను' అంటూ సుచిత్ర ఓ నెలరోజులపాటు వెళ్ళింది. బేబీ షవర్ చేశారు. బాబు అని ముందే తెలిసినందువలన బాబుకి ఏం కొనాలో అన్ని రెడీ చేశారు. వాడికి మైకేల్ అని పేరు పెట్టారు. చాలారోజుల తర్వాత పుట్టిన బాబు అంటే ఇంట్లో అందరికీ ముద్దే. వాణ్ణి క్షణం వదలరు. ఇలా అయితే నీ దగ్గిరే వుంచేస్తాను" అంది నందిత.

"నందూ మళ్ళీ నువ్వు డ్యూటీకి వెడితే బాబు ఒక్కడూ వుండాలి. శాండియాగో హాస్పిటల్‌కి ట్రై చేయకూడదూ నువ్వు" అంది సుచిత్ర.

"నేనూ అదే అనుకుంటున్నాను మామ్! ఫిలిప్స్ రావడం కూడా పెద్ద కష్టం కాదు. అవసరం అయితే నేను కొద్దిరోజుల ఇంట్లో వుంటాను" అంది నందిత.

ఫిలిప్స్‌కి ముందుగా పోస్టింగ్ వచ్చింది.

"వేరే ఇల్లు ఎందుకు నందూ, ఇక్కడే

వుండు" అన్నాడు జయచంద్ర.

"వద్దు డాడ్! ఫిలిప్స్‌కి ఇష్టం వుండదు. ఎలాగా ఇల్లు కొనాలని అనుకుంటున్నాం కదూ!" అంది నందిత.

ఎవరో హైదరాబాద్ నుంచి శాండియాగో వచ్చేవారితో నందిత కొడుక్కి గొలుసు, చేతి మురుగులు పంపించారు జనార్ధనం, జానకి. అవికాక సుచిత్ర వేరే కొన్ని తెప్పించింది.

"మగపిల్లాడికి ఇన్ని నగలా? వాడేమైనా ప్రిన్సా?" అన్నాడు రాకేష్.

"ప్రిన్స్ కాకపోతే ఎంపరర్. కావాలంటే నీకూ వేస్తాం..." అంది నీలిమ.

"బాబోయ్ ఈ ఇండియన్ జ్యూయలరీలో ఆడవాళ్ళనే చూడలేకపోతుంటే మగవాళ్ళను కూడా అలంకరిస్తారా?" అన్నాడు.

"ఏంటి కథ? జ్యూయలరీ వేసుకున్న అమ్మాయిల్ని చూసేదాకా వచ్చిందా? మామ్ వీడు తానా మీటింగ్‌కి వెళ్ళినప్పుడు, గుజరాతీ అమ్మాయి దుపట్టా చెంగు పట్టుకుని తిరిగాడు. మరి జాగ్రత్త! నీ కొడుకు అమ్మాయిల వేటలో పడుతున్నాడు" అంది నందిత.

"పడాల్సిందే కదా ఎప్పటికైనా! అలాగే చెయ్‌నీ" అంది సుచిత్ర.

"కొడుకుమీద ఒక్క బగ్‌ని వాలనీయదు మామ్. అమ్మాయిల వేట మొదలుపెట్టమని మామ్ కొడుకుతో చెబుతోంది. వాట్ వండర్?" అంది నీలిమ.

"ఏయ్ గర్ల్స్! ఎటునుంచి ఎటు పోతున్నారు? మీకు నా ఫ్రెండ్స్ కాంపిటేషన్‌కి వస్తారేమోనని భయం" అన్నాడు రాకేష్.

"కాంపిటేషన్? ఎందులో?" అమాంతం రాకేష్ రెండు చెవులూ చెరోవైపు పట్టుకున్నారు అక్కలిద్దరూ.

"సేవ్ మి... మామ్... సేవ్‌మి..." అంటూ అరిచాడు అల్లరిగా రాకేష్.

మైకేల్‌కి అంతా నందిత పోలిక వచ్చింది.

"నందితా నీ సుకుమారం అంతా వచ్చింది వీడికి. అబ్బాయి అమ్మాయిలా వుంటే ఎలా? అబ్బాయిలా వుండాలి కానీ..." అంటాడు ఫిలిప్స్ నందితను వుడికించాలని.

"ఫిలిప్స్ మా ఇండియన్స్‌కి ఒక నమ్మకం వుంది. అబ్బాయికి తల్లి పోలికవస్తే అదృష్టం అని!" అంది నందిత.

"ఏమో? ఏం లక్కీయో. వీడు అమ్మాయిలా వుంటే ఏ అమ్మాయి లైక్‌చేస్తుంది? దూరంగా పారిపోతుంది" అన్నాడు.

"ఇదిగో! నా కొడుకుని ఏమైనా కామెంట్ చేశావంటే వూరుకోను" ముక్కూ, మొహం ఎర్రగా చేసుకుని వుడుక్కుంది నందిత.

డేవిడ్‌కైతే మైకేల్ అంటే ప్రాణం. ఎత్తుకుని తిప్పుతూనే వుంటాడు గార్డెన్‌లో.

వాడికి రెండునెల్లు పూర్తికాకుండానే షికార్లు అలవాటు అయ్యాయి. రోజూ బైటకు తీసుకెళ్లాల్సిందే! అయిదునిముషాలు ఆలస్యం అయితే మొదలుపెడతాడు రాగం. రోజుకొకరు తీసుకువెడతారు. ఫిలిప్స్ బాబు పన్లు ఎక్కువగా తనే చేయాలనుకుంటాడు. ఇండియాలో అయితే తండ్రి పెద్దగా పట్టించుకోడు. ఇక్కడ అలా కాదు. తల్లితో సమానంగా బాధ్యత, పెంపకం తండ్రి పంచుకుంటాడు. ఇలా చేయడంవలన, తండ్రి ప్రేమ బిడ్డకు తెలుస్తుంది. బిడ్డయందు తండ్రికి మమకారం పెరుగుతుంది అంటారు. చాలావరకూ ఇది నిజమే. కొంచెం పెద్దయ్యాక, అంటే పదహారు సంవత్సరాల వయసువచ్చాక, వాడినే సంపాదించుకుని చదువుకోమంటారు. అక్కడ డబ్బులేనందు వలన కాదు. కష్టపడి సంపాదించుకోవడం తెలియాలని! తల్లితండ్రులమీద ఆధారపడరాదని! వారి జీవనశైలి వారిది. మన ఇండియన్స్ ఉద్యోగంలో చేరేదాకా బాధ్యత వహించి, పెళ్లయ్యాక కూడా ఒరేయ్ ఎందుకురా అంత ఖర్చుచేస్తావు? జాగ్రత్తగా వుండటం నేర్చుకోవాలి. అనవసరం ఖర్చు

తగ్గించాలి. డబ్బు పెంచుకోవాలి. సరదాలకేం డబ్బు సంపాదించినకొద్దీ పుట్టుకొస్తాయి" అంటూ కట్టడి చేస్తారు.

ఇండియాలో కుటుంబాలు నెలకు ఒకసారి తెచ్చుకునే గ్రోసరీస్ ఇక్కడ వారానికి తెచ్చుకుంటాం. ఇక్కడ ఆరోగ్యానికి ప్రాముఖ్యతనిచ్చి డబ్బు ఖర్చు చేస్తే, అక్కడ డబ్బుకి ప్రాముఖ్యతనిచ్చి అనారోగ్యం వచ్చాకనే పరుగులు పెడతారు. ఇప్పుడు మార్పు వచ్చినా చాలా విషయాల్లో ఎక్కడి పద్ధతి అక్కడే! అనుకూలంగా వుంటుంది.

జయచంద్ర ఇండియాను వదిలి రావడంలో నష్టపోయిందేమీలేదు. అతడు ఈ దేశంలో వున్నందువలన ఏదో పోగొట్టుకున్నానని అనుకోలేదు. పుట్టి పెరిగినచోట పరిసరాలు, ఒక పద్ధతికి అలవాటు అయ్యారు. అలాగే ఇండియా వెళ్ళి అక్కడి పద్ధతులకు అలవాటుపడ్డారు. ఎక్కడికెళ్ళినా, ఆయా వాతావరణానికి అనుకూలంగా సర్దుకుపోగల స్వభావం అతడికి



ఆనందాన్నిచ్చింది.

తను ఒక కంపెనీ స్టార్ట్ చేశాడు. ఆ కంపెనీలో అన్ని దేశాల ఉద్యోగులూ వున్నారు. 'కంపెనీ శ్రేయస్సుకోరి పాటుపడుతూ, నాకు ఎంతో సహకరిస్తున్నారు. ఒకోసారి పొరబాట్లు చేయవచ్చు అందరమూ కలసి చర్చించుకుని ఆ తప్పును ఒప్పుగా మార్చుకుంటున్నాం. ఇదేవిధంగా నా కుటుంబం విదేశీ సంస్కృతుల సంగమం అయినప్పుడు అందరి అభిప్రాయాలకు విలువ ఇవ్వాల్సివుంటుంది. రేపు నీలిమా, ఆ తర్వాత రాకేష్ వారి జీవన సహచరులను ఎంపిక చేసుకుంటారు. నేనూ, సుచిత్రా అందర్నీ మాతో కలుపుకుపోతూ, ఈ కుటుంబ సౌధానికి దృఢమైన పునాదిగా నిల్చి ఆటుపోట్లకు తట్టుకుంటూ, చిన్నచిన్న బీటలు పడినప్పుడు చాకచక్యంతో వాటిని మరుగుపర్చి సుందరంగా తీర్చిదిద్దుతాం. మా వంశపారంపర్యంగా ఈ లక్ష్యం కొనసాగాలనే నా ఆకాంక్ష' అనుకున్నాడు జయచంద్ర.

★ ★ ★

ఇండియాలో లూసీ కంపెనీ అనుకున్నంత బాగా లేదు. జయచంద్రను సలహా అడిగింది ఏం చేయాలి అని! అందుకు కారణం ఎవరని!

"లూసీ! కొత్తగా స్టార్ట్ చేసిన కంపెనీ నిలదొక్కుకోవడం అంత సులువు కాదనుకో! ఇంకా సంవత్సరం మాత్రమే అయింది. అభిరామ్, కార్తీక్, శశికాంత్ కారకులు అనీ అనుకోడానికి లేదు. కొంతకాలం వెయిట్ చేయాలి. లేదా వాళ్ళని ఇక్కడకు తీసుకువచ్చి ఇక్కడే బ్రాంచ్ ఓపెన్‌చేయాలి. నీ ఇష్టం. ఆలోచించు" అన్నాడు.

"మిస్టర్ చంద్రా! నేను అనుకునేది చెబుతాను. అభిరామ్, శశీలను అక్కడే వుంచి, కార్తీక్‌తో ఇక్కడ మరో బ్రాంచ్ స్టార్ట్‌చేస్తే మంచిది అని! ఎందుకంటే ఇక్కడ నేను వుండి చూసుకోవచ్చును కదా! ఇండియాలో కొద్దికాలం వేచి చూస్తాను మీరు చెప్పినట్టు టైమ్ టేకింగ్ బెటర్" అంది లూసీ.

"వెరీగుడ్ అయిడియా! అలాగే చెయ్" అన్నాడు జయచంద్ర.

"అయితే ఒక కండిషన్ పెట్టాలనుకుంటున్నాను. ఇండియాలో అభి, శశీ కొంత మొత్తాన్ని పెట్టుబడిగా పెట్టి, పార్టనర్‌షిప్ తీసుకుంటే పెద్దగా నష్టం వుండదు. అలా కాకుండా నేను ఒక్కదాన్ని పెట్టుబడి తట్టుకోలేను. మిస్టర్ చంద్రా... కార్తీక్ ఫైనాన్షియల్ పొజిషన్ ఏమిటి? అతను ఏమైనా మనీ ఇవ్వగలడా? " అడిగింది లూసీ.

"నో! లూసీ! హి ఈజ్ వెరీ పూర్‌బాయ్! మనం హెల్ప్ చేయాలి తప్ప, అతడివలన మనకి అటువంటి లాభం ఏమీవుండదు. ఇండియన్ కంపెనీ వరకూ అభి ఫాదర్, శశి ఫాదర్ వెరీ రిచ్. కనుక వాళ్లు పెట్టుబడి పెట్టగలరు. మనం కార్తీక్ నుంచి ఎక్స్‌పెక్ట్ చేసేది ఓన్లీ వర్క్ యూనో? " అన్నాడు జయచంద్ర.

"ఓ. కే. నేను ఒకసారి ఇండియా వెళ్ళి, ఈ విషయం సెటిల్ చేసి, కార్తీక్‌ని వెంటబెట్టుకుని వస్తాను" అంది లూసీ.

సరే అనక తప్పలేదు జయచంద్రకి.

కానీ అతడు తను చేసిన పొరబాటుకి చాలా విచారించాడు. లూసీ, నీలిమకి బెస్ట్ ఫ్రెండ్. మిలియనీర్. ఆమె తన కంపెనీలో ఎక్కువ పెట్టుబడితో కంపెనీ స్టార్ట్‌చేస్తుంది. నీలిమ పార్టనర్ అయినా బాస్ లూసీయే! కొంపతీసి కార్తీక్‌పట్ల లూసీ ఎట్రాక్ట్ అవలేదుకదా? అభిరామ్, శశికాంత్ వంటి డబ్బున్నవాళ్లని వదిలి కార్తీక్‌నే ఎంచుకుందీ అంటే ఇందులో ఏమైనా అతడిమీద ప్రత్యేకించి శ్రద్ధ చూపిస్తోందా? ఈ నీలూ వట్టి పిచ్చిది. లూసీకున్న తెలివి, ముందుచూపూ లేవు. ఇట్టే చూసి, అట్టే పట్టేసింది. తను మాత్రం ఏం చేశాడు? జనార్ధనం బాబాయ్ చెబుతున్నా పట్టించుకోలేదు. ఎలా ఇప్పుడు? సుచిత్రతో తన




ఆవేదన చెప్పుకున్నాడు ఏమైనా సలహా చెబుతుందేమోనని!

"డియర్! నువ్వు ఏదో వూహించుకుంటు న్నావని నా అనుమానం. అమెరికన్ అమ్మాయిలు అంత తొందరగా నిర్ణయానికి రారు. లూసీ ప్యూర్లీ బిజినెస్ లైకింగ్ మైండ్‌తోనే కార్తీక్‌మీద ఇంట్రెస్ట్ చూపిం చింది అనుకుంటున్నాను. నా అంచనా నూటికి నూరు పాళ్లు కరక్ట్ కావచ్చు కాక పోవచ్చు నువ్వేమీ వర్రీకాకు ఎందుకంటే నీలూ లూసీ కంపెనీ వదిలిరాదు. ఒకవేళ లూసీ కనుక కార్తీక్‌ని లైక్ చేసినా కార్తీక్ లైక్ చేస్తాడని గ్యారంటీలేదు. ఆ అబ్బాయి పుట్టిపెరిగిన వాతావరణం అటువంటిది. లూసీ మూలంగా ఇక్కడికి వచ్చిన కార్తీక్, మన నీలూ దగ్గిరయ్యే అవకాశమూ కాదన లేము. అంతా మంచే జరుగుతుంది" అంటూ తోచిన సలహా చెప్పింది.

"చిత్రా నా మనసు నీకు తెలియలేదు. నేను కార్తీక్‌ని మరోవిధంగా అనుకోలేదు. మన కంపెనీ ఎప్పుడూ బాగా నడవాలీ అంటే కార్తీక్‌వంటి ఇంటిలిజెంట్ బాయ్ చాలా అవసరం. నా దగ్గిర మెలకువలు నేర్చుకుని, అనుభవం సంపాదిస్తే, ఈ కంపెనీ తరతరాలూ కొనసాగుతుంది. అనే ఆలోచించాను తప్ప, నీలిమకు అతను సరి జోడీ అని కాదు నీలిమ అల్లుణ్ణి వెదుక్కునే ఛాన్స్ మనకు ఇవ్వదని తెలిసింది కదా? అందువలన పెళ్ళి గురించి ఆలోచించను. ఇక నాకు నువ్వు, కంపెనీయే ప్రాణం" అన్నాడు ఆమె చేతిని తన చేతిలోకి తీసు కుని నిమురుతూ.

"అలాగా? మరి రాకేష్‌ని కూడా త్యాగం చేశావా డియర్? " అంది సుచిత్ర ఫన్నీగా!

"మన పాలసీ ఏమిటో మరచిపోయావా చిత్రా? ఎవర్నీ మనం శాసించరాదు అనే కదా? రాకీ తనంతగాతాను 'మన కంపెనీ లోనే వుంటాను' అన్నప్పుడే వాణ్ణి తీసుకుం టాను. డాడ్ తన స్వార్థంకోసమే పిలిచాడు అనుకునే పరిస్థితి నాకు నచ్చదని నీకూ తెలుసు. ఇంకొక విషయం చెబుతున్నాను చిత్రా. కంపెనీ నా స్వంతం. నా ఇష్టంవ చ్చినవాణ్ణి తీసుకుంటాను అని నేను అను కోను. నాతోపాటు వారి శక్తినంతా ధార పోసి నాది అనే మక్కువతో కంపెనీ కోసం అహర్నిశలూ కష్టపడుతున్న తోటి ఉద్యోగ స్థులను దృష్టిలో వుంచుకుని మంచి క్వాలి ఫికేషన్స్, ఎక్స్‌పీరియన్స్ వున్నవారినే తీసు కుంటాను. నాకొడుకు, నాకూతురు, తమ్ముడు, కుటుంబసభ్యులూ అంటూ ఏమాత్రమూ కాంప్రమైజ్ అయ్యేది లేదు. మనలోమాట! ఏమాత్రమూ అర్హతలేని వాడ్ని తీసుకుని నష్టపోవాలని ఎవరు కోరు కుంటారు? అందుకే నీలిమా, రాకేష్ వేరే వెడతానంటే మీ ఇష్టం అన్నాను. పదిమం దితో నడిపే సంస్థలో మొహమాటాలు అసలు పనికిరావు. మనం ఇండియా వెళ్ళి నప్పుడు ఎందరో బంధువులు మా అబ్బా యికి మీ కంపెనీలో ఉద్యోగం ఇవ్వండి అంటూ అడిగారు. కానీ అలా వీలుపడు తుందా? వీలుపడదని చెబితే 'వీడికి బాగా గర్వం. పోనీ వాడికి తగిన ఉద్యోగం ఇక్కడే చేస్తాడు. నిన్ను అనవసరంగా అడిగాం' అని నిష్ఠూరంగా మాట్లాడారు. ఇంకొకరైతే మన ఇండియాలో ఇంజనీర్లని, అమెరికన్ కంపెనీలు కళ్లకద్దుకుని తీసుకుం టాయి. ఈయనగారికి మాత్రం చిన్నచూపు అదే మరి! మనవాడంటూ వుండికూడా, మనకు సహాయపడడు. అడిగి లేదనిపించు కున్నాం అన్నారు.

నేను ఒకసారి ఇంటర్వ్యూ చేస్తున్నప్పుడు ఐ.ఐ.టి నుంచి వచ్చిన స్టూడెంట్ అప్లికే షన్ చూశాను. అతడ్ని సెలక్ట్ చేయాలని అనుకున్నాను. ఆరోజు ఏదో కారణంగా ఇంటర్వ్యూ వాయిదా వేయాల్సివచ్చింది. తర్వాత శని, ఆదివారాలు వచ్చాయి. ఈలోగా నాకో నిజం తెల్సివచ్చింది. అతడి సర్టిఫికెట్స్ అన్నీ బోగస్ అని! మళ్లీ వెరీఫై

చేయమని. వెంటనే అవన్నీ పరిశీలించాను. దొరికిపోయాడు. ఇలా మోసంచేసేవాళ్ల గురించి ఏం చెప్పగలం? అంత్యనిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలని, అప్పట్నించీ చాలా జాగ్రత్తగా వుంటున్నాను. ఎలాగో ఈ దేశంలో అడుగుపెట్టగలిగితే ఎలాగైనా బతికేయగలవారూ వుంటారు. నిజంగా మెరిట్ వుండి, అవకాశాలు రానివారూ వుంటారు. ఆరోజు కంపెనీ గురించిన చాలా విషయాలు చిత్రకి చెప్పాడు జయ చంద్ర.

★ ★ ★

లూసీ ఇండియాకి వచ్చింది. ఈసారి నేరుగా బెంగుళూర్ వెళ్ళిపోయింది. జనార్ధనం ఎప్పటిలా మా ఇంటికి రావచ్చు ఇది నీ బంధువుల ఇల్లే! అంటూ చెప్పినా, ముఖ్యమైన పని చూసుకోవాలంటూ లూసీ తిరస్కరించింది.

అభిరాంకి లూసీని చూడగానే ప్రాణం లేచివచ్చింది. శశికాంత్ భావావేశాలకు అతీతుడు. అతను కీ ఇస్తే నడిచే మెషిన్ లాటి వాడు. వెనకాల ఎవరో ఒకరు ఆపరేట్ చేయాలి అనే విషయం తెలిసివచ్చింది లూసీకి. అయితే డబ్బున్నవాడు కాబట్టి వదులుకోరారు.

అభిరాం తనమీద చాలా ఆశ పెట్టుకున్నాడనీ తెలుసు లూసీకి. అంతేకాదు ఎలాగో తన వెంట అమెరికా రావాలనే ఆశ పడుతున్నాడు.

కార్తీక్ అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ ఒకేలా వుంటాడు. తనేమో, తన వర్క్ ఏమో! అంతే తప్ప మిగిలిన ప్రపంచం అతనికి అవసరంలేదు.

లూసీ వచ్చేముందు తెలియచేసినప్పుడు అభిరామ్, శశికాంత్ ఒకటే హడావిడి చేశారు. కార్తీక్ మాత్రం 'అహ... అలాగా?' అన్నాడు అంతే!

ఈసారి కార్తీక్ అంటే చాలా కోపం వచ్చేస్తుంది లూసీకి అనుకున్నారు అభిరామ్, శశికాంత్‌లు. వీళ్లిద్దరికీ కార్తీక్ అంటే చిన్న చూపు. పూర్‌ఫామిలీ నుంచి వచ్చాడని! తెలివితేటలు చూసి జలసీ. ఎప్పుడు, ఏ ఉన్నత శిఖరానికి ఎగబాకేస్తాడో అని! అంతే తప్ప, వారికి తెలియనివి తెలుసుకుందామని కానీ, అతడి విజ్ఞానాన్ని ఆసరాచేసుకుని, మనం కూడా ఉన్నత శిఖరానికి చేరుకోవాలని గానీ అనుకోరు. వాళ్లకి చిన్నప్పట్నించీ తల్లితండ్రులు నేర్పింది ఒక్కటే? 'డబ్బుతో ఏదైనా సాధించవచ్చు. అది మన దగ్గిర వుంది' అనేది.

లూసీ మీటింగ్ ఏర్పాటుచేసి అసలు విషయం చెప్పినప్పుడు షాక్ అయ్యారు. కానీ పదిమందిలో అప్పుడు మాట్లాడటం సభ్యత కాదు కనుక, విడివిడిగా కలుసుకున్నప్పుడు చెప్పారు.

"మిస్ లూసీ! నన్ను ప్రమోట్ చేసి మీ అమెరికన్ కంపెనీలో చేర్చుకుంటారని ఎంతో ఆశపడ్డాను. నాకు ఒక్క ఛాన్స్ ఇవ్వండి" అన్నాడు అభిరామ్.

"మిస్టర్ అభీ! మీ ఆశకు నేను బాధ్యురాల్ని కాదు. ఎందరో ఏవో ఎక్స్‌పెక్ట్ చేయచ్చు అవన్నీ తీర్చడం ఇంపాసిబుల్. అసలు ఇక్కడ కంపెనీలో నేను అనుకున్నంత ఇంప్రూవ్‌మెంట్ లేదు. పూర్తిగా క్లోజ్ చేసేద్దామా అని కూడా అనుకున్నాను. కానీ చంద్ర కొద్దికాలం వేచి చూడమంటే సరే అన్నాను. ఇలా కంపెనీ నడపాలంటే సాధ్యంకాదు. నేను తరచుగా ఇండియా రానూలేను. అందుకని ఒక ఆలోచన. మీరిద్దరూ కంపెనీలో షేర్స్ తీసుకోండి మీరిద్దరూ రెండువంతులు చొప్పున. నేను ఒక వంతు అయితే ఇది వుంటుంది. లేకుంటే క్లోజ్. మీరు ఆలోచించి నేను వెళ్ళేలోగా చెప్పండి. వన్ థింగ్ కార్తీక్‌ని నాతోబాటు అమెరికా తీసుకువెడుతున్నాను. నా నిశ్చయానికి తిరుగులేదు" అంటూ ముగించింది.

అభిరామ్, శశికాంత్ కుప్పకూలిపోయారు. అమ్మో! ఈ అమెరికన్ లేడీస్‌వి





ఎంత తెలివితేటలు? మనం పిచ్చివెధవల్లా మా నాన్న రిచ్ ఫెలో అంటూ ఈవిడగారికి ఖరీదైన ప్రజంటేషన్స్ ఇచ్చేవాళ్ళం. చాలా స్టైల్‌గా, ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో పార్టీలు ఇచ్చాం. కార్తీక్ ఒక్కపార్టీ ఇవ్వలేని పూర్ ఫెలో అంటూ హేళన చేసేవాళ్ళం. ఎప్పుడూ లూసీ కార్తీక్‌ని మెచ్చుకుంటూ వుంటే మనం ఒకటే జలసీ ఫీలయ్యేవాళ్ళం. అతడిమీద ఏదోఒక కంప్లయింట్ చేసే వాళ్ళం. ఇవన్నీ ఆవిడ విని మమ్మల్నే ఎక్కువ ఇష్టపడుతోందనుకున్నాం. చివరికి గోవింద" అనుకున్నారు.

"నామాటకేంలే! నీకున్న తెలివి నాకు లేదు. నిన్ను తప్పక అమెరికా తీసుకువెడుతుందని అనుకున్నాను. చివరికి నీకూ, నాకూ ఒకటే దక్కింది" అన్నాడు శశికాంత్.

"అది సరేనోయ్! ఇప్పుడు ఏం చేద్దాం? మనిద్దరం పార్టనర్‌షిప్ తీసుకుంటేనే ఈ కంపెనీ వుంటుందిట. లేకపోతే క్లోజ్‌ట. మన నాన్నలు పేరుకే కోటీశ్వర్లు. మనచేతికి, పట్టుమని పదివేలు ఇవ్వరే! ఎలాగ? పోనీ 'మేము కలసిరాలేము. మీ ఇష్టంవచ్చినట్టు చేసుకోండి' అందామంటే, 'ఏకంపెనీ పరిస్థితీ బాగాలేదు. అందర్నీ పీకేసి, మళ్ళీ కాళ్ళావేళ్ళా పడినవారికి ముందు ఇచ్చిన జీతంలో సగం జీతం ఇచ్చి తీసుకుంటున్నారు మిగిలిన కంపెనీల్లో! ఈ లూసీ పేమెంట్ అందరికన్నా బాగానే చేస్తోంది. పంతానికి పోతే ఇదీ వుండదు. అప్పుడు నాన్నలకి మరీ లోకువ అయిపోతాం. పాతిక లక్షల కట్నంతో బేరమాడుతున్న పెళ్ళి సంబంధాలు తప్పిపోయాయని చావకొడతారు. అటేమో నీలిమని పెళ్ళిచేసుకుంటే అమెరికా వెడతాం అనుకున్న ఛాన్సు పోయింది. ఇటు ఈ లూసీ దయతలచి తీసుకువెళ్ళదా అనుకుంటే ఇదీ పోయింది. ఏం చేయాలి? ఏదో మసిబూసి, మారేడు కాయచేసి మీ నాన్ననీ, మానాన్ననీ రప్పించి వాళ్ళతో మాట్లాడమనటంకంటే గత్యంతరం లేదు" అనుకున్నారు.

జనార్ధనానికి కార్తీక్‌ని అమెరికా తీసుకువెడతానని లూసీ చెప్పిన వార్త చాలా ఆనందం కలిగించింది.

భార్గవ, జయదేవ్‌లకు పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టుంది. లాభ, నష్టాలకు సిద్ధపడి కంపెనీ పార్టనర్‌షిప్ తీసుకోవాలా? ఉద్యోగాలు పోయి, పెళ్ళిసంబంధాలు తప్పిపోయి, కళ్ళెదుట, గుండెలమీద హీటర్స్‌లా తిరుగుతున్న కొడుకుల్ని భరించాలా అనేది తెగక, తెగ ఆలోచించేసి, లూసీని బతిమాలి ఏమైనా కన్సెషన్ ఇస్తుందేమో అనే ఆశతో ఆవిడను అడిగారు.

"ఇంత డబ్బున్న మీరు కన్సెషన్ అడగటం వెరీ బాడ్. ఇదేమైనా డ్రస్సా ఆర్టికలా? నో... నో... కంటిన్యూ ఆర్ క్లోజ్. తేల్చుకోండి. లాభాలు వస్తే మీవి కావా? ఎంతసేపూ పెట్టుబడి గురించే వర్రీ అయిపోయారు. మీ ఇండియన్ మెంటాలిటీ ఇలాగే వుంటుందా? ఇక మీరు బిజినెస్‌కి అన్‌ఫిట్. అప్పుడే నెలరోజులు గడిచిపోయింది. నేను వెళ్ళాలి. అమెరికాలో నాకు చాలా పని వుంది. మీరు తొందరగా సాయంత్రంలోగా నిర్ణయం తెలియచేయాలి" అంది లూసీ విసుగ్గా లేచి నిలబడి.

ఏం చేయాలో పాలుపోక జనార్ధనాన్ని అడిగారు.

"నాకేం తెలుసండీ? ఏం చెప్పమంటారు? మీకు తోచినట్టు చేసుకోండి. నేను కోటీశ్వరుణ్ణీ కాదు. నాకు కొడుకులూ లేరు" అని తప్పుకున్నాడు.

ఇక వేరే దారిలేక లూసీతో ఒప్పందాలపై సంతకాలు చేసి, వాడిన వదనాలతో భార్గవా, జయదేవ్ ఇంటిదారి పట్టారు.

కార్తీక్, లూసీలు అమెరికా వెడుతుంటే ఎయిర్‌పోర్ట్‌లో వీడ్కోలు చెబుతూ జనార్ధనం కార్తీక్‌తో చెప్పాడు.

"బాబూ కార్తీక్! మీ తాత ఏ లోకంలో వున్నా, నిన్ను చూసి పొంగిపోతూ

వుంటాడు. ఎప్పుడైనా వస్తుండు. ఈ దేశంలో ఎవరూ లేరు. రుణం తీరిపో యింది అనుకోకు సుమా! నేనున్నాను మర చిపోవద్దు" అన్నాడు.

"ఎలా మరచిపోతాను జనార్ధనంగారు. ఇదంతా మీ ఆశీస్సుల ఫలితమే! మీ చొరవ లేకుంటే నాకింత మంచి ఉద్యోగం దొరి కేదా? ఇంతటి అపురూపమైన అవకాశం లభించేదా? వస్తాను! తప్పకుండా మిమ్మల్నీ, నా జన్మభూమినీ చూడటానికి వస్తాను... నా చేతనైనంతగా రుణమూ తీర్చుకుంటాను" అంటూ జనార్ధనం కాళ్లకు వంగి నమస్కరించాడు.

"ఇలా చేస్తే ఏమిటీ?" అంటూ అడిగి తెలుసుకున్న లూసీ తాను కూడా అలాగే వంగి నమస్కరించింది.

"గాడ్‌బ్లెస్ యూ" అంటూ దీవించాడు జనార్ధనం.

"నాతో ఫ్రీగా, ఫ్రెండ్లీగా వుండు కార్తీక్. నేను బాస్‌ని కాదు. నీ శ్రేయోభిలాషిని అంతే" అంది లూసీ.

"ఎవరికి ఇచ్చే రెస్పెక్ట్ వారికి ఇవ్వాలి మేమ్" అన్నాడు కార్తీక్.

'మొదటిసారి ఇతణ్ని చూసినప్పుడే కాదు. చూస్తున్నకొద్దీ ప్రత్యేకత కనబడుతోంది' అనుకుంది లూసీ.

'కంపెనీ డైరక్టర్‌గా, బాస్‌గా వీడ్కోలు చెప్పడానికి అభిరామ్ శశికాంత్‌తో కలిసి ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళినప్పుడు, అభిరామ్ గుండె కలుక్కుమంది. లూసీ పక్కనే ఫస్ట్ క్లాస్‌లో ప్రయాణం చేసి, అమెరికా వెళ్లాల్సిన తన చోటులో కార్తీక్ వెడుతున్నాడు. తన హక్కును ఒక మామూలు మనిషి స్వంతం చేసుకున్నాడు. అదీ ఏ ప్రయత్నమూ లేకుండా... సునాయాసంగా' అనుకున్నాడు.

శశి మామూలుగా వుండటం అతడికి ఆశ్చర్యంగా వుంది.

"శశికాంత్! నీకేమీ బాధగా లేదా?" అడిగాడు.

"బాధా? ఎందుకూ? ఆవిడ మన కంపెనీ అధికారిణి. ఆవిడ తన దేశం వెళ్లడం మామూలేకదా?" అన్నాడు అమాయకంగా.

"అంతేనా? అమెరికా వెళ్లాలనుకున్న నీ కలలు విచ్ఛిన్నం అయిపోవడం, పెళ్లిచేసుకుంటుందనుకున్న నీలిమ తృణీకరించడం, ఒక మామూలు పేదవాడు సులువుగా అమెరికా వెళ్లడం. అదీ మన బాస్ దగ్గిరుండి తీసుకువెళ్లడం బాధ కలిగించలేదా?" అన్నాడు.

"ఏమో నాకు అన్ని ఆలోచనలు రాలేదు. నువ్వు అనుకున్నవన్నీ మానాన్న అనుకున్నాడు. దానికి నేను బాధ్యుణ్ణి కాదు. గాలి ఎటు వీస్తే అటు సర్దుకునే నేచర్ నాది!" అన్నాడు శశికాంత్ అతిమామూలుగా.

"అదృష్టవంతుడివి. నీవంటివారు దేనికీ విచారించరు. కృంగిపోరు. నేను లూసీమీద చాలా ఆశలు కల్పించుకున్నాను. నాతో చాలా క్లోజ్‌గా వుంటే లైఫ్ పార్టనర్‌ని చేస్తుందనుకున్నాను కానీ ఇలా కంపెనీ పార్టనర్‌షిప్ ఇస్తుందని అనుకోలేదు. ఇక జీవితంలో ఎవరిమీదా ఆశలు పెంచుకోను. నీకులా నాన్న చెప్పిన అమ్మాయి మెడలో తాళికట్టేసి మామూలుగా బతికేస్తాను" అన్నాడు విషాదంగా అభిరామ్.

"ఆ... నీలిమ మనిద్దర్నీ ఎందుకు కాదందో అర్థం అయింది" హటాత్తుగా స్ఫురించిన శశి అన్నాడు.

"అంటే...?" అర్థంకాక అడిగాడు అభిరామ్.

"ఇలా చివరికి కాంపర్‌మైజ్ అయిపోగల స్వభావం మనలో కనిపెట్టి" అన్నాడు శశికాంత్.

"ఇలాకాక మరెలా చేయాలంటావ్?"

"మనం మన తండ్రులమీద, వారి డబ్బుమీదా ఆధారపడకుండా మన సొంత టాలెంట్‌తో అమెరికా వెళ్ళి అక్కడ అమ్మాయిలకు నచ్చేవిధంగా వ్యక్తిత్వం తీర్చిదిద్దు




కుని, నాలుగైదు సంవత్సరాలు అమ్మా యిలు పరిశీలించి మెచ్చే రీతిగా వున్నప్పుడే ఏ బేధభావమూ లేకుండా మనల్ని ఇష్టపడ తారేమో" అన్నాడు శశికాంత్.

'శశికాంత్ నిజంగా తెలిసే అన్నాడో, తోచినట్టు చెప్పాడో తెలియదుకానీ నిజం చెప్పాడు. మాకు వ్యక్తిత్వంలేదు. ప్రేమ పేరుతో తల్లితండ్రులు / ఒక చట్రంలో ఇమిడ్చి పెంచితే అదేవిధంగా రూపుదిద్దు కున్నాం. మనకింత సంపదవుంది కనుక, పేద ఇంటి పిల్లని కోడలిగా తెచ్చుకుందాం అని అనుకుంటున్నారా? లేదు. మన స్టేట స్‌కి సరిపోయే అమ్మాయి కోడలుగా రావాలి అనుకుంటున్నారు. కట్నాలు భారీగా ఆశిస్తున్నారు. పెళ్ళి రంగరంగ వైభ వంగా అందరూ చెప్పుకునేలా చేయాలంటు న్నారు. లక్షలకులక్షలు దుబారా చేస్తారు. చేయాలనుకుంటారు. అలా చేస్తేనే పెళ్ళి అవుతుందా? లేకుంటే కాదా? హంగూ, ఆర్భాటం ఎవరికోసం? పట్టెడన్నం పెట్ట మని కాళ్ళావేళ్లా పడిన పేదవాడ్ని, ఈడ్చి కాలితో తంతాం తప్ప, వాడికి భోజనం పెట్టడానికి చేయిరాదు. మానవత్వం, ప్రేమ, జాలి, దయాగుణాల్ని ప్రేమించే వాళ్లు కొందరుంటారు. ఆ కోవకు చెందిన దేమో నీలిమ. నిజంగా నీలిమలో ఏం గుణాలు పసికట్టాం? అమెరికాలో సిటి జన్. అమెరికా వెళ్ళచ్చు అంతే! మిగిలినవి ఏమీ మాట్లాడలేదు. మాట్లాడగలిగే అవకా శాన్ని అమ్మా నాన్నలు ఇవ్వరుగా? పోనీ అలా అని, ఇక్కడి అమ్మాయిని కట్నంలేకుం డానూ చేసుకోరు. మారవలసింది మేమే! మా అమ్మానాన్నలు అవకాశం ఇవ్వరు అనుకోకపోతే మా వ్యక్తిత్వం ఏమైంది?' కొద్దిసేపు వైరాగ్యంలో పడిపోయాడు అభి రామ్.

"ఇక వెడదామా? ఫ్లయిట్ కూడా వెళ్లిపో యింది. ఆలోచించి బుర్ర వేడెక్కించుకో వడం ఎందుకు? పద" అన్నాడు శశికాంత్.

యాంత్రికంగా కారెక్కి, డ్రైవ్ చేస్తూ ఇంటికి వచ్చాడు అభిరామ్.

"రారా అభీ! ఇదిగో ఈయన మంత్రిగారి బావమరిది. వీరమ్మాయినే నీకు ఖాయం చేశాం" అంటూ ఎదురొచ్చాడు భార్గవ.

★ ★ ★

కార్తీక్‌ని అడిగింది లూసీ! "కార్తీక్ నువ్వు జయచంద్ర ఇంటికి వెడతావా? మా ఇంట్లో పేయింగెస్ట్‌గా వుంటావా? " అని!

ఇండియానుంచి అమెరికా వరకూ లూసీ తోనే వచ్చి, జయచంద్రగారింటికి వెళ్ళడం ఏం న్యాయం? తర్వాత ఎకామిడేషన్ గురించి ఆలోచించవచ్చు ప్రస్తుతం కొద్దిరో జులపాటు పేయింగ్ గెస్ట్‌గా లూసీ ఇంట్లో వుండటమే న్యాయం అనుకున్నాడు కార్తీక్.

జయచంద్రకి కార్తీక్‌ని చూడాలని, తన ఇంటికే తీసుకురావాలనీ మనసులో వుంది. కానీ కార్తీక్ అమెరికా రావడంలో తన ప్రమేయం లేనప్పుడు 'లూసీ ఇతడ్ని నేరుగా మా ఇంటికి తీసుకువెడతాను' అని, చెప్పలే కపోయాడు. కొద్దిరోజుల తర్వాత అడుగు దాంలే అనుకున్నాడు. మామూలుగా లూసీ ఇంటికి వెళ్ళినప్పుడు అందరూ కలిశారు. మొదటిసారి జయచంద్రను, సుచిత్రనూ చూశాడు కార్తీక్. పరిచయాలు అయ్యాక, కొద్దిసేపు సూర్యంగారూ, పార్వతిల గురించి మాట్లాడుకున్నారు.

వచ్చేముందు జనార్ధనం చెప్పిన మాటలు జయచంద్రతో చెప్పాడు కార్తీక్. అతడికి జయచంద్రా, సుచిత్రలపట్ల గౌరవభావం ఏర్పడింది.

లూసీ భార్గవనూ, జయదేవ్‌నూ కల వడం, అభిరామ్‌కీ, శశికాంత్‌కి ఏమాత్రమూ పవర్స్ లేకపోవడం, పార్టనర్స్‌గా జరిగిన ఒప్పందం వివరాలు చెప్పింది. కన్సెషన్ అడిగిన విషయం గుర్తుతెచ్చుకుని పడీపడీ కళ్ళనీళ్లు తిరిగేలా నవ్వింది.

లూసీ హ్యూమరస్‌గా తీసుకున్నా జయ చంద్ర వారి ప్రవర్తనకు సిగ్గుపడ్డాడు. ఏం

చేస్తాం? ఇలాటివి దాచుకున్నా దాగవు. బైటపడుతూనే వుంటాయి. అయితే లూసీ తెలివైన పని చేసింది. వస్తే లాభం పంచుకుంటుంది. నష్టపోతే అదో లెక్కకాదు ఈమెకు. అనుక్షణం ఒళ్లు దగ్గిరపెట్టుకుని చచ్చేలా కష్టపడాల్సిన అవసరం అభిరామ్, శశికాంత్‌లది. ఓ రకంగా వాళ్ళిద్దర్నీ కంపెనీ అరెస్ట్ చేసేసింది. ఇక లూసీ అటు వెళ్ళదు. వాళ్ళవైపు చూడదు. ఎందుకంటే కార్తీక్‌లాటి అమూల్య రత్నాన్ని దక్కించుకున్న తర్వాత ఇక ఈ అమ్మాయికి ఏదీ అవసరం లేదు.

సుచిత్ర కూతురిని అడిగింది "ఈమధ్య లూసీ ఇంటివైపు వెళ్ల లేదా? కార్తీక్ వచ్చాడు"

"ఆ... వస్తే ఏంటట? అతను కంపెనీలో చేరాడు. అతని ఛాంబర్ వేరు. నా ఛాంబర్ వేరు. నేనూ లూసీ కూడా కావాలనుకుంటేనే కలుస్తాం. ఎవరి వర్క్ వారిది" అంది.



"అది సర్లే! నువ్వు ఇండియా లూసీతో మొదటిసారి వెళ్ళినప్పుడు అతన్ని కలిశావు కదా? ఓసారి హలో చెబుతావని' ' అంది సుచిత్ర.

"ఆ ఫార్మాలిటీస్ ఎప్పుడో పూర్తయ్యాయి మామ్! ఎప్పుడూ లేనిది, ఈరోజు నా గురించి ఇంత శ్రద్ధ తీసుకుంటున్నావేమిటీ?" అంది నవ్వుతూ నీలిమ.

"ఆ శ్రద్ధ నీమీద కాదోయ్ చిన్నక్కా! ఆ కార్తీక్ అనే అబ్బాయిమీద యామై కరక్ట్ మామ్?" అన్నాడు అక్కడే వున్న రాకేష్.

"అదికాదు నీలూ! కార్తీక్ మొదటిసారి అమెరికా వచ్చాడు కదా? ఇక్కడ పద్ధతులూ, ఫుడ్ అంతా కొత్తగా వుంటుంది. నువ్వు కొంచెం కంపెనీ ఇస్తే బాగుంటుందని డాడ్ అంటున్నారు" అంది సుచిత్ర.

"లూసీ ఇంట్లో అతనుంటే మనం చేసే హెల్ప్ ఏముంటుంది? కార్తీక్ తనకు కావలసిన ఫుడ్ తనే తయారు చేసుకుంటాడట. అతనికి ఇబ్బంది ఏమోనని, లూసీ నాన్ వెజ్ తయారుచేయడం మానుకుందట. బైట తింటున్నాను అంది. అంటే లూసీ అతన్ని శ్రద్ధగా చూసుకుంటున్నట్టే. ఎవరైతేనేం. నిజానికి కార్తీక్ మనతోకంటే లూసీతోనే ఎక్కువ క్లోజ్‌గా వుంటాడు. తనే ఎక్కువ పరిచయం కదా?" నీలిమ తన ధోరణిలో చెబుతోంది.

'ఏంపిల్లో? గ్రహించుకోదు. మెల్లగా స్నేహం కలుపుకుని, మన ఇంట్లోకి తీసుకురావచ్చుననే ఆలోచనలేదు' అనుకుంది సుచిత్ర.

ఇక జయచంద్ర పూనుకోవాలి అనుకుంది.

"నీలూ నువ్వు, నేనూ, రాకేష్, కార్తీక్, వెకేషన్స్‌కి ఎటైనా వెడదామా?" అడిగిందో రోజు లూసీ.

వెకేషన్ ట్రిప్ అంటే ఎగిరి వచ్చేస్తుంది నీలిమ.

"ష్యూర్! ఎటు వెళ్లాలని ప్లాన్?" అడిగింది నీలిమ.

"విస్కాన్‌సిన్ డెల్స్, లేక్ సుపీరియర్, దార్లో కేసీనో వగైరా"

"ఓ. కే. అయామ్ రెడీ" అంది నీలిమ.

"సరే అయితే రాకేష్‌ని కూడా అడుగు

తాను" అంటూ పిల్చింది. వాడూ సరేన న్నాడు. కార్తీక్ ఎవర్నీ కాదు, లేదూ అనడు. అందులో లూసీ మాటంటే శిరోధా ర్యమే ఇక!

హమ్మయ్య అందరూ కలిసి వెడుతు న్నారు అనుకున్నారు జయచంద్రా, సుచిత్రా.

"మనం కూడా వెడదామేమిటోయ్ చిత్రా? " అడిగాడు భార్యని.

"ఇప్పుడు వాళ్లతో వద్దులే! పిల్లల్ని ఎంజాయ్ చేయనీ. మనం మరోసారి వెళ్ళచ్చు" అంది సుచిత్ర.

ముఖ్యంగా నీలిమ, రాకేష్‌లకు డ్రైవింగ్ ఇష్టం. "లూసీ వాన్‌లో బయలుదేరు దామా? ఆ వాన్‌లో అన్ని సదుపాయాలూ వుంటాయి. ఒకరి తర్వాత ఒకరు డ్రైవ్ చేసుకుంటూ, నైట్ టైమ్ ఏదో ఒక ప్లేస్‌లో స్టే చేస్తూ వెళ్లచ్చు" అన్నారు రాకేష్, నీలి మలు.

"ఇండియాలో డ్రైవింగ్ చాలా కష్టం. బెంగుళూర్, ఢిల్లీ ఫర్వాలేదు రోడ్స్ బాగుం టాయ్. హైదరాబాద్‌లో పాప్యులేషన్ చాలా ఎక్కువ. పబ్లిక్ ట్రాఫిక్ రూల్స్ పాటించరు. గవర్నమెంటు స్ట్రిక్ట్‌గా వుండదు. ఎందుకుండదు అంటే ప్రజలను కంట్రోల్ చేయడం ప్రజాసామ్యానికే విరుద్ధం అంటూ అపోజిషన్ హడావిడిచేసి, కింది తరగతి ప్రజలను రెచ్చగొడుతుంది. ఫలితంగా ఓట్లు పడవు. అదీ భయం. పైగా పార్టీలు చాలా వుంటాయి. ఓట్లను చీల్చడానికి, పనీపాటా లేనివాళ్లంతా ఎలక్ష న్‌లో నించుంటారు. ప్రాంతాల వారీగా గూండాలు, రౌడీలు ఒక నాయకుణ్ణి ఎన్ను కుని ఆ నాయకుడు చెప్పినట్టే నడుచుకుం టారు. ఏ పార్టీవలన మంచి జరుగుతుంది అనే ఆలోచన వుండదు" అన్నాడు రాకేష్ కార్తీక్‌తో.

కార్తీక్ సాధారణంగా ఎవర్నీ కామెంట్ చేయడు. కానీ రాకేష్‌కి తన అభిప్రాయం చెప్పడానికి ఇలా అన్నాడు.

"నువ్వు చెప్పింది నిజమే రాకేష్. అక్కడి ప్రజలలో చాలావరకూ నిరక్షరాస్యులు. నిరుపేదలూను. సహజంగా భయపడరు. నోరున్నవాడిదే రాజ్యంగా చలామణి అయి పోతోంది. వాళ్లని ఎదిరిస్తే ఏం ప్రమా దమో! నిలువ నీడ కూడా దక్కదనే పిరికి తనం వలన మనదేశంలో రాజకీయ నాయ కుల పెత్తనం నిరాటంకంగా కొనసాగు తోంది. వారు చట్టాన్ని, ధర్మాన్ని తమ గుప్పిట్లో వుంచుకుని మనవంటివారికి ఇబ్బంది కలిగిస్తుంటారు" అన్నాడు.

"మరి ప్రజలు ఏనాటికీ తెలుసుకోరా? ఎదురు తిరగరా? అసలు చదువుకున్న వాడికే ఓటు హక్కు అనే రూల్ పెడితే కొంతనయం ఏమో" అన్నాడు రాకేష్.

"చదువు కున్నవాడా? చదువు కొన్న వాడా? ఇండియాలో కొందరు చదువు, డిగ్రీలు, డాక్టరేట్స్ డబ్బుతోనే కొనవచ్చు బ్రెయిన్‌తో ఆలోచించి కష్టపడి చదివి, పరీ క్షరాసి పాస్ కానక్కర్లేదుట. నాకు జనా ర్ధనం గ్రాండ్‌పా చెప్పారు" అంది నీలిమ.

"అందుకే డాడ్ కంపెనీలో జాబ్స్‌కి ఇండి యన్స్‌ని తీసుకోరు" అన్నాడు రాకేష్.

"అది తప్పు అభిప్రాయం. అందరూ అలా చేయరుకదా? ఆవిధంగా తయారు అయినవారిని గుర్తించి, నిరాకరించడం పెద్ద కష్టంకాదు. రాకేష్! నువ్వు ఇండియన్ అయి వుండీ వారిని హేళన చేస్తున్నావా? " బాధగా అన్నాడు కార్తీక్.

"నోనో, నా వుద్దేశ్యం హేళన చేయాలని కాదు. అలా చేయడం తప్పు అంటున్నాను. అక్రమంగా సాధించిన డిగ్రీలవలన ప్రయో జనం వుండదు. మోసం ఎప్పటికైనా బయ టపడుతుంది. అసలు మోసం చేయడం అనే ఆలోచన మంచిదికాదని నా అభి ప్రాయం" అన్నాడు రాకేష్.

సంభాషణ అంతా తెలుగులో జరగడం వలన లూసీకి వాళ్లు ఏం మాట్లాడుకున్నారో

తెలియక "దయచేసి ఇంగ్లిష్‌లో మాట్లాడండి. నా అభిప్రాయమూ చెబుతాను" అంది.

'అయ్యో మా ఇండియా గురించి ఇదంతా నీకు తెలిసిపోతే ఎలా?' అనుకుని "ఏంలేదు. మా ఇండియన్ గవర్నమెంట్ పాలసీ గురించి మాట్లాడుకున్నాం" అంది నీలిమ లూసీతో.

"కార్తీక్! నీకు అమెరికా ఎలా వుంది?" అనడిగింది లూసీ.

"చూసినంతవరకూ తెలిసినంతవరకూ బాగుంది" అన్నాడు కార్తీక్.

"మనం ఇప్పుడు చాలా దూరం ప్రయాణం చేస్తాం. కాబట్టి ఇంకా చాలా విషయాలు తెలుస్తాయి. ఆ మూల నుంచి ఈ మూలకు రావాలంటే చాలాదూరం ప్రయాణం చేయాలి. టైమ్ కలసి రావాలంటే కొన్నిచోట్ల ఫ్లైచేయక తప్పదు. శాండియాగో నుంచి ఫీనిక్స్ వన్ అవర్ ఫ్లై చేస్తాం. ఫీనిక్స్ నుంచి డల్లాస్ మీదుగా మినియాపొలిస్ వెళ్లచ్చు. అక్కడ్నించి కారులో వెళ్లడం బెటర్" అంది లూసీ.

"అదీ నిజమే! టైమ్ వేస్ట్ కాకుండా కొంత దూరం ఫ్లై చేద్దాం" అన్నాడు కార్తీక్.

"ఓ మీరిద్దరూ మా ప్లానంతా పాడుచేశారు. లూసీ ఇలా వెనకాడుతుంది అనుకోలేదు" అని నిరాశపడినా మళ్లీ సర్దుకున్నారు రాకేష్, నీలిమా.

లూసీ ప్లాన్ ప్రకారం ఫీనిక్స్, ఫీనిక్స్ నుంచి డల్లాస్. అక్కడ్నించి మినియాపొలీస్ చేరుకునే సరికే రాత్రి పదిగంటలైంది. అమెరికా చాలా పెద్ద కంట్రీ కావడంవలన ఈస్ట్, వెస్ట్, సౌత్, నార్త్‌లకు ఫీనిక్స్‌లో బయలుదేరిన టైమ్ డల్లాస్ చేరుకునేసరికి అదే సమయం సూచిస్తుంది. డల్లాస్ నుంచి మినియాపొలీస్ చేరుకున్న సమయం రెండు గంటలు మాత్రమే కావచ్చు. కార్తీక్ వచ్చిన తర్వాత ఇంతదూరం ప్రయాణం చేయడం ఇదే మొదటిసారి. సరదాగా టైమ్ నోట్ చేసుకున్నాడు. డైరీలో తన ట్రిప్ విశేషాలన్నీ వివరంగా రాసుకున్నాడు. అది చూసిన రాకేష్ చెప్పాడు.

"కార్తీక్ అంత శ్రమదేనికీ? మాప్స్ వున్నాయి మా దగ్గిర. చూపిస్తాను. నీకు అంతా వివరంగా తెలుస్తుంది. ఇక్కడ అందరూ మాప్ ఫాలో అవాల్సిందే. లోకల్‌గా కూడా మాప్ సహాయంతో కొత్తవాళ్లు ఎక్కడికైనా వెళ్లచ్చు అన్నట్టు ఈమధ్య కారులోనే డైరెక్షన్స్ చూపించే మానిటర్ ఫిక్స్ చేసిన మోడల్స్ వచ్చాయి. నువ్వు కారు కొంటావుకదా! అప్పుడు అలాటిది కొను. నీకు బాగా ఉపయోగం" అన్నాడు రాకేష్.

"మరి నువ్వింకా ఆ మోడల్ కొనలేదా?" అడిగింది నీలిమ తమ్ముణ్ణి.

"డాడ్‌కి సెంటిమెంట్స్‌కదా! పాతది అలా వుంచే కొత్తది కొనాలంటారు. అందుకని ఆలోచిస్తున్నాను. లేకుంటే కొనకపోదునా?" అన్నాడు.

"అంతా వట్టిది. డాడ్‌ని అడిగితే నువ్వు ఉద్యోగంలో చేరాక కొనుక్కో! అందాకా ఇది చాలు అన్నారు. వీడేమో తన మనీ బైటకు తీయడు. పొదుపు ఎక్కువ" అంటూ చెప్పింది లూసీతో.

"అంటే మీ డాడ్ మనీ ఖర్చు చేసినా ఫర్వాలేదుకానీ తన మనీ ఖర్చు చేయడానికి ఇష్టపడడు. మన గవర్నమెంట్ అలా వుంటే ఎంతో బాగు పడేది ఎకానమీ" అంది లూసీ. అంతా సరదాగా కబుర్లు చెప్పుకుంటూ మినియాపొలిస్‌లో స్టే చేశారు ఆ రాత్రికి.

మర్నాడు టాక్సీ రెంట్‌కి తీసుకున్నారు. ఈ రెంటెడ్ టాక్సీలతో చాలా జాగ్రత్తగా వుండాలి. కారు తీసుకునేటప్పుడు చిన్న గీత వున్నా, ఏదైనా ఫాల్ట్‌వున్నా ముందుగా గుర్తించి పేపర్‌మీద నోట్ చేయాలి. లేకుంటే తిరిగి కారు తీసుకునేటప్పుడు ఓనర్ మీరే స్క్రాచ్ చేశారు మనీ కట్టాలి

అంటూ వేధించి వసూలు చేస్తాడు" అంటూ రాకేష్ కార్తీక్‌తో చెప్పాడు.

"ఒరేయ్ రాకీ! నువ్వు మరీ ఫోజుకొట్టేస్తు న్నావ్ కార్తీక్ దగ్గిర. చూస్తూనే గ్రహించ గల తెలివి గలవాడు కార్తీక్" అంది నీలిమ.

"లేదు నీలిమా! రాకేష్ అలా చెప్పినందు వలన చాలా వుపయోగం వుంటుంది. నాలాటి కొత్తవారికి చాలా అవసరం. అతన్ని ఏమీ అనకు" అన్నాడు కార్తీక్.

"మీరు ముగ్గురూ మీ లాంగ్వేజ్‌లో మాట్లాడేసుకుంటూ నేను వున్నానని మరచి పోతున్నారు. అసలీ ట్రిప్ వేసింది ఎవరు?" కోపంగా అంది లూసీ.

"సారీ లూసీ! కార్తీక్‌కి అమెరికాలో పద్ధ తులను మేం వివరిస్తున్నాం. అలవాటుగా కార్తీక్‌కి తెలుగు వచ్చుకదాని... ఇక ఇంగ్లి ష్‌లోనే మాట్లాడతాం ఓకే!" అంది నీలిమ.

"దట్స్‌రైట్. ఫాలో మి" అంది లూసీ.

"మినియాపొలిస్ మిన్నిసోటా స్టేట్‌లో వుంది. మినియాపొలిస్, సెయింట్‌పాల్ అనే జంట నగరాలు, ఇండియాలోని హైద రాబాద్-సికింద్రాబాద్ జంటనగరాల్లాంటివి. యూనో లూసీ?" అడిగింది నీలిమ.

"యా... అయ్‌నో" అంది లూసీ తనకూ గుర్తువుందని చెబుతూ.

"ఇక్కడ్నించి మన ప్రయాణం లేక్ సుపీ రియర్ మీదుగా డులూత్ వెడతాం. అంటే కారులో మనం వెడుతుంటే మన పక్కగానే లేక్ కనబడుతూ వుంటుంది. లేక్ ఇంత పెద్దగా వుండటం గ్రేట్. ఇలా కెనడా దాకా డ్రైవ్ చేసుకుంటూ పోవచ్చు లేదా షిప్‌లో వెళ్లచ్చు. బోట్‌లో వెళ్లచ్చు. ఈ లేక్ కెనా డాలోనే వుందని చెప్పచ్చు" అంటూ వివరిం చింది లూసీ.

దార్లో కేసినో కనబడగానే నీలిమా, రాకేష్ ఆగుదాం అన్నారు. "నో ఇప్పుడు కాదు. రిటర్న్‌లో ఆగవచ్చు. ఇప్పుడు వెళ్లి పోదాం" అంది లూసీ స్పీడ్ పెంచుతూ డులూత్‌లో వాటర్‌ఫాల్స్, సైట్‌సీయింగ్ ఎంతో ఎంజాయ్ చేశారు.

ఆ తర్వాత విస్కాన్‌సిన్‌డెల్స్ చేరుకుని అక్కడో హోటల్‌లో రూమ్స్ తీసుకున్నారు. ఆ రాత్రికి నిద్రపోయి, మర్నాడు ఉదయం రైడ్స్, ఫన్స్‌లో ఎంజాయ్ చేశారు. స్విమ్మింగ్ చేశారు. వాళ్లు వచ్చేప్పుడు స్విమ్ సూట్స్ తెచ్చుకున్నారు. కార్తీక్ ఇంకా స్విమ్మింగ్ నేర్చుకోలేదు. అయినా సరదాగా వాళ్లు తెచ్చిన షార్ట్ వేసుకుని నీటిలోకి దిగాడు.

అమెరికాలో బీచ్ ప్రాంతాలవారు లేక్స్‌లో స్విమ్ చేయాలని వెడతారు. లేక్స్ ప్రాంతా లవారు హవాయ్, మియామి, ఫ్లొరిడా, కాలి ఫోర్నియా బీచ్‌లకు ప్రయాణం కడతారు. సమ్మర్‌లో తప్పనిసరిగా ట్రిప్ వేసుకుం టారు చాలామంది. అక్కడ ఎంజాయ్‌మెం ట్‌కి వయో భేదంలేదు. ఇంత ఖర్చు చేయ డమా అని వెనకాడరు. లైఫ్ అన్నది ఎంజాయ్ చేయడానికే అనుకునే మన స్తత్వం వారిది. డాలర్, డాలర్ కూడబెట్టి పిల్లలకివ్వాలి అనుకోరు. రిచ్ అయితే ఎటూ ఇస్తారు. మిడిల్‌క్లాస్, బిలో మిడిల్ క్లాస్ వారు అలాంటి ఆలోచన జోలికిపోరు. కష్టపడాలి సంపాదించుకోవాలి అనుకుం టారు. కార్తీక్ ఒక్కొక్క విషయం అర్థం చేసుకుంటున్నాడు. చదవడంవేరు, చూసిన అనుభవాలువేరు. ఇంతకుముందు చూసిన ప్రపంచంవేరు. ఇప్పుడు ఈ దేశంలో చూసే కొత్త విషయాలు వేరు అనుకున్నాడు.

'ఆడా మగా అనే తేడా లేకుండా అందరూ కలిసిపోతారు. అదే ఇండియాలో ఆడపిల్ల నిలువునా శరీరాన్ని కప్పుకుని పొరబాటున పైటజారిందో ఇక ఆ అమ్మాయి పని అంతే! అటువంటిది ఇక్కడ సమ్మర్ వచ్చిందంటే చాలు! ముఖ్యమైన భాగాలు తప్ప ఎక్కడా ఆచ్ఛాదన వుండదు. అలా అని తామేదో అపవిత్రం అయిపో యామనీ, ఎవరో చూస్తారనే ఆలోచనే





వుండదు అమ్మాయిలకి. ఆడవాళ్లకి ఇది సహజం అన్నట్టుగా మసలుతారు. మగవాళ్లు మరి ఇండియాలో స్త్రీ నిండుగా డ్రస్ చేసుకున్నా వేధింపులు, కొత్తచూపులు, వక్ర దృష్టి ఎందుకో అర్థం కాదు.

లూసీ, నీలిమా, రాకేష్ హాయిగా నవ్వుతూ, తుళ్లుతూ నీటిలో చేపల్లా ఈదుతూ, ఒకరినొకరు నెట్టుకుంటూ కొట్టుకుంటూ కేరింతలు కొడుతున్నారు. కొత్త మనిషి వున్నాడనే స్పృహ వారికిలేదు. వీళ్లు ఇండియా వచ్చినప్పుడు ఇటువంటి ఎంజాయ్‌మెంట్ ఏది? అయినా వీళ్లు అలా ఫీలవలేదు. అక్కడకు తగినట్టుగా అక్కడ వున్నారు. ఇక్కడ అరమరికలు లేకుండా స్వేచ్ఛగా మసులుతున్నారు. నేను కూడా స్విమ్మింగ్, కారు డ్రైవింగ్ నేర్చుకోవాలి. ప్రతివాళ్లకీ ఏదో ఒక గేమ్ వచ్చి వుంటుంది. టెన్నిస్, బేస్‌బాల్, ఫుట్‌బాల్ ఏదైనాసరే! ఇండియాలో పుట్టిన మొదలు చదువో, చదువు అంటూ సతాయిస్తారు. మార్కులు సరిగా రాలేదనో, అనుకున్న క్లాస్, రాంక్ రాలేదనో ఆత్మన్యూనతా భావంతో ఆత్మహత్యలు చేసుకునే వారు ఎక్కువయ్యారు. అందుకు కారణం పోటీ, తల్లితండ్రుల ఓవర్ ఎక్స్‌పెక్టేషన్, విశ్రాంతి లేని చదువు. ఒక సంవత్సరం పరీక్షలు రాసిన తర్వాత రెండో సంవత్సరంలో చేరే వారికీ, పదో తరగతి రిజల్ట్స్ రాకపోయినా ఫస్టింటర్‌లో చేరకపోతే మంచి కాలేజీలో సీటు దొరకదని భయం తప్ప ఆటపాటలకీ, సమ్మర్ వెకేషన్ ట్రిప్‌కి ఖాళీ ఏది? ఎప్పుడూ ఏదో ఒక టెన్షన్‌లో నలిగిపోతున్నారు పిల్లలు. ఇక్కడ అటువంటి నిర్బంధం అంటూ వుండదు. స్కూల్ గ్రాడ్యుయేషన్ అంతా ఒకటే. ప్లస్‌టూ వరకూ ఒకే స్కూల్. అన్ని సబ్జక్ట్స్ వుంటాయి కాబట్టి ప్లస్‌టూ తర్వాత ఏం చదవాలీ అనేది స్టూడెంట్ నిర్ణయించుకుంటాడు తప్పితే పేరెంట్స్ కలగచేసుకోరు. మరో విషయం ఇండియాలో నాలుగు సంవత్సరాల అబ్బాయిని స్కూల్లో వేస్తారు. వాడు అక్షరాలు నేర్చుకుని ఎంతత్వరగా ఒక్కొక్క క్లాసులోకి ఎగబాకుతాడా అని ఎదురుచూస్తారు. పదో క్లాసు పూర్తయ్యేసరికి నాలుగు స్కూళ్లు మారుస్తారు. పధ్నాలుగేళ్లకి టెన్త్‌క్లాస్ పూర్తిచేసేస్తే ఇక కాలేజీలో ఏ గ్రూప్ తీసుకోవాలనే ఆలోచనా, అన్వేషణా ప్రారంభమవుతుంది. అబ్బాయికి ఇందులో ఎంత మాత్రమూ ప్రమేయం వుండదు. అంతా పేరెంట్స్‌దే! వాళ్లకోసం చదవాలి. వాళ్లకోసం మార్కులు తెచ్చుకోవాలి. చివరికి వారి కోరిక మీద ఇంజినీరో, డాక్టరో అవ్వాలి. ఇవన్నీ అయ్యాక పెళ్లి సంబంధాలు కూడా వాళ్లే చూడాలి. అబ్బాయికి ఎందులోనూ స్వతంత్రం వుండదు. జనరల్‌గా జరిగేది ఇది. అతికొద్దిమంది ఈ రకంగా ప్రవర్తించకపోయినా చాలా వరకూ తల్లితండ్రుల ప్రమేయం ఎక్కువగా వుంటుంది'.

"కార్తీక్! ఏంటి ఆలోచిస్తున్నావ్? రా త్వరగా" అంటూ నీలిమ పిలిచేవరకూ ఆలోచనల్లో మునిగిపోయాడు.

ఆరోజుకి బాగా అలసిపోయి హాయిగా నిద్రపోయారు.

లేక్ సుపీరియర్‌లో బోటింగ్, రిటర్న్‌లో కేసినో దగ్గిర ఆగటం రాకేష్, నీలిమా ఒక్కగంతులో లోనికి చొరపడ్డారు.

"ఏమిటంత వాళ్లకి ఆనందం? " లూసీని అడిగాడు కార్తీక్.

"చూద్దువుగాని. కేసినో గురించి వినే వుంటావు. మా కంట్రీలో గాంబ్లింగ్ లీగలైజ్డ్. కాకపోతే ఊరికి చాలా దూరంగా వుండాలని రూల్స్" అని చెప్పింది లూసీ.

"దీనివలన ప్రమాదం కదా? గాంబ్లింగ్ వలన గవర్నమెంట్‌కి చాలా మనీ రావచ్చునేమోకానీ మనిషి దుర్వ్యసనానికి లోనైతే మరింత క్రైమ్ కాదా? " అన్నాడు కార్తీక్.

"కార్తీక్! డ్రింకింగ్, సిగరెట్ వలన

మనిషి పాడవుతున్నాడుకదా? అలా అని మానగలుగుతున్నారా? చలిదేశం కాబట్టి ఆరోగ్యానికి అల్కహాల్ లీగలైజ్ చేసినప్పుడు మనిషి టైమ్‌పాస్‌కి దీన్ని కూడా లీగలైజ్ చేశారు. మనిషి తననుతాను కంట్రోల్లో వుంచుకోవడం అనేది అందరికీ అన్ని విషయాల్లోనూ అవసరమే. అది మరచి, గవర్నమెంట్‌ని తిడితే లాభం ఏముందీ? నేను సమర్థించానని కాదు. లోపలికెడితే టీనేజర్స్‌కన్నా మిడిలేజ్, ఓల్డేజ్ పీపుల్స్ ఎక్కువ కనబడతారు. నువ్వు తక్కువ మనీతో గేమ్ ప్లే చెయ్. రెండు గంటలు దాటి అక్కడ నిలబడద్దు. ఈ రెండూ దృష్టిలో వుంచుకుంటే నిన్ను నువ్వు కంట్రోల్ చేసుకున్నట్టే. లెటజ్ ఎంజాయ్" అంది లూసీ కార్ పార్క్ చేసి వస్తూ.

కార్తీక్ ఆమెను అనుసరించి వెళ్లాడు.

అక్కడ కొన్ని వందల మెషీన్స్ వాటి ముందు కిక్కిరిసిన జనం. పెట్టుబడినిబట్టి ఆటాడ్డం. కార్తీక్ తనకు తెలియకుండానే మొట్టమొదట 25 సెంట్స్ వైపు వెళ్లాడు. అక్కడ అంతగా జనంలేరు. వున్నా ఏమీ ఎమౌంట్ రానందున లేచి వెళ్లిపోతున్నారు. లూసీ అతడి వెనకాలే వెళ్లి ఎలా ప్లే చేయాలో చూపించింది. కొద్దిసేపు అక్కడే నిలబడి, అతడికి క్వాయిన్స్ రావడం మొదలయ్యాక నీలిమా, రాకేష్‌లు ఎక్కడ వున్నారా అని అటు వెదుకుతూ వెళ్లింది. ఒకో మిషన్‌లో సరిగ్గా మనీ రాకపోతే మరోచోటుకి మారుతూ, కొంత ఎమౌంట్ వచ్చింది కదాని తిరిగి అదే పెట్టుబడితో ఆడుతూంటారు. చివరికి అంతా పోగొట్టుకుని లేచి వెడతారు. ఒక మెషిన్ ఇరవై అయిదుసార్లు క్వాయిన్స్ ఇస్తే ఇరవై ఆరోసారి నుంచి ముప్పై వరకూ, ఏభై వరకూ వెయిట్ చేసినా ఒక్క క్వాయిన్ రాకపోవచ్చు. కాని అంతకుముందు ప్లేచేసినవారు ఎంతసేపు చేశారో తెలియక కొత్తవారు అలా ఆడుతూనే వుంటారు. చివరికి సర్వం పోగొట్టుకుంటారు. ఇందులో రకరకాల గేమ్స్ వుంటాయి. వందలకొద్దీ డాలర్స్‌తో మొదలుపెట్టి పోగొట్టుకుంటారు. ఎప్పుడో కొందరికి లాభమూరావచ్చు. అప్పుడు ఆయా వ్యక్తులపేరు మైక్‌లో అనౌన్స్ చేస్తారు. అక్కడ వున్నంతసేపూ సాఫ్ట్ డ్రింక్స్, కాఫీ, టీలు ఫ్రీగా ఇస్తారు. అక్కడికి వెళ్లేముందు మనకు చాలా మనీ వస్తుంది అనుకుని రాకుండా పోయే అవకాశాలే ఎక్కువ. జస్ట్ టైంపాస్ అండ్ ఫన్ అనుకునే వెళ్ళాలి. ఈ గాంబ్లింగ్‌కి వచ్చేవారి కోసం అతి సమీపంలో హోటల్స్ కూడా వుంటాయి. హోటల్ రూమ్స్ తక్కువ ఖరీదుకే లభిస్తాయి. రెస్టారెంట్స్ చెప్పక్కర్లేదు. ఎప్పుడూ అందుబాటులో వుంటాయి. ముఖ్యంగా టైమ్‌పాస్‌కోసం ఓల్డ్ పీపుల్ ఎక్కువమంది వచ్చి, రోజుల తరబడి హోటల్స్‌లో మకాం వేస్తుంటారు.

సరిగ్గా రెండుగంటల తర్వాత లూసీ అందర్నీ అక్కడ్నుంచి లేవగొట్టి బైటకు తీసుకువచ్చింది. నీకెంత వచ్చింది. నీకెంత పోయిందని ఒకరికొకరు చెప్పుకున్నారు సరదాగా.

కార్తీక్‌కి మాత్రం ఫిఫ్టీన్ డాలర్స్ వచ్చింది. అతను మనీ రాగానే ఆట ఆపేశాడు.

"కొత్త అయినా ఎక్కడా టెమ్టేషన్ లేకుండా ప్లే చేశాడు. చాలా గ్రేట్" అని మెచ్చుకుంది నీలిమ.

"కొత్త కనుకనే ఇంత త్వరగా వచ్చేశాడు. అలవాటు అయితే 'మీరు వెళ్ళండి. నేను రాను' అనేవాడు" అన్నాడు రాకేష్.

"నీకంతా జలసీ... కార్తీక్‌ని మెచ్చుకున్నామని" అంది నీలిమ.

"షటప్" అన్నాడు రాకేష్.

"యూ షటప్" అంది నీలిమ.

"మీరు ఇప్పటివరకూ ఫైట్ చేసుకోలేదు అనుకున్నాను. మొదలుపెట్టారూ? " అంది

లూసీ.

"ప్లీజ్! నా గురించి మీరు పోట్లాడుకో వద్దు" అన్నాడు కార్తీక్.

"నీ గురించి అని కాదులే. ఏదో కారణం వుండాలిగా? "అంది నీలిమ.

వెనక్కి మినియాపోలిస్ వచ్చారు.

"నెక్స్ట్ ప్రోగ్రాం ఏమిటీ? " అడిగింది లూసీ.

"ఇక్కడ లేక్స్ చూడడం, స్విమ్మింగ్, బోటింగ్..." అన్నాడు రాకేష్.

"నాకు స్విమ్మింగ్ నువ్వే నేర్పాలి రాకేష్" అన్నాడు కార్తీక్.

"క్లబ్‌లో చేరి నేర్చుకోవడం మంచిది" అంది లూసీ.

ఈమాట లూసీ అనబట్టి రాకేష్ మాట్లాడలేదు కానీ, నీలిమ అని వుంటే మళ్ళీ ఇద్దరిమధ్యా పోట్లాట జరిగేది.

మరో రెండు రోజులు గడిచిపోయాయి.

"ఇక ఇంటికి వెడదామా? " లూసీ అడిగింది.

రాకేష్‌కైతే ఇంకా తిరగాలనే వుంది.

"లూసీ మనం కెంటకీ వెడదామా? " అన్నాడు.

"మనం ముందుగా ప్లాన్ చేసుకోలేదు కదా రాకేష్? ఇప్పుడు ట్రావెల్ చాలా ఎక్స్పెన్సివ్ అవుతుంది. పైగా ఇంతకాలం కంపెనీలో ఎవరూ లేకుంటే ఎలా? మరోసారి వద్దాం" అంది లూసీ.

కొంత అసంతృప్తితోనే వెనక్కి బయలుదేరాడు రాకేష్. కార్తీక్ కూడా ఇంతకాలం కంపెనీ వదలడం ఇష్టంలేదు. కానీ వాళ్ళతో వచ్చినప్పుడు వాళ్ళతోనే వెనక్కి రావాలికదా? అతడికి ఈ ట్రిప్ సంతృప్తికరంగానే వుంది. 'లూసీ చాలా మంచి కంపెనీ ఇచ్చింది. నీలిమపట్ల ఎటువంటి అభిప్రాయమూ ఏర్పడలేదు. రాకేష్ గాలివాటం మనిషి. ఎటూ స్థిరత్వం లేదు. అతను ఇలాగే వుంటే ప్రమాదం. ఒక మార్గాన్ని ఎంచుకుని ఇక స్థిరపడడం మంచిది. కానీ తానెవరికీ చెప్పతగినవాడు కాదు' అనుకున్నాడు మనసులో.

లూసీ కంపెనీ అడ్వయిజర్ జయచంద్రకి అప్పగించే వచ్చినా ఈ విషయాన్ని బైటకు తెలియనీయలేదు. నిజానికి ఆమె కార్తీక్ శక్తిసామర్థ్యాలను ఇంకా పరీక్షిస్తూనే వుంది. అందుకు కారణం ప్రత్యేకంగా ఏమీ లేకపోయినా, ఇంతదూరం తీసుకువచ్చినందుకు ఫలితాన్ని రాబట్టుకుని ఒక బిజినెస్ మాగ్నెట్‌గా ఆలోచిస్తూనే వుంది. ఆమె మనసులో ఒక నిగూఢ రహస్యం నిక్షిప్తమయింది. అవసరం వచ్చినప్పుడే ఆ రహస్యాన్ని బైటపెడుతుంది. ఇది ఆమె వ్యక్తిత్వంలోని ప్రత్యేకత. ఎలాంటివారికీ ముందుగా చెప్పే ప్రసక్తిలేదు.

"లూసీ, ఈరోజు మైఖేల్ బర్త్‌డే పార్టీ. మీరంతా వచ్చేయండి. కార్డ్ పంపిస్తున్నాను" అన్నాడు ఫోన్ చేసి జయచంద్ర.

"అలాగే! ఈ రోజంతా మేం వాడితో స్పెండ్ చేయచ్చు" అంది లూసీ. కార్తీక్ ఇప్పుడు వేరే అపార్ట్‌మెంట్ తీసుకుని వుంటున్నాడు. తరచుగా జయచంద్ర ఇంటికి వెడుతుండడం, తాత, అమ్మమ్మల కబుర్లు చెప్పుకుంటూ బాగా కుటుంబసభ్యులందరితో కలిసిపోయాడు.

కానీ రాకేష్‌కీ, కార్తీక్‌కీ అస్సలు పడడం లేదు. దానికి కారణం మొదట్లో రాకేష్ కార్తీక్‌ని తన కంట్రోల్‌లో వుంచుకోవాలనీ, బైట ఎవరితోనూ సరిగా బిహేవ్ చేయడం తెలియనివాడనీ చిన్నచూపు చూసేవాడు. పైగా లూసీ, అమ్మానాన్నలు అతను చాలా తెలివిగలవాడని ఆకాశానికి ఎత్తేయడం గిట్టలేదు. ఏదో కారణంగా కార్తీక్‌ని హేళన చేయడం బాగా అలవాటైంది. మందలించిన తండ్రిని కూడా లెక్కచేయడంలేదు.

కార్తీక్ మాత్రం రాకేష్‌ని చిన్నపిల్లాడి మనస్తత్వం అనే ధోరణిలో సర్దుకుపోతాడు.

ఇప్పుడు మైఖేల్ బర్త్‌డేకి ఎదురుపడక తప్పలేదు. బైటవారికి ఈవెనింగ్ పార్టీ

# ఏరిన ముత్యాలు

★ ధైర్యము, జ్ఞాపకశక్తి, కార్యదక్షత కలవాడు ఔన్నత్యమును పొందును.

– విదురుడు

★ చదువులేని ఉత్సాహం గుర్రపుశాలనుండి పారిపోయిన గుర్రంలాంటిది.

– వివేకానంద

★ నిజం మాట్లాడడం యొక్క విలువ తెలియనివాడు చెల్లని నాణెంతో సమానం.

– గాంధీజీ

★ చిక్కుపడిన మనసుపై సాధించిన విజయాన్ని గొప్ప విజయంగా పేర్కొనవచ్చు.

– ఠాగూర్

★ పవిత్రహృదయం గలవారు నిర్భయంగా జీవిస్తారు, నవ్వుతూ చనిపోతారు.

– సోక్రటీస్

★ సంకల్పబలం ఉన్న హృదయానికి సంభవం కానిదంటూ ఏదీ ఉండదు.

– అరవిందుడు

★ నడవడిక బాగుండకుంటే నింద తప్పనిసరి.

– మధురాంతకం రాజారాం

★ జీవితమునకు అధముడు, మృత్యువునకు మధ్యముడు, అవమానానికి ఉత్తముడు భయపడును.

– విదురుడు

★ మనిషికి వినయమే సౌందర్యం, గర్వం అంగవైకల్యం.

– విద్యాప్రకాశానంద

★ సమయపాలనే మనిషి సౌశీల్యానికి మచ్చుతునక.

– గాంధీజీ

★ పేరు ప్రతిష్ఠలకోసం అర్రులు చాచేవారు తమ నడతవైపు దృష్టిని సారించడం అవసరం.

– ఒక సూక్తి

★ ఒక వ్యక్తితో ఒకేసారి చెప్పబడేది మాత్రమే రహస్యం అనిపించుకుంటుంది.

– షేక్స్‌పియర్

★ స్వతంత్రంగా ఆలోచించడాన్ని, స్వతంత్రంగా బతకడాన్ని నేర్పేది విద్య అనబడుతుంది.

– లాలా లజపతిరాయ్

★ ధర్మపరాయణత్వం ద్వారానే మనం అన్నిటినీ పొందగలుగుతాము.

– వాల్మీకి మహర్షి

★ దీనులపై, రోగులపై, దరిద్రులపై ఆదరము చూపువారు సదా పుత్ర పౌత్రాభివృద్ధితో, సకల సంపదలతో వర్ధిల్లుతారు.

– విదురుడు

సేకరణ: **శివప్రసాద్ పండా**

వుంది. మధ్యాహ్నం లంచ్‌కి అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర చేరారు. "ఈరోజు స్పెషల్ ఏమిటీ?" అంటూ కార్తీక్ ఒక్కొక్కటీ మూత తీసి చూడసాగాడు.

ఇదే అదనుగా రాకేష్, "కార్తీక్ ఈరోజు నువ్వు నాన్‌వెజ్ టేస్ట్ చేయాలి. లేకుంటే బాగోదు. ఇందులో నువ్వు తప్ప మేమంతా నాన్‌వెజ్ అలవాటున్నవాళ్ళమే" అన్నాడు.

"ముందుగా చెప్పినందుకు థ్యాంక్స్. అందరికీ సారీ చెబుతున్నాను. నన్ను ఫోర్స్ చేయద్దు. నాకు కావలసింది మాత్రమే తీసుకుంటాను" అన్నాడు కార్తీక్.

"అలా వీల్లేదు. టేబుల్ కర్టసీ అనేది తెలియకపోతే ఎలా? నువ్వు నీ పాత పల్లెటూరి పద్ధతులు మార్చుకుని తీరాలి. ఎప్పుడూ ఇండియన్ ఫుడ్ తప్పితే మరొకటి టేస్ట్ చేయకపోవడం షేమ్..." అన్నాడు రాకేష్.

వీళ్ళిద్దరి పట్టుదలా, వాదనా చూసి సుచిత్ర భయపడింది. రాకేష్ ఈమధ్య చాలా మారిపోయాడు. ఇండియన్నంటే పడదు. తను ఇండియన్ అని పొరబాటున కూడా చెప్పడు. తెలుగు నేర్చుకుంటాను, మాట్లాడతాను అనేవాడు. ఆమాట రానీయడు. కార్తీక్ అంటే పడదు. అతను తెలివైనవాడు... అని తండ్రి అంటే సహించలేడు. అతడి లోపాలను పదే పదే చెప్పి హేళన చేస్తాడు. మంచితనం, కరుణ ఎదుటివారిని ఆదుకోవాలనే దయా ఏ కోశానా లేవు. పేదరికం అంటే ఎలర్జీ. ఐశ్వర్యంలో పుట్టిపెరిగిన తనను మించి ఎవరూ మనుషులే కారన్నట్టుంటాడు. ఇదేమిటీ? అందర్నీ ఒకలాగే పెంచినా ఎక్కడవుంది లోపం? అనుకుంది. దీన్ని పెరగకుండా తుంచేయాలనే నిశ్చయంతో, "రాకీ! ఫుడ్ హాబిట్స్ అనేవి మనిషి మనిషికీ ఒకేలా వుండవు. నేనూ, మీ డాడ్ ప్యూర్లీ వెజిటేరియన్స్. మిమ్మల్ని కంట్రోల్ చేయలేదు కదా? మీకు నచ్చినవిధంగా వుంటారు. అలాగే మన ఇంటికి వచ్చిన అతిథులను కూడా మనం చేసిన పనినే చేయమని ఫోర్స్ చేయడం మంచిదికాదు. లీవిట్" అంది నచ్చచెబుతూ.

"రాబిట్ మాంసం ఎంత టేస్టీగా వుంటుందో కార్తీక్‌కి తెలియదు. అందుకే అలా అంటున్నాను. నాకేమీ అతడితో పోట్లాడడం సరదాకాదు" అన్నాడు రాకేష్.

"అయినాసరే! నువ్విలా నా ఎదురుగా బిహేవ్ చేయడం నేను సహించను" కోపంగానే చెప్పింది సుచిత్ర.

"ఎందుకు నన్నీరోజు ఇలా అంటున్నావ్? నేను భోజనం చేయను" అంటూ టేబుల్ ముందునుంచి లేచి పోబోయాడు రాకేష్.

తనమూలంగా రాద్ధాంతం జరగడం ఇష్టంలేక, చటుక్కున రాకేష్ చేయి పట్టుకున్నాడు కార్తీక్.

"ప్లీజ్ రాకేష్! భోజనం ముందునుంచి లేవద్దు. నేను నాన్‌వెజ్ తినకపోవడంలో ఒక కారణం వుంది. చెబుతాను విను. అది విన్నతర్వాత నువ్వే బాధపడతావ్. మీ ఇంట్లో ఎన్నో పెట్స్ వున్నాయి. వాటిని నువ్వు ఎంతో ప్రేమిస్తావ్. ఒక్కటి కనబడకపోతే భోజనం కూడా చేయవు. నా చిన్నప్పుడు నేను చిన్న రాబిట్‌ని పెంచుకున్నాను. దాన్ని క్షణం వదిలేవాణ్ణి కాదు. అందులో నాకు అమ్మానాన్నా ఎవరూ తెలియదు. నేను ఎప్పుడూ ఏడుస్తుంటే తాతయ్య తెప్పించాడు. అప్పట్నించీ నాకు అమ్మగురించి బెంగ తెలియలేదు. అంత ప్రేమతో పెంచుకుంటున్న రాబిట్ హఠాత్తుగా మాయమయింది. ఎటుపోయిందో అని బెంగపడ్డాను. తాతయ్య మరోటి తెచ్చిచ్చినా నాకు బాధ తగ్గలేదు. ఓరోజు మా ఇంటిపక్కవాళ్ళ అబ్బాయి చెప్పాడు. దాన్ని మా ఇంట్లో దొంగతనం చేసినవాళ్ళ నాన్నే వండుకు తినేశాడని. అంతే అప్పట్నించీ నేను ఏ జంతువునూ పెంచలేదు. మాంసా

హారం ముట్టలేదు. అదీ కారణం!" అంటూ చెప్పాడు కార్తీక్.

మరి ఏమనుకున్నాడో ఏం మాట్లాడకుండా భోజనం చేసేశాడు రాకేష్. అతడికి కార్తీక్ చెప్పిన కారణం సబబుగా తోచింది. మూర్ఖంగా మాంసాహారం తినమని బలవంతం చేయడంలో అర్థంలేదు అనుకున్నాడు. అయితే నేనుమాత్రం అలాంటి సెంటిమెంట్స్ పెట్టుకోను అని కూడా అనుకున్నాడు.

'హమ్మయ్య కార్తీక్ తెలివిగా ఏదో చెప్పి గొడవ సద్దుమణిగేలా చేశాడు' అనుకున్నారంతా.

ఫిలిప్స్‌కి మాత్రం కార్తీకంటే మంచి అభిప్రాయం ఏర్పడింది. వాళ్ళిద్దరి ప్రొఫెషన్స్ వేరు అయిపోయాయికానీ బలే ఇంటిలిజెంట్ అనుకున్నాడు. ఫిలిప్స్ ఎదుటివారి గుణాన్నిబట్టి ఫ్రెండ్‌షిప్ చేస్తాడు. తనకు సరిపడని వారికి దూరంగా వుంటాడు. రాకేష్ నందిత బ్రదర్. రిలెటివ్ కాబట్టి ఏదో మాట్లాడతాడు. కానీ ఎక్కువగా ఇష్టపడింది కార్తీక్‌నే!

ఆ తర్వాత వాతావరణం చాలా ఆహ్లాదకరంగా, హాపీగా గడిచింది. ఎవరికివచ్చిన విద్య వాళ్ళు ప్రదర్శించారు. డాన్స్ చేశారు. చిన్నపిల్లలంతా కేరింతలతో, ఆటపాటలతో హోరెత్తించారు. మైఖేల్ తండ్రిలా బాగా పొడగరి. అయిదేళ్ళకే చాలా ఎదిగాడు. కార్తీక్‌కి వాడికీ బాగా దోస్తీ. అయితే వాడికి కార్తీక్ పేరు పిలవడం చాలా కష్టంగా వుంది. ఇంటిపేరు ఇంకా కష్టం. అందుకని నందిత వాడికి 'కాతిక్' అని, సులువుగా వుండేమాట చెప్పింది. ఇక కార్తీక్‌ని చూడడం తరవాయి, 'కాతిక్... కాతిక్' అంటూనే వుంటాడు.

కార్తీక్ ఇంత చిన్నపిల్లలకు దగ్గరగా మసలడం ఇదే మొదలు. అందుకని మైఖేల్ ప్రతి చేష్టా అబ్బురంగానే తోచేది. వీకెండ్స్ వస్తే నిర్మొహమాటంగా ఫిలిప్స్‌తో చెప్పేవాడు నేనూ మీతో వస్తానని.

లూసీ నవ్వేది. "వాళ్ళతో నువ్వెందుకు? నీలిమతోనో నాతోనో రావాలి కాని" అనేది.

"ఏంలేదు. వాళ్ళు వాళ్ళ గొడవలో మైఖేల్‌ని మరిచిపోతేనో? అందుకని నేను వాళ్ళతోపాటు వెళ్ళి మైఖేల్‌కి మాత్రమే కంపెనీ ఇస్తాను" అంటాడు కార్తీక్.

"దానిబదులు మైఖేల్‌ని నీ దగ్గర బేబీ సిట్టింగ్‌కి వదిలివెళ్ళడం మంచిదని చెబుతానుండు" అనేది నీలిమ.

"అది మరీ మంచిది" అని కార్తీక్ అంటే,

"భలేవాడివి. వాడు వాళ్ళ అమ్మానాన్నలను మిస్ అవుతాడు. అయినా నువ్వేమైనా చిన్నపిల్లాడిషః? పెళ్ళి చేసుకో. నీ పిల్లలతోనే ఆడుకోవచ్చు" అంటుంది లూసీ.

"అమ్మో! పెళ్ళీ బాధ్యతా వేరు. ఇలా చిన్నపిల్లలను ఎంటర్‌టైన్ చేయడం వేరూ' ' అంటాడు కార్తీక్.

అందరికీ మైఖేల్ అంటే ముద్దు. వాడితో ఆడుకోవాలని కోరుకుంటారు. కానీ వారానికి ఒకరు తీసుకువెళ్ళడం కంటే, అందరమూ కలిసే వాడితో ప్రోగ్రాం పెట్టుకుందాం అని నిర్ధారణకు వచ్చారు. ఆ విధంగా ఫిషింగ్‌కి వెళ్ళారు ఒక వీకెండ్‌లో. ఇక మైక్‌ని పట్టడం ఎవరితరమూ కాదు. నేనే ఫిషింగ్ చేస్తానంటాడు. అంతుకుముందే చచ్చిపోయిన ఫిష్‌లు ఒడ్డుకి కొట్టుకువస్తే జాగ్రత్తగా ఏరి, వాటిని జిప్ లాక్ బ్యాగ్‌లో వేసి ఈరోజు డిన్నర్ రెడీ అంటాడు. చీకటిపడుతోంది. పోదామంటే రానేరాడు. ఈ బ్యాగ్‌ఫుల్ అవలేదు. బిగ్ ఫిష్‌ని పట్టాలి అంటాడు. చిన్నపిల్లలుంటే ఎంత సందడి, సంతోషం. అమ్మానాన్నలతో నా బంగారు బాల్యాన్ని కోల్పోయాను అనుకుంటాడు కార్తీక్.

రాకేష్ ఈమధ్య ఫ్యామిలీ మెంబర్స్‌కి దూరంగా వుంటున్నాడు.

"ఏం రాకీ... ఏం చేద్దామనుకుంటున్నావ్? " అడిగాడు ఓరోజు జయచంద్ర.




"మన కంపెనీకి, లూసీ కంపెనీకి నేను అన్‌ఫిట్ కదా? వేరే కంపెనీల ఆడిట్స్ చూస్తున్నాను. చాలాకాలంగా ఇక్కడే వుండడం బోర్‌గా అనిపిస్తోంది. కెంటకీ వెడతాను" అన్నాడు.

అసలు విషయం జయచంద్రకి అర్థం కాకపోలేదు. 'వీడు కార్తీక్‌కి, ఇంటికీ దూరంగా పోవాలనుకుంటున్నాడు' అనుకుని "నీ ఇష్టం" అన్నాడు.

సుచిత్రతో ఈ విషయం చెప్పినప్పుడు నీలిమ విని, "వాడికి హార్స్‌రైడింగ్ అంటే ఇష్టం. కెంటకీలో క్లబ్ వుందిగా. ఆ సరదా కూడా తీరుతుందని ప్లాన్ చేసి వుంటాడు అమ్మా" అంది.

"కారణం ఏదైతేనేంలేం. అన్నీ చూడాలి కదా మరి. వెళ్ళనీ" అంది సుచిత్ర.

"మనం వద్దన్నా మానడులే. ఎప్పట్నించో ప్లాన్ చేస్తున్నాడు" అంది నీలిమ.

జనార్ధంనుంచి ఉత్తరం వచ్చింది.

"జయా! కార్తీక్ లూసీతోపాటు అక్కడికి వెళ్ళాక ఒకసారి ఫోన్ చేశాడు. మళ్ళీ ఏ కబురూ తెలియలేదు. అంతా బాగున్నారనుకుంటాను, రెండేళ్ళు గడిచిపోయింది. లూసీ కంపెనీలోనే వున్నాడో నీ దగ్గిరకి వచ్చాడో తెలియలేదు. అయినా వాడి గురించి ఎన్నడూ బాధపడాల్సిన అవసరం లేదు. ఎక్కడైనా షైన్ అవుతాడని నాకు తెలుసు కాని ఎలా జీవితంలో స్థిరపడతాడన్నదే మనకు తెలియవల్సింది.

వాడు పుట్టగానే తల్లికి దూరమయ్యాడు. తండ్రి గురించి తెలిసే అవకాశం లేదు. ఒకవేళ తెలిసినా, తండ్రీకొడుకులు కలిసినా ఏ అనుబంధాలు వుంటాయి. అదంతా ఒక జరిగిపోయిన కల. తాతా, అమ్మమ్మ ప్రేమ తప్ప ఎరుగని అభాగ్యుడు. వాణ్ణి జీవితాంతం సుఖపెట్టగల మంచి బుద్ధిమంతురాలు భార్య కావాలని నా ఆశ. ఆ ఆశ తీరుతుందో లేదో. ఇదొక్కటే నా కోరిక. ఆ భార్య మనదేశం అమ్మాయా? విదేశీయురాలా అనేది తెలియదు. ఇప్పటిమటుక్కి సూచనలు ఏమైనా కనిపిస్తున్నాయా? వాడి పెళ్ళి కూడా చూడాలని ఆశగా వుంది. జానకి నా చాదస్తానికి నవ్వుతూంటుంది.

మన దగ్గిర పుట్టి పెరిగిన పిల్లలే ఎలా వుంటారో, ఎవర్ని పెళ్ళి చేసుకుంటారో తెలియదు. ఎక్కడో దూరపు బంధుత్వంగల అనుబంధం లేని కార్తీక్ గురించి పగటికలలు కంటున్నావా? " అంటుంది. జానకి చెప్పింది నిజమే! కానీ మనిషి ఆశాజీవి. మనం ప్రేమించే వ్యక్తులు మనకి ఆనందం కలిగిస్తారని నమ్ముతూ వుంటారు. ఇదీ అలాటిదే! ఇంకా జానకి అంటుందీ... కార్తీక్‌కి మంచి భార్య రావాలి. ఓ కొడుకు పుట్టాలి. వాడితో ఆడుకోవాలీ? " అని. నిజమేరా జయా! ఆశాజీవేకాదు, ఏవేవో చూడాలంటూ కోరికలు కోరుతూ వుంటాడు తప్ప 'నా ధర్మం నేను నిర్వర్తించాను. ఇక భగవంతుడి పిలుపుకోసం ఎదురుచూస్తాను' అనేవాడు చాలా తక్కువ. ఇక నేను కూడా నా కోరికలకు కళ్ళెంవేసి ఎవరూ నా వలన కష్టపడకుండా, నాకు ఎవరివలనా బాధ కలగకుండా జీవితానికి ముగింపు పలికితే చాలని అనుకోవడం మంచిది.

ఉద్యోగాలూ, బాధ్యతలూ పెరిగి మీరు ఇండియా రావడం తగ్గించారు. అందుకు మిమ్మల్ని తప్పు పట్టను. అది సహజం. అందరి విద్యుక్తధర్మం కూడాను. నందిత, భర్త, కొడుకూ ప్రొఫెసర్ డేవిడ్ అందరూ బాగున్నారనీ తలుస్తాను. అడిగానని చెప్పు. మైక్‌కి ఆశ్శీస్సులు. ఇందులోనే కార్తీక్‌కి ఒక ఉత్తరం రాశాను. ఇయ్యి. సుచిత్ర, నీలిమ, రాకేష్‌లకు ఆశీస్సులు."

కార్తీక్ ఉత్తరాన్ని తనే తీసుకువెళ్ళి ఇచ్చాడు జయచంద్ర. ఆ ఉత్తరాన్ని వెంటనే చదువుకుని, "జనార్ధనంగారికి ఈమధ్య ఉత్తరం రాయలేదు. నిజమే! చాలా ఆలస్యం అయిపోయింది" అన్నాడు సంజా

యిషీగా.

"ఇవన్నీ మామూలే! మరచిపోవడం కాదుకానీ, ఏదో బిజీ! ఇంతకీ బాబాయి త్వరలో నీపెళ్ళి చూడాలనుందంటున్నాడు. ఎవరైనా అమ్మాయిని సెలక్ట్ చేసుకున్నావా?" అడిగాడు జయచంద్ర.

"నేనింకా ఆ విషయం గురించి ఆలోచించలేదండీ" అన్నాడు.

"ఇకమీద ఆలోచించమనే బాబాయి ఈ ఉత్తరం రాయడంలో అర్థం"

"ఔనండీ! అదే రాశారు నాక్కూడా! పెళ్ళి అవసరం అంటారా?" కార్తీక్ చిన్నపిల్లాడిలా అడిగాడు.

"భలేవాడివే! పెళ్ళి అవసరమా? జీవించడం అవసరమా? ఉద్యోగం అవసరమా? భోజనం అవసరమా? అంటే ఏం చెబుతామయ్యా కార్తీక్? మనం చదువుకున్నది ఎందుకు? బతుకుతెరువు చూసుకోవడానికి. తిండి, బట్టా, నివాసానికి ఇల్లు. ఇవన్నీ కావాలి కదా? ఇవి ఎవరూ మనకి కూర్చోబెట్టి ఇవ్వరు కదా? మన కష్టానికి తగిన ఫలం జీతం రూపేణా ఇస్తారు. వాటితో జీవితావసరాలు ఏర్పరచుకుంటాం. అలాటిదే పెళ్ళీనూ" అన్నాడు జయచంద్ర.

"పెళ్ళి చేసుకోవాలని ఎప్పుడు అనిపిస్తుందంటారు?"

"నువ్వు ఇంటర్వ్యూ చేస్తున్నావో, మనస్తత్వ శాస్త్రంమీద రీసెర్చి చేస్తున్నావో తెలియదుకానీ, ఇల్లు, తిండి, బట్టాలాగే శారీరక అవసరమూ సహజమే కనుక తోడుకావాలని అనిపించినప్పుడు, ఏదైనా బాధ, కష్టం, సుఖం పంచుకోవాలన్నప్పుడు సేదదీర్చేది ఒక్క భార్య తప్ప జీవితకాలం వుండేది ఎవరు? అటువంటి సమయంలో పెళ్ళి చేసుకోవాలనిపించడం సహజం" తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు జయచంద్ర.

"వీటన్నిటికన్నా ముఖ్యమైనది మరొకటి మీ ఊహకు అందలేదు జయచంద్రగారూ"

"ఏమిటిది?"

"ఒకమ్మాయిని చాలా కాలంగా పరిశీలించినప్పుడు కలిగే ఆలోచన"

"కరక్ట్‌గా చెప్పావు కార్తీక్. నిజంగానే నా ఊహకు అందలేదు. అటువంటి అమ్మాయి కనబడలేదా?"

"లేదు. కనిపించిన రోజున తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను"

కార్తీక్ సమాధానానికి హతాశుడయ్యాడు జయచంద్ర.

"సరే! అలాగేకానీ. కంపెనీ ఎలా వుంది? లూసీ ఏమంటుంది?"

"నాతో కంటే కంపెనీ విషయాలు మీతోనే చర్చిస్తుంది లూసీ. అయితే నా అభిప్రాయం చెప్పమంటే చెబుతాను. మీరు కోపగించుకోవద్దు. మీ కంపెనీకి పోటీగానే నడుస్తోంది"

ఊహించని కార్తీక్ సమాధానానికి క్షణంసేపు విచలితుడయ్యాడు జయచంద్ర. అంతలోనే సర్దుకుని, "కంగ్రాచ్యులేషన్స్! ఇదంతా నువ్వు అడుగుపెట్టినవేళా విశేషం. ఇండియా కంపెనీ విషయం?"

"అదంతా అభిరామ్, శశికాంత్‌లమీద డిపెండయివుంది. మేం అంతగా ఇంట్రస్ట్ చూపించడంలేదు. అయితే మరీ పూర్‌గా ఏమీలేదు" అన్నాడు కార్తీక్.

జయచంద్ర ఇంటికి తిరిగివస్తూ దార్లో ఒకటే టెన్షన్ పడసాగాడు. 'ఏమన్నాడు కార్తీక్? మీ కంపెనీకి పోటీగా బాగానే నడుస్తోంది అని. అంటే లూసీ నాకు పోటీగా కార్తీక్‌ని తీసుకువచ్చిందా? ఏం... ఎందుకు కాకూడదూ? ఆ అమ్మాయి అమెరికన్. తను ఎంత సిటిజన్ అయినా ఇండియన్. నామీద పోటీగా కార్తీక్‌ని తీసుకువచ్చిందీ... అంటే ఇండియన్‌కి ఇండియన్‌ని పోటీగా పెట్టి, ఒక అమెరికన్ విజయం సాధించింది. తనెంత ఫూల్! ఈ విషయాన్ని గ్రహించుకోలేదు. నేను జారవిడిచిన రత్నాన్ని లూసీ సానబెట్టి, తన కీర్తి కిరీటంలో అలంకరించుకుంది. భద్రపరచు




కుంది. అందుకే కోటి వెలుగులు విరజిమ్మే ఆ రత్నం ముందు, నేను ధరించిన కిరీటం వెలవెలబోతోంది. ఈ విషయాన్ని నేనెలా మరచిపోయాను?" ఆలోచనల్లో ఎప్పుడు యాంత్రికంగా ఇంటికి చేరాడో అతనికే తెలి యదు. ఇంటికి చేరేసరికి సుచిత్రలేదు. చిన్న స్లిప్ రాసిపెట్టి నందిత ఇంటికి వెళ్లింది. బుర్ర వేడి తగ్గించుకోవడానికి షవర్ కింద గంటసేపు స్నానంచేశాడు. ఫ్రిజ్‌లోనుంచి బీర్ కాన్ తీసుకుని తాగసా గాడు. ఇప్పుడు ఏంచేయాలో తోచకుండా వుందతనికి. 'ఏదో యధాలాపంగా కార్తీక్‌ని అడిగితే బైటపడింది ఈ విషయం తప్ప, ఎప్పుడూ నేను ఊహించనేలేదు. ఒక్క చిన్న పొరబాటు కంపెనీ పునాదుల్ని కది లించివేస్తోంది. సుచిత్ర వస్తేకానీ ఆమెతో ఈ బాధను పంచుకుంటేతప్ప కానీ తీరదు' అనుకుని నందిత ఇంటికి ఫోన్‌చేశాడు.

"హలో డాడ్... అప్పుడే మామ్‌ని మిస్ చేశారా? ఉదయం వస్తుంది డాడ్" అంది అటునుంచి నందిత.

"లేదు నందూ! ఇప్పుడే పంపించెయ్. పనుంది. నా పేపర్స్ కొన్ని మామ్‌ని దాచి పెట్టమన్నాను. ఇప్పుడు వాటిని చూడాలి. సారీ... ప్లీజ్"

"ఓకే డాడ్, గుడ్ నైట్" అంటూ ఫోన్ పెట్టేసింది నందిత. మరో గంటన్నరకి సుచిత్ర కంగారుగా ఇంటికి వచ్చేసింది. ఎందుకంటే అతను చెప్పిన పేపర్స్ విషయం నిజంకాదు. నందితకి తెలియకూ డదని ఏదో చెప్పాడంతే. ఈ విషయం గ్రహించిన సుచిత్ర తనూ టెన్షన్‌తోనే వచ్చింది. వస్తూనే భర్త వుండే బెడ్‌రూం లోకి పరుగున వెళ్లింది. బెడ్‌మీద అసహ నంగా దొర్లుతున్నాడు జయచంద్ర.

చప్పున అతణ్ని ఒడిలోకి లాక్కుని, సేద తీరుస్తూ, "వాట్ డియర్? ఎనీ ప్రాబ్లమ్?" అడిగింది లాలనగా.

అతను జరిగినదంతా వివరించాడు.

"డియర్, అయితే ఏమైంది. లూసీ కాకుంటే మరో జూలీ, మార్గరెట్. ఎందరో పోటీదార్లు వుండవచ్చు దీనికి ఇంతగా టెన్షన్ పడిపోవడం నీలాటి అనుభవంగల వాడికి అవసరమా? ఎంత మాత్రమూ కాదు. ఆలోచించి చాకచక్యంగా సాల్వ్ చేద్దాం. రిలాక్స్ ప్లీజ్" అంటూ అతణ్ని ఓదార్చింది.

ఎన్ని ఐస్‌క్యూబ్‌లు నెత్తిమీద గుమ్మరించినా, తగ్గని వేడి సుచిత్ర ఒడిలో, ఆమెచేతి స్పర్శలో లభించి, అతడిలోని టెన్షన్‌కి అడ్డు కట్ట వేసింది. 'కార్తీక్... ఇదేనోయ్ నేను చెప్పింది. అది చెప్పడంలో తెలియదు. అనుభవంలోనే తెలిసేది. ఇప్పుడు నువ్వు ఏ కబురు చెప్పినా సిద్ధంగా వున్నాను. నాకేంకాదు' అనుకుని,

"చిత్రా! నిజమే ఎందరో పోటీదార్లు నాకు ఎదురు అవుతుంటారు. నేను ఒక్కణ్ణే ఎదు ర్కోవలసి రావడం కొంచెం కష్టమే! నన్ను ఓదార్చడానికి నువ్వు వున్నావు. కానీ, నాకు కావలసింది వారసుడు. మన కంపెనీని మరింత పటిష్టంగా నిలబెట్టగల వారసుడు. అతనెవరు? ఎక్కడుంటాడు? వెదకాలి" అన్నాడు.

"రాకేష్ నా తర్వాత వారసుడు అవుతా డని మొదట్లో భావించాను. కానీ వాడు అందుకు అర్హుడుకాదు. ఈ విషయం తెలిస్తే వాడు బాధపడచ్చు. కన్నతండ్రే కొడుకుని అనర్హుడు అంటే ఎవరైనా ఫీలవు తారు. కాని చెప్పకతప్పదుగా. అందుకే వాడు ఎక్కడికి వెడతానన్నా కాదనలేదు. ఇక ఒక్కటే ఆశ! నీలిమ, నీలిమ భర్త వీళ్ళి ద్దరిమీదనే నా ఆశ. నీలిమ ఇప్పటికి ఒక నిర్ణయానికి రాలేదు. నేను మరో ఇరవై సంవత్సరాలు చూసుకో గలిగినా, ఇప్ప ట్నించే కంపెనీ బాధ్యత చేపట్టగల అర్హుణ్ణి తయారుచేయాలి. చేజేతులా కార్తీక్‌ని వదు లుకున్నాను. జనార్ధనం బాబాయి రాసిన ఉత్తరాన్ని సరిగా చదవకుండా పెద్ద పొర



బాటు చేశాను. ఆరోజు అది చాలా చిన్న పొరబాటు. కానీ ఇప్పుడు ఎంతటి మూల్యాన్ని చెల్లించాల్సి వచ్చిందో చూశావా? ఆ కారణంగా లూసీ కార్తీక్‌ని సునాయాసంగా తీసుకు రాగలిగింది" మళ్ళీ అదే విషయాన్ని తల్చుకుని బాధపడ్డాడు జయచంద్ర.

"ఆ విషయం వదిలెయ్ డియర్. మన అమ్మాయి వుండగా వేరే ఎవరికోసమో విచారించడం వృథా" అంటూ చాలాసేపు అతడి మనసును శాంతింపచేయాలని చూసింది, సుచిత్ర.

తర్వాత ఓరోజు నీలిమతో చెప్పింది. "నీలూ! డాడ్ చాలా బాధపడుతున్నారు, కంపెనీ గురించిన వర్రీతో" అంది.

"ఎందుకు అమ్మా అంత వర్రీ కావడం? నేను ఎక్స్‌పీరియన్స్‌కోసం లూసీ కంపెనీలో వున్నాను తప్పితే, మనకంటే ఎక్కువకాదు కదా? ఈ క్షణంలో వచ్చేయమంటే వచ్చేస్తాను" అంది నీలిమ.

"అసలు విషయం అదికాదు నీలూ! నువ్వు పెళ్ళిచేసుకుని అతనూ, నువ్వు కలిసి మన కంపెనీ కోసం పాటు పడాలనేది నాన్నగారి ఆశ. మరి నువ్వేమో పెళ్ళి గురించే ఆలోచించడంలేదు" సమయం చూసి చెప్పింది సుచిత్ర.

"అమ్మా! నాకూ ఇలాగే వుండిపోదామనే ఆలోచన లేదు. పెళ్ళి గురించి ఆలోచిస్తూనే వున్నాను" అంది నీలిమ.

కూతురు నోరారా అమ్మా, నాన్న అని తెలుగులో చెబుతుంటే ఏదో సన్నిహితంగా తోచింది సుచిత్రకి.

"అయితే ఇండియన్ అనుకుంటున్నావా, అమెరికన్ అనుకుంటున్నావా? " తల్లి ఆత్రంచూసి నవ్వుకుంది నీలిమ. 'వీళ్ళిద్దరికి నేను ఇండియన్ అబ్బాయినే పెళ్ళిచేసుకోవాలని వున్నట్టుంది. స్వేచ్ఛ ఇచ్చీ, ఏవిషయంలోనూ శాశించకుండా పెంచీ, మరోమూల ఇండియన్ అల్లుడి గురించే ఆలోచిస్తున్నారా? అనుకుంది.

"నిజానికి ఇతమిద్ధంగా ఫలానా అబ్బాయి అయితే బాగుండును అని అనుకోను. అన్నీ కలసివస్తే ఎవరైనా బాధలేదు" అంది తన అభిప్రాయాన్ని తెలియచేస్తూ.

"ముందు మీనాన్న బెంగతీరే మార్గం చూడుమరి, ఒకటే టెన్షన్ పడిపోతున్నారు" అంది సుచిత్ర.

"నాన్నగారు టెన్షన్ పడేది కంపెనీకి పనికివచ్చే అల్లుడి గురించి కదా? అలాగే ఈ విషయం నా దృష్టిలో వుంచుకుని నేను భర్తను ఎన్నుకుంటాను. మరి ఫిలిప్స్ గురించి ఎందుకు అనుకోలేదు" అడిగింది నీలిమ.

"ఫిలిప్స్‌కి కుటుంబ సభ్యులు చాలామంది వున్నారు. అదీకాక అతడు డాక్టర్ కనుక కంపెనీ చూసే ప్రసక్తేలేదు. ఇంత చిన్న విషయం నీకు స్ఫురించలేదా నీలూ? " ఆశ్చర్యంగా అడిగింది సుచిత్ర.

"అదికాదు, నందిత పెళ్ళికి ముందు పెద్దల్లుడి గురించి డాడ్ ఎందుకు ఆశపడలేదా అనేది నా సందేహం" నీలిమ వివరంగా చెప్పింది.

"బహుశాః కార్తీక్ అప్పుడు తటస్థపడకపోవడం వలన, అయిదు సంవత్సరాలు క్రితం కంపెనీ వారసత్వం గురించి ఆలోచన రాకపోవడమూ అయి వుంటుంది" చెప్పింది సుచిత్ర.

"అవును నిజమే! కార్తీక్ గురించి వినడమే తప్ప, అతణ్ని చూసివుంటే ఏం జరిగేదో మరి? ఇకనుంచీ ఈ విషయం సీరియస్‌గా తీసుకుంటాను మామ్" అది నీలిమ.

★ ★ ★

లూసీ, నీలిమ ఆరోజు కంపెనీలో తీరిక లభించిన కారణంగా ఏవో కబుర్లలో పడ్డారు.

"లూసీ మా డాడ్‌కి కంపెనీ వారసుడు ఎవరు లభిస్తారా అనే వర్రీ మొదలైంది"





యధాలాపంగా చెప్పింది నీలిమ.

"రాకేష్ వున్నాడు కదా" అంది లూసీ.

"వాడా? నీకు తెలుసుకదా? డాడ్‌కి వాడిమీద నమ్మకం లేదు. వుంటే వుంటాడు కానీ, మేనేజింగ్ బాధ్యత మాత్రం అప్పగించరు. నేనూ, నా భర్తా చూసుకోవాలట. అంటే నా భర్త కంపెనీకి ఉపయోగపడేటటువంటివాడై వుండాలన్నమాట. నీకు తెలిసినవాడు ఎవరైనా వుంటే పరిచయం చేద్దూ" అంది సరదాగా నీలిమ.

"ఎవరో ఎందుకు? కార్తీక్ వున్నాడుగా? మీ ఇండియన్? "

సరదాగా అందో, నిజంగా చెప్పిందో తెలియదుకానీ అంది లూసి.

"అంటే నా భర్తగానా? కంపెనీ మేనేజర్‌గానా? " అడిగింది నీలిమ.

"నీ భర్తగానే...! ఆ తర్వాత ఆటోమాటిక్‌గా కంపెనీ మేనేజర్ అవుతాడు కదా? " చెప్పింది లూసీ.

"కార్తీక్‌ని నీ కంపెనీనుంచి విడుదల చేస్తావా? " అడిగింది నీలిమ.

"ఏం నేను ఏమైనా అరెస్ట్‌చేశానా? "

"అరెస్ట్ అని కాదు, కోరి ఇండియా నుంచి తెచ్చినదానివి నువ్వు కదా అని అన్నాను"

"అయినంతమాత్రాన అతడి ఫ్యూచర్‌ని పాడుచేయనుకదా? అతనిష్టం. మరో కంపెనీకి మారచ్చు ఎవరినైనా పెళ్ళిచేసుకోనూ వచ్చు" వాళ్ళిద్దరికీ తెలియకుండానే సంభాషణ పెళ్ళి దగ్గిరకి వచ్చేసింది.

"లూసీ నా మాట సరే! నువ్వు పెళ్ళి చేసుకోవా? "

"కార్తీక్‌నా? తప్పకుండా చేసుకుంటాను. అతడు నన్ను కోరితే"

పెళ్లి అంటే కార్తీక్‌ని అని నీలిమ అనుకోలేదు. కానీ లూసీ బయటపడింది. అమెరికన్స్‌కి వయసు తేడా అంత పట్టింపులేదు. లూసీ కార్తీక్‌ని ఇష్టపడుతోందా?. మరి అటువంటపుడు నన్నే అతడ్ని చేసుకోమని సలహా ఎలా చెప్పింది? ఈ తిరకాసు ఏమిటో నీలిమకి అర్థకాలేదు.

"అదికాదు లూసీ. నువ్వు కార్తీక్‌ని లైక్ చేస్తున్నావా? స్ట్రెయిట్‌గా అడుగుతున్నాను. చెప్పు" అంది.

"నేను చెప్పానుగా? అతను నన్ను కోరితే పెళ్ళికి అభ్యంతరం లేదని. అభిరామ్‌కి భిన్నంగా వుంది కార్తీక్ మనస్తత్వం" చెప్పింది లూసీ.

"ఇండియన్స్ అయినంతమాత్రాన అందరూ ఒకేలా ఎందుకుంటారు లూసీ? మీ ఇద్దరి పరిచయం ఎలాటిదో మరి, నాకు తెలియదు" అంది నీలిమ.

'అవును మా ఇద్దరి పరిచయం ఎటువంటిది? ఒక యజమాని, సర్వెంట్ లాటిది. అధికారి, కింది ఉద్యోగి స్థాయికి చెందినది. తప్పితే, జీవిత భాగస్వామ్యానికి చెందినదా? లవర్స్‌కి చెందినదా? టీనేజర్స్‌కి సంబంధించిన డేటింగ్ వంటిదా? కాదు. వీటన్నిటికీ అతీతమైనది. హుందాగా, డిసిప్లెన్‌గా వుండేటటువంటిది' అనుకుంది మనసులో లూసీ.

లూసీని ఆలోచనల్లో విడిచి, సాయంకాలం ఇంటికి బయలుదేరింది నీలిమ. కారు పార్కింగ్ ప్లేస్‌లో కార్తీక్ కారు స్నోలో ఇరుక్కుపోయి మొరాయించింది. కదలలేదు. అరగంటనుంచీ కుస్తీపడి చివరికి, నీలిమను చూసి, "నీలిమా కారు ట్రబులిచ్చింది. మెకానిక్‌ని తీసుకురావాలి. గివ్ మీ లిఫ్ట్ ప్లీజ్" అన్నాడు.

"ష్యూర్" అంటూ డోర్ ఓపెన్ చేసింది నీలిమ. కార్తీక్ మెకానిక్‌కి ఫోన్‌చేసి ఏరియా చెప్పి నీలిమతోపాటు ఇంటికి వెళ్ళాడు.

"ఎటూ డిన్నర్‌టైమ్ అయింది. వుండిపో కార్తీక్" అన్నాడు జయచంద్ర.

డిన్నర్ తర్వాత ఆ కబురూ, ఈ కబురూ చెబుతుండిపోయాడు కార్తీక్. "చాలారోజుల తర్వాత వచ్చావు. జనార్ధనం బాబాయ్‌కి ఫోన్ చేశావా ఈమధ్య? ఏమిటి ఇండియా

విశేషాలూ? " అడిగాడు జయచంద్ర.

"చేశాను సర్. అంతా బాగానే వుంది అన్నారు. మీ గురించి అడిగారు" చెప్పాడు కార్తీక్.

"అవునోయ్ కార్తీక్ నేనూ మాట్లాడి చాలా కాలమైంది. పెద్దవాడు కదా? పిల్లల పెళ్ళిళ్ళ గురించి అడుగుతాడు. నువ్వు చూశావుగా. ఇక్కడి పిల్లలూ, లైఫ్ పెళ్ళి గురించి. పేరెంట్స్ చెప్పేది వుండదనీ, పిల్లలు నిర్ణయించుకున్నాక పెద్దరికం చేయడం తప్పితే, ఏమీ వుండదని! ఆయనకీ తెలుసు. అయినా ఆత్రం. నీలిమ, రాకేష్‌ల గురించి చెప్పాను కనుక అడగరు. నీ గురించి మాత్రం ఏదో ఆశ పడుతున్నాడు బాబాయ్. దానికి సమాధానం నువ్వే చెప్పాలి. నేను చెప్పేది లేదు అందుకే నేను కాల్ చెయ్యలేదు. నువ్వు ఇండియా వెళ్ళి, ఆయన ఎదుట పెళ్ళిచేసుకోవాలనీ, అది కాక పోతే ఇండియన్ అమ్మాయి అయినా, ఏ అమ్మాయి అయినా ఇక్కడకు వచ్చి,



చూడాలనీ ఆయన కోరిక" అన్నాడు జయచంద్ర.

కార్తీక్ ఏమీ మాట్లాడలేదు.

జయచంద్ర అడిగాడు "మరి నీ అభిప్రాయం ఏమిటీ? నువ్వు ఈ దేశం వచ్చి రెండు సంవత్సరాలు దాటింది. అమ్మాయిలూ, అబ్బాయిలూ ఎలా వుంటారో తెలుసుకున్నావు. నీకు ఏ అమ్మాయి తటస్థపడలేదా? అదే భార్య కావలసిన అమ్మాయి" అన్నాడు.

"చాలామంది తటస్థపడకపోలేదు. పరిచయాలూ వున్నాయి. నా దేశమూ పరాయి దేశమా అనే తేడాలేదు. కానీ నేను ఇంటి భోజనాన్ని ఎక్కువ ఇష్టపడతానుకాబట్టి వంట నేనే చేసుకుంటాను. ఇక్కడ ఏ అమ్మాయిని చేసుకున్నా నేనే వంటను కంటిన్యూ చేయాలి తప్ప నాకోసం గుత్తివంకాయ కూర, ఆంధ్రా పనసపొట్టు కూర ఎవరూ చేసిపెట్టరు" అన్నాడు.

"అంటే ఇంతకీ నీకు పనసకాయ కూర చేయగల అమ్మాయి భార్యగా రావాలన్న మాట" నీలిమ హాస్యంగా అంది.

"అంటే అర్థం చాలావరకూ బోధపడింది. ఇండియన్, ఆంధ్రా, ప్యూర్ వెజిటేరియన్ వంటచేసే అమ్మాయి కనిపించినప్పుడు పెళ్ళి చేసుకోవాలని కార్తీక్ అనుకుంటున్నాడు" సుచిత్ర అంది.

"అయితే ఇకనేం ఇండియా ప్రయాణం అవ్వచ్చు. జనార్ధనం బాబాయితో చెప్పావంటే నిముషాల్లో అలాటి అమ్మాయిని సెలక్ట్ చేస్తాడు" అన్నాడు జయచంద్ర.

"అయితే ఒక ఇబ్బంది వచ్చింది..." మెల్లిగా అన్నాడు కార్తీక్.

"ఏమిటదీ? " జయచంద్రా, సుచిత్రా ఒకేసారి అడిగారు.

"లూసీ నన్ను పెళ్ళిచేసుకోమని అడిగింది" చెప్పాడు కార్తీక్.

"వ్వాట్!" సుచిత్రా, జయచంద్రా మళ్ళీ ఒకేసారి నోరు తెరిచి ఆశ్చర్యపోయారు.

"ఏం ఎందుకు ఆశ్చర్యం? లూసీ, కార్తీక్‌కి తగిన అమ్మాయి కాదా? " నీలిమ ఫ్రెండ్ తరఫున చెప్పింది.

"ఎందుక్కాదూ? కార్తీక్‌ని మించిన అమ్మాయి. అదే బాధ" అన్నాడు జయచంద్ర.

"నీ అభిప్రాయం చెప్పవోయ్? నువ్వేమంటావ్? " తొందర చేశాడు జయచంద్ర.

"లూసీ మేమ్ గురించి చెప్పడానికి నేనెంతటి వాణ్ణిసార్? నేను ఈదేశం రాగలిగానంటే, ఈ అనుభవం సంపాదించానంటే ఆవిడవల్లనే కదా? అందుకు జీవితాంతం ఆవిడకు రుణపడి వుంటాను" భక్తిగా అన్నాడు కార్తీక్.

"అది సరే లేవోయ్. నేను పెళ్ళి గురించి అడుగుతున్నాను" అన్నాడు జయచంద్ర.

"అదే సర్, తేల్చుకోలేకుండా వున్నాను. ఒకరకంగా ఈ ప్రపోజల్, లూసీ మేమ్ రుణం తీర్చుకునే అవకాశం. కాని పూర్తిగా ఆవిడకు నచ్చేవిధంగా మసలుకోగలనా అనేది సంశయంగా వుంది. అందుకే టైమ్ కావాలని అడిగాను" అన్నాడు తన మనసులో మాట చెబుతూ కార్తీక్.

"ఇండియా వెళ్ళే ఆలోచన ఏమైనా వుందా? " అడిగింది సుచిత్ర.

"జనార్ధనంగారు ఎదురుచూసే సమాధానం సిద్ధంచేసుకుని వెళ్ళడం మంచిది కదా సుచిత్రగారూ! అదింకా సిద్ధం కాలేదుగా? " అంటూ ఇంటికి వెళ్ళాలని లేచాడు కార్తీక్.

"పద, నేను దిగవిడిచి వస్తాను" అంటూ బయలుదేరాడు జయచంద్ర.

"సమ్మర్ హాలీడేస్‌కి రాకేష్ దగ్గిరకి వెళ్ళాలనుకుంటున్నాం. వస్తావా కార్తీక్? " అడిగాడు అతన్ని ఇంటిదగ్గిర దిగవిడిచిన జయచంద్ర.

"నా రాక రాకేష్‌కి అంత సంతోషించతగ్గ విషయమా" అన్నాడు కార్తీక్.

జయచంద్ర మాట్లాడలేకపోయాడు.




నిజమే తానెంతగా ప్రయత్నించినా రాకేష్‌నీ, కార్తీక్‌నీ కలపడంలో విఫలుడయ్యాడు. మౌనంగా ఇంటికి వచ్చాడు. 'అనవసరంగా నోరు జారానేమో! జయచంద్ర సర్ ఫీలైనట్టున్నారు' అనుకున్నాడు కార్తీక్.

నీలిమ తనూ రాలేనంటే సుచిత్ర, జయచంద్ర వెళ్ళారు.

లూసీ హఠాత్తుగా ఎందుకో ఇండియా వెళ్ళింది. ఎవరికీ చెప్పలేదు.

'ఆమె పర్సనల్ మేటర్ చెప్పాలనేముందీ?' అనుకున్నారు కార్తీక్, నీలిమా.

"కార్తీక్ మా ఇంట్లో అమ్మా, నాన్న కూడా లేరుకదా? నా వంట రుచి చూద్దువుగాని భోజనానికి రాకూడదూ?" పిలిచింది నీలిమ.



"నీ చదువూ అంతా ఇక్కడేనా? స్కూల్ ఫొటోలు చూస్తూ అడిగాడు కార్తీక్.

"ఆ... అంతా ఇక్కడే! మా డాడ్ నేను పుట్టిన తర్వాత ఈ శాండియాగో కదలి వెళ్ళలేదు. ఆయనకు ఈ ప్లేస్ చాలా ఇష్టం. ఆయన చదివిన కాలేజీ, ఇదే కదా? అంతే కాదు మాక్కూడా ఇష్టమే! వారిద్దరి పరిచయం ఇక్కడే జరిగింది. ఇదిగో మామ్ ఫాదర్ వుండే ఇల్లు. ఇప్పుడు వాళ్లెవరూ లేరు. నాకు జ్ఞానం తెలిసేసరికే పోయారు. అందుకని నాకు తెలియదు. మామ్ ఫీలవుతూ వుంటుంది. నందూ అక్కని మాత్రమే చూశారు వాళ్లు. రేపు నందూ అక్క ఇంటికి వెళదామా కార్తీక్? మైక్‌ని చూసి చాలా రోజులైంది. వాడు చాలా బాగుంటాడు కదూ కార్తీక్?" నీలిమ చిన్నపిల్లలా బడబడా వాగేస్తోంది హుషార్‌గా.

"ఆ... వెళదాం... నాకూ చూడాలని వుంది" అన్నాడు కార్తీక్. మర్నాడు వీళ్లిద్దరూ వెళ్లేసరికి నందిత చాలా సంతోషపడింది.

"సమయానికి వచ్చారు. నేను, ఫిలిప్స్ ఒక ఫంక్షన్‌కి వెళ్లాలి. మైక్‌ని మీ ఇంటికి పంపించాలని అనుకుంటున్నాను. ఇంతలో మీరే వచ్చారు" అంది.

"వీడ్ని మేం బైటకు తీసుకువెడతాం. మీరు వెళ్లి, తిరిగి వచ్చేప్పుడు మా ఇంటి నుంచి పికప్ చేసుకోవచ్చు" అంది నీలిమ.

"సరే అయితే తీసుకెళ్లు... సారీ ఫర్ ద ట్రబుల్ కార్తీక్" అంది నందిత.

"విత్ ప్లెజర్. మాక్కూడా ఈరోజు మైక్‌తో గడపాలనిపించింది" అన్నాడు కార్తీక్.

"వీడ్ని తీసుకుని బీచ్‌కి వెడదాం. స్విమ్ సూట్స్ ఎటూ కార్లోనే వున్నాయ్" అంది నీలిమ.

బీచ్‌కి వెళ్లారు. నందిత ఇంట్లో పెద్ద స్విమ్మింగ్ పూల్ వుంది. కాని, ఫిలిప్స్ బంధువులు వచ్చారు. వాళ్లంతా స్విమ్ చేస్తారేమోనని కార్తీక్, నీలిమా బైటకు వచ్చేశారు. నందిత ఎందరు ఇంట్లో వున్నా, మైక్‌ని నీలిమకో, తల్లికో అప్పగిస్తుంది. బంధువులు చాలా కాలానికి వచ్చారు. మైక్ వాళ్లదగ్గర కొత్త ఫీలవ్వచ్చు వాళ్లని ఇబ్బంది పెట్టవచ్చుననే భయంతో ఆ రకం జాగ్రత్త తీసుకుంటుంది.

ఇప్పుడు కార్తీక్‌కి స్విమ్మింగ్ బాగా వచ్చేసింది. ఫ్రీగా స్విమ్ చేస్తాడు. మైక్‌ని జాగ్ర

త్తగా దగ్గిర్నుంచి చూస్తూంటే, నీలిమ కొద్దిగా లోపలికి వెళ్ళింది.

"నీలూ జాగ్రత్త దూరం వెళ్లకు" అంటూ హెచ్చరించాడు కార్తీక్.

నీలూ స్విమ్‌సూట్ వేసుకుని అర్ధనగ్నంగా వున్నా, ఇప్పుడు కార్తీక్ వింతగా అనుకోవడంలేదు. అతనికీ బాగా అలవాటు అయింది. నీలిమ వెనక్కివచ్చి, మైక్‌ని పట్టుకుంటే కార్తీక్ డీప్‌గా వెళ్లాడు. మైక్ నీలిమ చెప్పినట్టు వినడు. చేతుల్లోంచి జారి పోతాడు. ఒక్కడే స్విమ్ చేస్తానంటాడు. నీళ్లు చూస్తే వాడికి చెప్పలేనంత ఆనందం. చాలారోజులుగా బీచ్‌కి వెడదామని వాళ్లమ్మని పోరుతుంటే, తీరిక లేని నందిత ఏదో చెప్పి వూరుకోబెడుతోంది. ఇప్పుడిక ఛాన్స్ దొరికింది. నీలిమను లెక్కచేయక, ఇసుకలో పరుగులు పెట్టడం, ఒక్క వుదుటున నీళ్లలో దూకడం, అల్లరే అల్లరి! వాడి అందమే అందం. అక్క ఫీచర్స్, ఫిలిప్స్ కలర్, పర్సనాలిటీ వచ్చి వీడు పెద్దయ్యాక ఇంకెంత అందంగా వుంటాడో అనుకుంటుంది నీలిమ వాడ్ని చూసి మురిసిపోతూ. మైక్‌ని లాక్కొచ్చి, పాప్‌కార్న్ కొనిచ్చి కూర్చోబెట్టింది. ఇసుకలో బోర్లాపడుకుని మధ్యలో ఒకొక్క కార్న్ తనూ తింటోంది. దూరంగా కార్తీక్ కనిపిస్తున్నాడు. 'వచ్చినప్పుడు కొత్తలో ఆడపిల్ల సుకుమారత్వం, కలిగి, కాస్తపీలగా, బెరుకుగా వుండే కార్తీక్ ఇప్పుడు కొద్దిగా ఒళ్లు చేశాడు. ఒళ్లు చేసిన కారణంగా రంగువచ్చింది. బెరుకుతనం పోయి, స్టైల్‌గా మారేడు. చెప్పుకోతగ్గ అందం కాకపోయినా, ఏదో ఆకర్షణ వుంటుంది ఇతడిలో...' మొదటిసారిగా కార్తీక్ గురించిన ఆలోచనలు వచ్చాయి నీలిమకు.

కనుచీకటి పడుతోంది. దూరాన బిల్డింగ్స్‌లో లైట్లు, నీటిలో ప్రతిబింబంగా కనబడుతూ వింత అందాన్నిస్తున్నాయి. జనం మెల్లగా ఇళ్లకు మళ్లుతున్నారు. కార్తీక్ కూడా వచ్చి మైక్ పక్కన కూలబడ్డాడు "ఇక ఇంటికి వెడదామా మైక్? " అన్నాడు.

"వద్దు. ఇక్కడే వుందాం. నాకిక్కడే బాగుంది" అన్నాడు వాడు.

"నాకూ బాగానే వుంది కానీ" అంటూ పక్కనే వున్న నీలిమను ఓరగా చూశాడు.

"ఆ... కానీ ఆపేశావేం చెప్పు? " అంది నీలిమ, తన అనాచ్ఛాదిత భుజాలనే చూస్తున్న కార్తీక్ ఓరచూపులను పసిగట్టి లేచి కూర్చుంటూ.

"కానీ నందిత గాభరాపడుతుందేమోనని... వెడదాం అంటున్నా" అన్నాడు.

"ఎందుకు గాభరాపడుతుంది? నువ్వేమైనా నన్ను తినేస్తావనా? నేను నిన్ను మైకంలో పడేస్తాననా? డోంట్ వర్రీగై, లెటజ్ ఎంజాయ్" చిలిపిగా ధైర్యంగా చెప్పింది నీలిమ మరింత దగ్గిరగా జరుగుతూ.

ఇటువంటి అవకాశం రావడం ఇదే మొదటిసారి. పైగా ఈ అమ్మాయేమో 'లెటజ్ ఎంజాయ్' అంటూ ప్రోత్సహిస్తోంది. వివశుడైన కార్తీక్ మెల్లగా నీలిమకు దగ్గరగా రాబోయాడు. అంతదాకా ఇసుకలో పడుకున్న మైక్ మధ్యలోనుంచి లేచి కూర్చున్నాడు. అంతే ఇద్దరి పెదవులు మైక్‌కి చెరో ముద్దూ ఒకేసారి ఇచ్చేశాయి. కిలకిలా నవ్వుతూ, రెండుచేతుల్తో చప్పట్లు చరిచాడు మైక్. నవ్వుకుని, ఇసుకలోనుంచి లేచి నిలబడి, శరీరానికి అంటిన ఇసుకను దులుపుకుంటూ మరోసారి దగ్గిరకు రాబోయాడు. ఇదేదో ఆటగా భావించిన మైక్ మధ్యలో దూరి, తనే వాళ్ళ వంటిమీద ఇసుకను దులపసాగాడు. వీడు మనకి బాడీగార్డ్‌లా తయారయ్యాడే అంటూ నీలిమ, మైక్‌ని తీసుకుని కారు దగ్గిరకి చేరుకుంది. అంతదాకా స్త్రీ స్పర్శ ఎరుగని కార్తీక్‌లో వేడి రాజుకోసాగింది.

అతడికి లూసీ తనదరికి చేరాలని చేసిన ప్రయత్నాలు గుర్తువచ్చాయి. అప్పట్లో ఆమె




రికన్ స్త్రీలకు సిగ్గు, మొహమాటం వుండ వనీ, మగవాళ్లకి గాలం వేస్తారనీ అనుకునే వాడు. నేను చాలా జాగ్రత్తగా వుండాలి. ప్రేమించి, ఇష్టపడి, పెళ్ళిచేసుకుని సంసారం చేయడంవేరు. కేవలం స్త్రీ, పురుష ఆకర్ష ణతో సెక్స్ కోరుకోవడం అతడికి నచ్చలేదు.

మరి ఇప్పుడు, 'ఆకర్షణవల్లనే కదా నీలి మను ముద్దు పెట్టుకోవాలనిపించింది? ఇన్నాళ్లూ అవకాశంలేక, బుద్ధుడిలా వుండి పోయానా? అవకాశాలు లభిస్తే నిరభ్యంత రంగా నేనూ, అనుభవాలు కావాలని కోరు కునేవాణ్ణా? నా గురించి నాకే తెలియ లేదా? నాలో నిగ్రహంలేదా? నేను మని షిని, మగవాణ్ణి అంతే కదూ? అందుకేనా జనార్ధనంగారు పెళ్ళి గురించి హెచ్చరిం చారు. పెళ్ళి అనే కట్టుబాటు లేకపోతే ఫ్రీ సెక్స్‌కి అలవాటు పడిపోతారు కాబోలు. ఇప్పుడు నాకూ పెళ్ళి కావాలి. పెళ్ళితో వచ్చే అనుభవం కావాలి తప్ప, పైపై ఆకర్షణలు వద్దు" అనుకున్నాడు.

'అయితే ఆలస్యం దేనికీ నీలిమను చేసుకో' అంది మనసు.

'అలా నాకు బుద్ధిపుట్టగానే పెళ్ళిచేసుకో. అంటే నీలిమ అభిప్రాయం ఏమిటో తెలియ వద్దా? నువ్వొరికే సతాయించకు' అన్నాడు మనసును మందలిస్తూ.

★ ★ ★

ఇంటికి చేరుకున్నాక, నీలిమలో కూడా అలజడి మొదలైంది. 'ఈరోజు ఏమిటిలా అయింది. ఎందరో ఫ్రెండ్స్‌తో చనువుగా వున్నా వారిని తాకినా ఎప్పుడూ ఈ స్పందన కలగలేదు. మనసును కదలించ లేదు. అలజడి కలగలేదు. ఈరోజు కార్తీక్ చూసిన ఒక్కచూపు నా శరీరాన్ని దహించి వేసింది ఏమిటి? కార్తీక్‌లో కూడా మార్పు కనబడింది. అతడూ నన్ను తాకాలని తహ తహలాడాడు. మరి లూసీతో అతడికి ఈ రకమైన అనుభవం వుందా? వుంటే నేను సహించి, కార్తీక్‌ని ఆహ్వానించగలనా? అతన్ని కోరుకోగలనా?' చాలాసేపు కార్తీక్ గురించి ఆలోచిస్తుండిపోయింది.

మర్నాడు మామూలుగా కంపెనీలో కలి శాడు. కానీ కార్తీక్ భోజనానికి ఇంటికి రాలేదు. నీలిమ కూడా ఎందుకు రాలేదని అడగనూ లేదు.

★ ★ ★

జయచంద్రా, సుచిత్రా కెంటకీలో హార్స్ పార్క్ చూశారు. నిలువెత్తు బలమైన గుర్రాలు చేసే విన్యాసాలు చూస్తుంటే టైమ్ తెలియలేదు. అనేక స్టేట్స్‌నుంచి వచ్చిన గుర్రాల యజమానుల్లో మిలియనీర్స్, పెద్ద కంపెనీలవారూ వున్నారు. వాటితో షో నిర్వహించి, పాయింట్లవారీగా ప్రైజ్‌లు ఇస్తారు. హార్స్ రైడింగ్ ఇంట్రస్ట్ వున్న వాళ్లు, చిన్న పెద్దా తేడా లేకుండా వయసు వారీ గుర్రాలతో రైడింగ్ చేస్తుంటారు. అమెరికాలో ప్రతివారికీ ఏదో ఒక క్రీడలో నైపుణ్యం వుంటుంది. ఒక్కరికే చాలా రకాల స్పోర్ట్స్ ఇంట్రస్ట్ వున్న వారూ వున్నారు. అందుకు కారణం సదుపాయాలే! అవకాశం లభిస్తే ఏదో ఒక క్రీడలో నైపుణ్యం సంపాదించవచ్చు. జయచంద్ర ఇక్కడ మరో ప్రపంచం చూస్తున్నాడు. కార్తీక్ వచ్చి వుంటే బాగుండును అనుకు న్నాడు. అతను అనుకున్నట్టే, నీలిమా, కార్తీక్ కలసి వస్తున్నట్టు ఫోన్ చేశారు. అతనికి చాలా సంతోషం అనిపించింది. వాళ్లిద్దరికోసం వేరే హోటల్ రూమ్స్ బుక్ చేసి వుంచాడు. ఇద్దరూ వచ్చి జయచంద్ర, సుచిత్రలతో కలిశారు.

"కార్తీక్, ఇదంతా డిఫరెంట్ వరల్డ్. నువ్వు చూస్తే బాగుండుననిపించింది. విచిత్రం మీరు కూడా వస్తున్నట్టు ఫోన్ చేశారు. ఈ రోజు ఇక్కడే హార్స్‌రైడింగ్ చేయండి. మేం షోలు చూస్తుంటాం. ఆ తర్వాత డైమండ్ కేవ్స్, మమ్మత్ కేవ్స్ ఎయిర్‌ఫోర్స్ మ్యూజియమ్ చూడచ్చు" అన్నాడు జయచంద్ర.

మర్నాడు డైమండ్ కేవ్స్‌కి వెళ్లారు నలుగురూ. 142 సంవత్సరాల చరిత్రగల కేవ్స్ చాలా అందంగా వుంటాయి. రాక్ కలక్షన్ అంటే ఇంట్రస్ట్ వున్నవారికి బెస్ట్‌ప్లేస్ ఇది. ఒకటి, రెండు మైళ్ల లోపలికి లైట్ సాయంతో తీసుకువెడతాడు గైడ్. గైడ్ చెబుతుంటే చూస్తూ వినడం ఒక మంచి అనుభవం.

మూడవ రోజు మమత్‌కేవ్ నేషనల్ పార్క్ విజిట్. ఇదంతా అండర్‌గ్రౌండ్ టూర్. అక్కడ కొన్ని ఖచ్చితమైన రూల్స్ పాటించి తీరాలి.

2 గంటలు, 2 మైళ్ల దూరంలో హిస్టారిక్ టూర్: 130 మెట్లువున్నా ఆ మెట్లు ఎక్కేసరికి భయం కలిగితే వెనక్కి వచ్చేయడం మంచిది. 2 గంటలకన్నా అక్కడ వుండనీయరు.

ఫ్రోజన్ నైగారాటూర్: 2 గంటలు మూడున్నర మైళ్లు. 300 మెట్లు. స్టీప్‌గానూ, నేరోగానూ వుంటాయి. ఇది కూడా ధైర్యం కలవారు చేయగల విజిట్.

ట్రావెర్‌ట్రైన్‌టూర్: 1 గంట, గంటపావు 1/4 మైలు. ఇది ఎవరైనా ఈజీగా చేయచ్చు

గ్రాండ్ ఎవెన్యూ టూర్: 41/2 గంటలు, 4 మైళ్లు. స్టీప్‌గా వుండే 500 మెట్లు. ఇది చాలా కఠినమైనది. మిగిలినవి సునాయాసంగా చేయగలిగినవి ఎన్నో వున్నాయి. డబ్బూ, సరదా, ఉత్సాహం వుండాలేకానీ చూడదగ్గ ప్రదేశాలకు అంతేలేదు అనుకున్నాడు కార్తీక్.

యువతీయువకులైన కార్తీక్, నీలిమా, అలవాటైన జయచంద్ర, సుచిత్రా సునాయాసంగా తిరుగుతూ ఈ ట్రిప్‌ని ఎంజాయ్ చేయగలిగారు.

ఇక చిట్టచివరగా ఒహియో ఎయిర్‌ఫోర్స్ మ్యూజియమ్ చూడాలి అనుకున్నారు, అమెరికాలో ఎయిర్‌ఫోర్స్ మ్యూజియమ్ చాలా పెద్దది. పురాతనమైనది. పది ఎకరాల స్థలంలో మూడు వందల ఎయిర్ క్రాఫ్ట్స్, వేలకొద్దీ మిసైల్స్, విమానసిబ్బంది వ్యక్తిగత దుస్తులు, ఫొటోలు. వారికి సంబంధించిన వస్తువులూ ఎన్నో ఇక్కడ భద్రపరచబడ్డాయి. వరల్డ్‌వార్‌లో వుపయోగించిన విమానాలు, స్పేస్‌సూట్స్, ఫుడ్‌కి సంబంధించిన వివరాలూ, జెట్ కాక్‌పిట్స్, లేటెస్ట్ ఫైటర్ ఇందులో వున్నాయి. వీటిమధ్య విహారం మనలను మరో లోకానికి పరిచయం చేస్తుంది. మనలను మనమే మరచి అందులో లీనమైపోతాం.

కంటికి కనిపించే సౌందర్యంవేరు. ప్రకృతిసిద్ధంగా, కాలానుగుణంగా ఏర్పడే శిలాసదృశమైన సుందర ప్రదేశాల అందంవేరు.

వినోద, విహారయాత్రలు మానసికానందాన్నీ, విజ్ఞానాన్ని కలిగిస్తాయనడంలో సందేహంలేదు. వారంలో అయిదురోజులు కష్టపడి పనిచేసి, సంపాదించే మనీతో శని, ఆదివారాలు జాలీగా గడుపుతారు ఇక్కడ. సంవత్సరంలో ఒకసారి పెద్ద ట్రిప్ వేసుకుని ఎంజాయ్‌చేస్తారు. పనిచేయడంలో ఎంత కష్టపడతారో, ఖర్చు విషయంలోనూ వెనుకాడరు. ఇక్కడ భారతీయుల్లో చాలా మంది వెనక్కి ఇండియా వెళ్లిపోవాలనో, లేదా ఇంటిదగ్గర బాధ్యతల వల్లనో సాధ్యమైనంత మనీ సేవ్ చేసుకుంటారు. నాకు వెనకాల బరువు, బాధ్యతా లేకపోయినా, రేపటి భవిష్యత్ ఎలా వుంటుందో, ఈ ఉద్యోగం, కంపెనీ ఎంత శాశ్వతమో తెలియదు కనుక ఒకపక్క సేవింగ్ కూడా అవసరమే! ఇక్కడ ఉద్యోగాలు దొరకడం, పోవడం రెండూ సులువుగానే జరిగిపోతాయి. మెల్లగా ఇల్లు కొనాలి. పెళ్లీ, పిల్లలూ సంసారం పెరిగితే ఎటూ ఖర్చు పెరుగుతుంది.

"ఏమిటోయ్ కార్తీక్, ఆలోచిస్తున్నావ్? ఈ ట్రిప్ ఎలావుంది?" అంటూ జయచంద్ర పిలవగానే ఆలోచనల్లోంచి బైటపడ్డాడు కార్తీక్. "ఏముంది సర్, మామూలే!

 

ట్రిప్‌కేం చాలా హేపీగా వుంది. ఈదేశం వచ్చిన ప్రయోజనం, భవిష్యత్ ఏమిటా అని ఆలోచిస్తున్నాను సర్! మీరు చెప్పండి మీ అనుభవాలు? మొదట ఇక్కడ స్థిరపడాలనే వచ్చారా? వచ్చిన తర్వాతనే స్థిరపడాలనుకున్నారా? " అడిగాడు కార్తీక్.

"నేను ఇక్కడ స్థిరపడాలనే ఆలోచన మొదటే వుంది కార్తీక్. అందుకు నాకు అవకాశాలు చాలా వచ్చాయి. అప్పట్లో టాలెంట్ వున్నవాడిదే ఫ్యూచరంతా! ఆవిధంగా ఆరోజు మొదలు, ఈరోజు వరకూ, నేను విచారించవలసిన అవసరం ఎన్నడూ రాలేదు. ఇక పెళ్లికూడా ఇక్కడ స్థిరపడిన సుచిత్రతోనే అయిన తర్వాత మరో ఆలోచనే రాలేదు. నావాళ్లంటూ ఇండియాలో మిగలనూ లేదు. బంధుత్వాలంటావా? జీవితం పూర్తిగా బంధువులతోనే గడపలేం కదా! జీవితంలో వారొక భాగం మాత్రమే!" అన్నాడు జయచంద్ర.

"సరిగ్గా నేనుకూడా మీపరిస్థితిలోనే వున్నాను సర్! అంటే కెరియర్ వైజ్ మీరు వచ్చిన నాటి పరిస్థితులంత సుగమం కాదిప్పుడు. ఉద్యోగభద్రత లేదు. పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని, ఉద్యోగాలు చూసుకోవలసిందే! ఇక పెళ్లిగురించి నా ఆలోచన తెగటంలేదు. నాకు చాలా అయోమయంగా వుంది" అన్నాడు కార్తీక్.

"అంతేనయా! ఈ ఏజ్‌కి ఇవి మామూలే! నామాట విని, ఇక్కడ ఎవరూ నీ మనసుకి దగ్గిరగా వచ్చినవారంటూ లేకపోతే, ఇండియాలో జనార్ధనం బాబాయి మీద భారం వెయ్!" అన్నాడు జయచంద్ర.

"ఆయనను కష్టపెట్టడం ఎంతవరకూ న్యాయం సర్? " అన్నాడు కార్తీక్.

"ఏమిటి మీరిద్దరూ మాట్లాడుకునేది? మేం వినచ్చా? " అంది సుచిత్ర అటుగా వచ్చి

"ఎందుకు వినకూడదు? వినచ్చు. అయితే సలహా ఇవ్వు. కార్తీక్ పెళ్లి విషయంలో ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాడట. ఫ్యూచర్ గురించి ఆలోచినలు, ఒంటరితనం అతణ్ణి వేధిస్తున్నట్టు కనిపిస్తోంది" అన్నాడు జయచంద్ర.

"మీరు చెప్పే వుంటారు. నేను కొత్తగా ఇచ్చే సలహా ఏముంది? జాబ్ విషయంలో నాకు తెలియదుకానీ ఒంటరితనానికి మందు పెళ్లేకదా? ఏదైనా సలహా ఇవ్వచ్చు పెళ్లి విషయంలో ఏమని ఇవ్వగలం. మన అమ్మాయివున్నా, మా అమ్మాయిని చేసుకోవయ్యా అన్లేముకదా? అందుకు సిద్ధపడాల్సింది వాళ్లిద్దరూను. మనం కాదు" మాటల ధోరణిలో ఎప్పుడూ లేనిది సుచిత్ర తన మనసులో మాట బైట పెట్టేసింది.

నీలిమ కొద్దిదూరంలో కూర్చుని తల్లి చెప్పిన మాట వింటూనేవుంది. కార్తీక్ కూడా. సుచిత్ర చెప్పిన మాటల గురించి ఆలోచిస్తున్నాడు.

అవును... నేనూ కార్తీక్ ఇష్టపడితే, పెళ్లి చేసుకుంటే డాడ్ సమస్య కూడా తీరిపోతుంది. మరి లూసీ? లూసీ గురించి నేనెందుకు ఆలోచించాలి? నేను కార్తీక్‌ని కోరుకుంటున్నానా? లేదా అనేదే ముఖ్యం. లూసీని కార్తీక్ ఇష్టపడి వుంటే ఇంతకాలం ఎందుకు వూరుకుంటాడు? లూసీ అవకాశం ఇచ్చిందికదా? ఎందుకు తీసుకోలేదు? కార్తీక్ ఒక్కడిదే నిర్ణయం అయినప్పుడు ఎందుకింత ఆలస్యం? అతనికి తల్లీ తండ్రీలేరు. వాళ్లెవరో అడ్డుపడతారనే సమస్యలేదు. లూసీ అమెరికన్ అనీ, కంపెనీ యజమానురాలనీ సందేహిస్తున్నాడా? ఆమెపట్ల ప్రేమలేదా? ప్రేమ వున్నప్పుడు మరే ఆలోచనా రాదు. నామీద ఎటువంటి భావం వుందో బయటపడటంలేదు. అందుకే అతడి సమస్యాతీరదు. నా సమస్యా తీరదు. ఇక మూడో వ్యక్తి రంగ ప్రవేశం చేస్తేనే ఒక పరిష్కారం లభిస్తుంది" ఇలా ఆలోచిస్తోంది నీలిమ.



# ఏరినముత్యాలు

- న్యాయం గెలుస్తుందన్నమాట నిజమే కానీ గెలిచినదంతా న్యాయం కాదు.
  – శ్రీశ్రీ
- మేకల్ని బలి ఇస్తారు కానీ పులుల్ని బలి ఇవ్వరు.
  – డాక్టర్ అంబేద్కర్
- ఆత్మకు మంచి, చెడు అనే గుణాలు లేవు, ఉన్న గుణాలన్నీ మనసుకే.
  – రమణమహర్షి
- భోగముకంటే త్యాగమే ఎక్కువ మధురమైనది.
  – మహాత్మాగాంధీ
- బానిసకు బాధలు ఎక్కువ. స్వతంత్రుడికి బాధ్యతలు ఎక్కువ.
  – మహాత్మాగాంధీ
- అగ్ని చల్లినా, అమృతం కురిసినా, అందాన్నిచ్చినా, ఆనందాన్ని చేకూర్చినా గ్రంథాలే.
  – తిలక్
- నీ ఎద తలుపులన్నీ తెరుచుకుని నీవు ఎదగాలంటే తీరికలేని విధంగా చదవాలి.
  – సినారె
- మానవజాతి పురోగమన యాత్రలో పుస్తకాలు మహత్తర పాత్ర వహిస్తాయి.
  –ముల్క్ రాజ్ ఆనంద్
- సృష్టి రహస్యాన్ని విశదం చేయగల శక్తి తర్కకౌశలానికి లేదు.
  – టాగూర్
- పరాయివాళ్ల దివ్య భవనాల్లో నివసించడంకన్నా స్వంత కుటీరంలో ఉండడమే మేలు.
  – నెహ్రూ
- వినయానికి, చిత్తశుద్ధికి, ఆత్మపరిశోధనకూ సహాయపడగల సాధనమే ప్రార్థన.
  – మహాత్మాగాంధీ
- హృదయసౌందర్యం లేని శరీర సౌందర్యం వ్యర్థం.
  – వివేకానంద
- విజ్ఞానం పెంచుటకు విద్య సాధనం మాత్రమే, విద్య సంపూర్ణ విజ్ఞానం మాత్రం కాదు.
  – ఒక సూక్తి
- తిట్టినా తిరగబడలేని తెలివి జాతికి లేకపోతే, దానిని దేముడుకూడా రక్షించలేడు.
  – మహంతి
- నిర్మల హృదయం లేనివాడు, ఉద్రేకాలని అణుచుకోలేనివాడు విద్యావంతుడు కానేరడు.
  – మహాత్మాగాంధీ

సేకరణ: **షేక్ మహమ్మద్ జానీ బాషా**

"మీకూ పరిచయం అయిన ఎంత కాలానికి పెళ్లి ప్రసక్తి వచ్చింది చెప్పండి" అడిగాడు కార్తీక్.

"సుమారు మూడు సంవత్సరాలు పట్టిందేమో కదూ చిత్రా? " అడిగాడు భార్యని జయచంద్ర.

"చూశారా మరి! మా పరిచయానికి ఇంకా మూడేళ్ల వయసురాలేదుకదా సర్? " అన్నాడు కార్తీక్.

"భలేవాడివి. అందుకా అడిగిందీ? మూడు కాకపోతే అయిదేళ్లు తీసుకో. తొందరపడి తీసుకున్న నిర్ణయాలు శాశ్వితం కాదు" అన్నాడు జయచంద్ర.

"ఆలస్యంగా తీసుకున్న నిర్ణయాలు కూడా ఒకోసారి తప్పిదాలుగా మారతాయి" అంది సుచిత్ర కాజువల్‌గా.

అంతటితో ఆ చర్చకు ఫుల్‌స్టాప్ పడింది.

మళ్లీ రొటీన్ మామూలే! కంపెనీవర్క్, వీకెండ్స్‌లో అందరూ కలవడం లేదా ఎటైనా వెళ్లడం.

★ ★ ★

లూసీ వచ్చాక ఒకసారి ఇండియా వెడదామా అనుకున్నాడు కార్తీక్. జయచంద్రతో చెప్పాడు. "సరే... వెళ్లిరా... నేను బాబాయికి లెటర్ రాసిస్తాను" అంటూ రాసి ఇచ్చాడు.

జనార్ధనం కార్తీక్‌ని చూసి చాలా ఆనందించాడు. "నువ్వింక ఇప్పట్లో వస్తావనుకోలేదు. రావడానికి పనిమాత్రం ఏముందిలే ఎలాగా వచ్చావుకదా పెళ్లి చేసుకుని వెళ్లు. సంబంధాలు చూస్తాను" అన్నాడు.

"మీ ఇష్టం అలాగే చూడండి" అన్నాడు జనార్ధనానికి ఎదురు చెప్పలేక.

జానకి కార్తీక్ వచ్చాడని ఒకటే హైరానపడిపోయింది. పెళ్లి సంబంధాలకోసం తెలుసునన్న వాళ్లందరికీ చెప్పింది. ఇక ఏముంది? ఎడతెరిపిలేకుండా రాసాగారు అమ్మాయిల తండ్రులు. అలా వచ్చినవారిలో నచ్చిన సంబంధాలు ఓ చోట జాగ్రత్త చేసి కార్తీక్‌కి చెప్పడం, అందులో మళ్లీ కొన్నింటిని కార్తీక్ కొట్టివేయడంతో చివరికి రెండు మాత్రం మిగిలాయి.

"ఈ రెండు సంబంధాలు నాకు నచ్చాయి. అమ్మాయిల్ని చూసి ఒకటి ఖాయం చేసుకుందాం" అని జానకితో చెప్పాడు కార్తీక్.

"కార్తీక్! ఇవి బొత్తిగా పేద కుటుంబాలు" అంది జానకి సంశయంగా.

"అందుకే సెలక్ట్ చేశాను అత్తయ్యా! అటువంటి కుటుంబంలో అమ్మాయిలే కష్టసుఖాలు తెలిసినవారు అవుతారు" అన్నాడు కార్తీక్.

జానక్కి బొత్తిగా ఈ సంబంధాలు నచ్చలేదు. కానీ ఏం చేస్తుంది? చేసుకునేది అబ్బాయి. అతడిష్టం అనుకుని చేసేదిలేక వూరుకుంది. జనార్ధనం పనిమీద స్వంత ఊరు వెళ్లాడు.

"మామయ్య వచ్చేసరికి వారం రోజులు పడుతుంది. ఈలోగా ఏం చేస్తాను. బెంగుళూరు వెళ్లి వస్తానత్తయ్యా" అంటూ బయలుదేరాడు కార్తీక్.

జనార్ధనం రాగానే కార్తీక్ ఎంచుకున్న సంబంధాల గురించి చెప్పింది జానకి. ఆయన ఏమీ మాట్లాడలేదు. వాళ్లకి కబురు చేశాడు ఫలానారోజున అమ్మాయిల్ని చూడటానికి వస్తున్నామని.

కార్తీక్ వచ్చాక ఇద్దర్నీ చూడటం, ఇద్దరిలో అర్చన అతడికి బాగా నచ్చడంతో ఇంటికి రాగానే సంబంధం ఖాయం చేయమని చెప్పేశాడు.

జనార్ధనం, అర్చన తండ్రికి కబురు చేసే ముందు, జయచంద్రతో ఒకసారి మాట్లాడాలని అమెరికా ఫోన్ చేశాడు. జయచంద్ర ఫోన్ తీసుకున్నాక "జయా! కార్తీక్ ఇక్కడ ఒక సంబంధం ఖాయం చేయమని అంగీకారం తెలియచేశాడు. నేను అనుకున్నది ఏమిటంటే నీలిమ, కార్తీక్ పెళ్లి చేసుకుంటే బాగుండును కదాని. నీతో ఒకసారి చెప్పి

చూద్దామని ఫోన్ చేశాను" అన్నాడు.

"నిజమే బాబాయ్! అలా చేసుకుంటారని చాలాకాలం నేనూ ఎదురు చూశానుకానీ వాళ్లేమాత్రమూ ఇంట్రెస్ట్ చూపించలేదు. ఏం చేయగలం? కార్తీక్ కోరినట్టు జరిపించు" అన్నాడు బాధగా.

"నా మనసు అంగీకరించడంలేదు జయచంద్రా. పైగా అర్చన అందరిలాటి అమ్మాయికాదు. రూపానికి అందంగానే ఉంటుంది కానీ వికలాంగురాలు. ఒక కాలు అవిటిది" చెప్పలేక చెప్పలేక విచారంగా చెప్పాడు జనార్ధనం.

ఒక్కక్షణం జయచంద్ర బదులు చెప్పకుండా వుండిపోయాడు. అతడికీ బాధగా తోచింది కార్తీక్ నిర్ణయం. కానీ అతనేం చేయగలడు. కార్తీక్ కోరి అవిటి అమ్మాయిని పెళ్లి చేసుకోవాలనుకోవడం ఎందుకో అర్థం కాలేదు. జాలి, దయా, కరుణతో చేసుకుంటున్నాడేమో! "ఎవరి అదృష్టాన్ని ఎవరు కాదనగలరు? మంచిది అతడికి నచ్చింది. కాదనే హక్కు మనకు లేదు బాబాయ్! అలాగే కానీ" అంటూ ఫోన్ పెట్టేశాడు.

కార్తీక్, అర్చన తండ్రి రామనాథం, జనార్ధనం అంతా మాట్లాడుకుంటున్నా జానకి ఇటువైపు రాలేదు. కాఫీ చేసిచ్చి పక్కకు తప్పుకుంది.

రామనాథంగారు తన పుట్టు పూర్వోత్తరాలు చెబుతుంటే ఎక్కడో కార్తీక్‌వైపు బంధుత్వం చెప్పాలని గుర్తొచ్చింది జనార్ధనానికి. "సూర్యం, పార్వతమ్మ తెలుసా మీకు? " అని అడిగాడు.

"మానాన్నగారిది కూడా గోదావరి జిల్లా కోనసీమ. సూర్యం గారి గురించి చెప్పేవారు. బంధుత్వాలు వున్నాయోలేదో నాకు తెలియదు" అన్నారు రామనాథం.

"సరేలెండి... బంధుత్వాలు అవే కలుస్తాయి. కార్తీక్, నా భార్య జానక్కి బాబాయి మనవడు. అతడివైపు దూరపు బంధువులం అంటూ వుంటే మేమే! అబ్బాయికి మీ అమ్మాయి నచ్చింది. మీరు చెప్పాల్సింది ఏమైనా వుంటే చెప్పండి" అన్నాడు జనార్ధనం.

"అయ్యా! నాకు అర్చనా, వేదవ్యాస్ ఇద్దరు సంతానం. నా భార్య అనారోగ్య కారణంగా ఎక్కడికీ రాలేదు. చూశారుగా. మాకు తిండికి లోటులేదు. మా ఇంటికి ఆధారం అర్చనే! మమ్మల్ని పోషించేది అర్చనే! ఇప్పుడు అమ్మాయికి పెళ్లి అయితే మా ఆధారం పోయినట్టే. అలా అని దాని జీవితం పాడు చేయలేను. మేమెలాగో బతుకులు వెళ్లదీస్తాం. అమ్మాయి సుఖపడితే చాలని మా అంతస్థుకి, అందుబాటులో లేని ఈ కార్తీక్ గురించి మీరు చెప్పగానే ఏమూలనో వున్న ఆశతో వచ్చాను. మీరెలా అంటే అలా పెళ్లి జరిపిస్తాను" అన్నాడు రామనాథం.

"మీకు ఒక విషయం అబద్ధం చెప్పినందుకు క్షమించాలి. అది ఏమిటంటే అర్చనను నేను పెళ్లి చేసుకోలేను. ఇంతదాకా వచ్చాక నేను చెప్పిన ఈ మాట మీకు కోపం తెప్పిస్తుందని నాకు తెలుసు. కొద్దిరోజుల క్రితం నేను మీ ఊరు మీ ఇంటికి వచ్చాను. పరిస్థితిని కళ్లారా చూశాను. అర్చనను పెళ్లి చేసుకుని మీ కుటుంబాన్ని ఆదుకోవాలని నా కోరిక. అందుకే మా ఇంట్లో ఎవరికీ ఈ సంబంధం ఇష్టంలేకపోయినా పట్టుబట్టాను. నాకు నచ్చిందని మీకు కబురు చేయమనీ చెప్పాను. అసలు మొదట ఈ పెళ్లి సంబంధం అనే ప్రసక్తి లేకపోతే మీతో నేను మాట్లాడటానికి కూడా మీరు ఒప్పుకోరు" కొద్దిసేపు చెప్పడం ఆపేడు కార్తీక్.

"పెళ్లి చేసుకోనప్పుడు మావంటి వారిని హేళన చేయడానికా ఈ నాటకం? లేక మరో పన్నాగమా? " కోపంగా అడిగాడు రామనాథం.

"ఒక మాట వినండి. నేను మీకు తెలి





యదు. మీరు నాకు తెలియదు. 'మీ కుటుంబాన్ని పోషిస్తాను. మీ అందరికీ ఉపకారం చేస్తాను. నన్ను నమ్మండి' అని ఎక్కడ్నించో వచ్చి మిమ్మల్ని అడిగితే నన్ను ఇంట్లోకి రానిచ్చేవారా? లేదు. అందుకే పెళ్లి అనే నెపంతో ఇదంతా నడిపించవలసి వచ్చింది. అర్చనను నేను దత్తత తీసుకుంటాను. నాలాంటివాడు దత్తత తండ్రి అంటే రూల్స్ ఒప్పుతాయోలేదో నాకు తెలియదు. అలాకాక మీరు అయాచితంగా మీ కుటుంబాన్ని ఆదుకుంటానంటే అంగీకరిస్తారా? చెప్పండి!"

"చూడు బాబూ! నీది ఉన్నతాశయమే కావచ్చు కాని ఇలా మా అమ్మాయిని అమెరికా తీసుకువెళ్లి సహాయం చేయాలని కాక, పెళ్లి చేసుకున్న తర్వాతనే సహాయపడవచ్చునుకదా? పెళ్లి ఎందుకు వద్దంటున్నావు? ఓహో అవిటిది అయినందువలనా? " రామనాథం అన్నాడు బాధగా.

"చూడండి రామనాథంగారూ! అర్చన అవిటిదానిగానే వుండిపోదు. నేను ఆ కాలు బాగు చేయిస్తాను. మామూలుగా అందరిలాగే నడిచేలా చేస్తాను. అర్చనను నాతో పంపండి"

"కార్తీక్! నీ వాదనలో అర్థంలేదు. వయసులో వున్న అమ్మాయిని ఆదుకుంటాను. అమెరికా తీసుకువెళ్లి కాలు బాగుచేయిస్తాను. కుటుంబభారం వహిస్తాను... అనడంలో అసలు అర్థంలేదు. పెళ్లితో మొదలుపెట్టి, మరేదో ఆలోచన ఎందుకు చేస్తున్నావు? రామనాథంగారే కాదు, నేను కూడా అంగీకరించను. నీ దారిన నువ్వు వెళ్లు బాబూ! ఎవరిపాట్లు వారు పడతారు. ఎంతమందిని నువ్వు మాత్రం ఆదుకోగలవు? " అన్నాడు జనార్థనం.

"అయితే సరే! పెళ్లి చేసుకునే తర్వాత నా మాట నిలబెట్టుకుంటాను" అన్నాడు కార్తీక్.

"క్షమించండి జనార్థనంగారూ! పెళ్ళిచేసుకుని తీసుకెళ్ళిన తర్వాత నా కూతురికి అన్యాయం జరిగితే ఎవరితో చెప్పుకోగల్ను? నా సమస్య మరింత జటిలం అవుతుంది. కానీయండి. మా జీవితాలు ఈ విధంగా వెళ్లమారిపోతాయ్" అన్నాడు రామనాథం వెళ్ళడానికి లేచి నిలబడుతూ. ఆయన వెళ్ళిపోయాక.

"ఇదేమిటి నేను అనుకున్నదాంట్లో తప్పు ఏముంది మామయ్యా? " అన్నాడు కార్తీక్.

"లేకపోవడం ఏమిటి కార్తీక్? వుంది. మనసు మార్చుకున్నావు. మాటమార్చావు అసలు నువ్విలా ప్రవర్తిస్తావని నేను కూడా అనుకోలేదు. నీ మనసు గందరగోళంగా వుంది. ఈ పరిస్థితిలో పెళ్ళిచేసుకోకుండా వుండటమే మంచిది" అన్నాడు జనార్థనం విచిత్రంగా. ఆ సాయంత్రం రామనాథం, అర్చనా వచ్చారు.

తెల్లబోతూనే లోనికి ఆహ్వానించాడు జనార్థనం.

"అమ్మాయి అర్చన కార్తీక్‌వెంట వెళ్లడానికే నిశ్చయించుకుంది" అన్నాడు రామనాథం.

"ఎవరూ బలవంతం చేయలేదు కదా? ఏమ్మా అర్చనా? మీనాన్నగారు చెప్పింది నిజమేనా? " అడిగాడు జనార్థనం.

"నిజమేనండీ! నాన్నగారికి ఇష్టంలేదు కానీ నేను వెడతాను. నన్ను కార్తీక్‌గారు పెళ్లి కూడా చేసుకోవలసిన అవసరంలేదు. నాక్కావలసింది మా కుటుంబాన్ని వారు ఆదుకోవడమే!"

"తీరా వెళ్ళిన తర్వాత నువ్వనుకున్నట్టు జరగకపోతే? కార్తీక్‌మీద నీకెందుకు నమ్మకం వుండాలి? "

"ఒక మనిషిని చూస్తే ఎందుకో నమ్మకం కలుగుతుంది. నాకు అలాగే కార్తీక్‌గారితో మాట్లాడిన తర్వాత ఆయన మనసు తెలిసింది. ఆయన నిజాయితీ తెలిసింది. అందుకే నేనీ నిర్ణయం తీసుకున్నాను" దృఢంగా చెప్పింది అర్చన.

"ఆ మంచి చెడ్డలకు బాధ్యత వహించి

కార్తీక్ వెంట వెళ్లడానికే సిద్ధపడుతు న్నావా? "

"అవునండీ! నాకు మంచే జరుగుతుందని నమ్మకం" అంది అర్చన.

"రామనాధంగారూ మీరేమంటారు? "

"నాతో కూడా ఇలాగే చెబుతోందండీ. ఇటువంటి అవకాశాన్ని వదులుకోనం టుంది. అర్చన మరీ లోకం పోకడ తెలియ నిదికాదు. చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. నేనూ అమ్మాయి మాట కాదన్లేక పోతున్నాను"

"సరే! మీరంతా ఒక నిశ్చయానికి వచ్చాక నేను చెప్పేది ఏముంది? ఆ తర్వాత జరిగే పరిణామాలకు నన్ను బాధ్యుణ్ణి చేయకండి. ఇంతకీ అమ్మాయి ఏం ఉద్యోగం చేస్తోంది? " అప్పటిదాకా తెలియని జనా ర్ధనం అడిగాడు.

"నర్సింగ్ కోర్స్ చేసిందండీ. మా ఊళ్లోనే గవర్నమెంట్ హాస్పటల్లో పనిచేస్తోంది నర్స్‌గా!" చెప్పాడు రామనాధం.

"మరి, ఆమె కాలు వలన విధినిర్వహ ణలో ఆటంకం కలగలేదా? "

"లేదండీ. ఎటువంటి ఇబ్బందీ కలగ లేదు. సునాయాసంగా చేయగలదు" అన్నాడు రామనాధం.

జనార్ధనం ఇక ఏమీ మాట్లాడలేదు.

మరో వారానికి కార్తీక్ అర్చనను వెంటబె ట్టుకుని అమెరికా వెళ్ళిపోయాడు.

"కార్తీక్ అర్చన కోసమే ఇండియా వచ్చిన ట్టుంది. వచ్చి చేసింది ఏముందీ? " అంది జానకి.

"ఏమైతేనేం కార్తీక్ వలన ఒక పేద కుటుంబానికి కొండంత ఆసరా లభించింది" అన్నాడు జనార్ధనం.

"అలా అనుకుని తృప్తిపడుతున్నారా! బాగానే వుంది కానీ వాడి గురించి ఏ నిర్ణ యమూ తీసుకోలేదు. అది మీకు బాధ కలి గించడంలేదా? " అంది జానకి.

"అర్చనను పెళ్ళిచేసుకుంటాడేమో ఎవరికి తెలుసు? "

"ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకునే ఉద్దేశం అంటూ వుంటే ఇప్పుడే చేసుకునేవాడు కదా? ఆ అమ్మాయిని చేసుకోవడం నాకు ఇష్టం లేకపోయినా పోనీ మన కళ్ళ ఎదుట పెళ్ళి చేసుకుని వెడతాడని సంబరపడ్డాను. అదీ లేదు. చివరికి వీడూ అరవిందలాగే అయిపోడుకదా? " అంది జానకి నిట్టూ రుస్తూ.

"వద్దు జానకీ! కార్తీక్‌కి తల్లి వారసత్వం వద్దు. ఆమె దురదృష్టం ఆమెతోనే మిగిలి పోనీ. అయినా మనకిలా వాడి పెళ్లీ, పిల్లలూ, అభివృద్ధీ చూస్తుండాలనే పేరాశ ఏమిటి? అవి కూడా మన ఇష్టప్రకారం జర గాలనే కోరిక ఏమిటీ? మనం మరీ ఎక్కు వగా కార్తీక్‌మీద మమకారం పెంచుకుంటు న్నామేమో! ఎవరి ఆలోచనలు వారివి. చెబితే విని సంతోషించడం వరకే! ఎవరి విషయంలోను కలగచేసుకోకుండా వుండటం ఉత్తమం కదూ? " అన్నాడు జనా ర్ధనం.

"మనం కావాలని కలగచేసుకోలేదుగా? వాడు వచ్చాడు. సంబంధం చూడమని అడి గాడు. మనం ఎటువంటి సలహా ఇవ్వనే లేదు. అంతా వాడి ఇష్టప్రకారమే జరుగు తుంది కదా? " అంది జానకి.

జనార్ధనం మాట్లాడలేదు. అప్పటికే గాఢ నిద్రలో వున్నాడాయన.

కార్తీక్ ఇండియానుంచి నూతన వధు వుతో వస్తాడనుకున్న జయచంద్రకు, అర్చ నను ఒక విజిటర్‌గా తీసుకురావడం మరో మారు ఆశ్చర్యం కలిగించింది. అయినా ఆదరంగా పలకరించాడు అర్చనను.

కార్తీక్ ఆ అమ్మాయిని తీసుకురావడంలో తన అభిప్రాయం తెలియచేశాడు. 'కేవలం ఆ కుటుంబాన్ని ఆదుకోవాలనే అనుకు న్నాను' అన్నాడు. మరి మొదట పెళ్ళి సంబంధం అంటూ ఎంక్వైరీ చేయడంలో అర్ధం ఏమిటని జయచంద్ర అడిగితే




'మొదట ఆవిధంగా అనుకున్నాను కానీ మనసు మార్చుకున్నాను' అన్నాడు. అర్చన ఆల్రెడీ నర్సింగ్ ప్రొఫెషన్‌లో వుంది కనుక, ఇక్కడ హాస్పటల్స్‌లో మరిన్ని అవకాశాలు వుంటాయనీ, వాళ్లమ్మగారి ట్రీట్‌మెంట్, తమ్ముడి చదువు నిరాటంకంగా కొనసాగు తాయనే ఆలోచనతో పెళ్ళి కంటే ముందు వారి కుటుంబాన్ని ఆదుకోవలసిన అవసరం వుందనీ అభిప్రాయపడ్డాననీ, పెళ్ళి ఆలో చన మానుకున్నాననీ చెప్పాడు.

"నిజమే కార్తీక్! నువ్వు అర్చనను పెళ్ళి చేసుకుంటే ఆమె జీవితం మాత్రమే బాగుప డుతుంది. వారి కుటుంబం ఎప్పుడూ ఒడి దుడుకుల్లోనే వుంటుంది. అలాకాక అర్చ నకు మంచి భవిష్యత్‌ను ఏర్పడేలా చూడా లనుకోవడంలో అందరికీ ప్రయోజనం చేకూరతుంది. అయితే మరి అర్చన అలా వాళ్ల కుటుంబంకోసం మరి కొద్దికాలం పెళ్ళి కాకుండానే వుండిపోవలసి వస్తుందేమో ఆలోచించావా? " అన్నాడు జయచంద్ర.

తర్వాత ఆలోచన అర్చనది. ఆమె సలహా ననుసరించే సహాయం చేయాలనుకున్నాను" అంటూ అసలు విషయం చెప్పాడు కార్తీక్.

"అదా సంగతి! అంతా నిన్ను అపార్థం చేసుకుని నిందించారే! కనీసం జనార్ధనం బాబాయితో అయినా చెప్పవలసిందోయ్ కార్తీక్" అన్నాడు జయచంద్ర.

"లేదు సర్! ఆ టైమ్‌లో నేను ఏం చెప్పినా నమ్మకపోవచ్చు. ఆలస్యంగా తెలిస్తే పోయేది ఏముంది? నన్ను నిందిం చడం సంగతంటారా ఒక మంచి పనికోసం కొన్ని మాటలు పడాల్సివస్తే నష్టం ఏముంది? ఆశయం నెరవేరడం ముఖ్యం కానీ" అంటున్న కార్తీక్ వ్యక్తిత్వం జయచం ద్రను ముగ్ధుణ్ణి చేసింది.

అర్చనను చూడగానే సుచిత్రకు మంచి భావన కలిగింది. "మా ఇంట్లో వుండు అర్చనా, నందిత హాస్పటల్లోనే వర్క్ చేయచ్చు అవసరాన్నిబట్టి ఇక్కడ కోర్స్ తీసుకుంటూనే వర్క్‌చేసేలా చూస్తుంది నందిత" అంది.

"మీరు ఎలా చెబితే అలా నడుచుకుం టాను. మీవంటివారి అండ లభించడమే నా అదృష్టం" అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది అర్చన.

నీలిమ ఇంట్లో జరిగే పరిణామాలను అలా చూస్తూ వుండిపోయింది. ఒకోసారి తనలోతను 'కార్తీక్‌కి, నాకూ మధ్య మరో వ్యక్తి వచ్చినప్పుడే సమస్య పరిష్కారం కాగ లదని ఒకప్పుడు అనుకున్నాను. ఆ మూడో వ్యక్తి అర్చనా? ' అనుకుంది.

క్రిస్‌మస్ హాలీడేస్‌కి రాకేష్ శాండియాగో వచ్చినప్పుడు అర్చనను చూసి తలక్రిందులై పోయాడు. విపరీతమైన జాలి అతడి మన సును కుదిపివేసింది. అర్చనతో బాగా కలి విడిగా వుండసాగాడు.

"నేను కెంటకీ వెళ్లను. ఇక్కడే వుంటాను డాడ్. మన కంపెనీలోనే" అని తనంతతా నుగా తండ్రితో చెప్పేశాడు.

అందుకు కారణం అర్చనే అని తెలిసినా, "ఏమిట్రా రాకీ, ఇంత త్వరగా నిర్ణయం తీసేసుకున్నావ్. అర్చన అంటే ఇష్టం తోనా? " అనడిగింది సుచిత్ర.

"అవును మామ్! పాపం అర్చనకు నేను హెల్ప్‌గా వుంటాను. తనకి అంతా కొత్త కదా? నీక్కూడా అర్చనంటే ఇష్టంకదూ? నిజం మామ్! అర్చనకు లైఫ్‌లాంగ్ తోడుగా వుండాలనిపిస్తోంది నాకు" అన్నాడు.

ఆ తర్వాత భార్యాభర్తలిద్దరూ ఏకాం తంలో వివరంగా మాట్లాడుకున్నారు.

"అదీ ప్రేమంటే, అమ్మాయిని అలా చూశాడోలేదో ఇలా ఇష్టపడ్డాడు. హమ్మయ్య! అర్చన కూడా ఇష్టపడిందంటే మనకి సమస్య వుండదు. నీకు సంతోషంగా వుందా చిత్రా? " అడిగాడు జయచంద్ర.

"ఔను జయా! అర్చనను చూడగానే నాక్కూడా ఇష్టం ఏర్పడింది. ఆ అమ్మాయి



తన స్వార్థం చూసుకుని వుంటే కార్తీక్‌ని పెళ్ళిచేసుకుని, తన సుఖం చూసుకునేది. అలా కాకుండా కార్తీక్ ఇచ్చిన అవకాశాన్ని కుటుంబంకోసం అంది పుచ్చుకుంది. ఈ అమ్మాయి మనస్తత్వం చాలా గొప్పది. తన చుట్టూ వున్నవారిని ప్రేమించగలదు. వారి కోసం ఏమైనా చేయగలదు. అర్చన కోడలైతే అంతకన్నా ఆనందంలేదు" అంటూ మనసువిప్పి భర్తతో చెప్పింది.

"అయితే ఒక్క విషయం. అర్చన కూడా మన ఇంటి కోడలు కావాలనీ, రాకేష్‌ని మనస్ఫూర్తిగా, భర్తగా అంగీకరించానని తనంతగా చెప్పేవరకూ మనం ఎవరమూ పెళ్ళి ప్రసక్తి తీసుకురావద్దు. ఎందుకంటే మన కోసం తను ఇష్టపడటం కాక, ఆమె మనసులోనూ, మన అందరి పట్లా అభిమానం ఏర్పడాలి. కాని కృతజ్ఞతకాదు. మనం తగా అడిగితే కాదనదు. వెంటనే అంగీకరిస్తుంది కానీ, అది కృతజ్ఞతే అవుతుంది" అన్నాడు జయచంద్ర.

"అలాగే! వేచివుందాం. నేను ఎప్పుడూ బయటపడను సరేనా?" అంది సుచిత్ర.

నందిత, ఫిలిప్స్ అర్చనకు హాస్పటల్లో జాబ్ చూశారు. అలాగే ట్రైనింగ్ తీసుకోడానికి స్కూల్లో జాయిన్ చేశారు. ఫిజికల్లీ హేండీకాప్డ్ కాబట్టి, కొన్ని సదుపాయాలున్నాయి ఆమెకు. ఈ విషయాలన్నీ సంతోషంగా ఇంటికి ఉత్తరం రాసింది అర్చన.

రామనాథంగారు కూతురి ఆలోచన తెలుసుకుని, 'నా తల్లి, మాకోసం అంతదూరం వెళ్ళిపోయింది. ఇదంతా కార్తీక్ చలవ. అతనే కనుక దారిచూపించకపోతే ఇలా జరిగేది కాదు. అనవసరంగా అతణ్ణి అనుమానించాను' అనుకున్నాడు పశ్చాత్తాపంతో. వెంటనే ఈ విషయం జనార్ధనం ఇంటికి వెళ్ళి చెప్పేవరకూ ఆయనకు తోచలేదు. జనార్ధనం జానకీ కూడా కార్తీక్ చేసిన పనికి మురిసిపోయారు. 'వాడిని మనం అర్థం చేసుకోలేదు' అనుకున్నారు.



అర్చన తనకు ఆశ్రయం ఇచ్చిన జయరాం, సుచిత్రలకు చేతనైనంతగా ఇంటి పని చేసిపెడుతూ ఉంటుంది. అది చూసి ఏనాడూ కిచెన్‌వైపురాని రాకేష్ తను కూడా అర్చనతోబాటు ఇంటిపని చేయడం మొదలుపెట్టాడు. అర్చన ఓసారి అతడ్ని తను చేసే పనికి అడ్డువస్తావని పోట్లాడింది.

"రాకేష్! మీరు హాయిగా కూర్చోండి. నేను చూస్తాగా! మీకెప్పుడూ ఈ పన్లు అలవాటు లేనట్టు తెలుస్తూనే వుంది" అంది మందలింపుగా.

"అలవాటు లేనిమాట నిజమే అర్చనా! కాని ఈ పనిలో ఎన్ని సదుపాయాలున్నాయో తెలిసివస్తోంది కాబట్టి, నేనూ చేస్తాను" అన్నాడు.

"ఏమిటీ పనిచేస్తే సదుపాయమా? మా ఆడవాళ్ళు అదో డ్యూటీ అనుకుని చేస్తాం తప్పితే, మాకేమీ సదుపాయం కాదే" అంది అర్చన.

"ఆ... సదుపాయం ఏమిటంటే, సపోజ్ నువ్వు కాకరకాయ కూర వండుతావనుకో. అది డాడ్‌కి మాత్రమే నచ్చుతుంది. నాకు





నచ్చుదు. నాకిష్టమైనది బెల్ పెప్పర్ రోస్ట్. చేసుకుతినడం అనేది నాకు లాభం" అన్నాడు రాకేష్.

అర్చన కళ్లనీళ్ళు వచ్చేలా ఒకటే నవ్వింది.

"మీకు కావలసినవి వండుకుని స్వయంగా చేసుకోవచ్చనే నిజం ఇప్పటికి తెలిసిందన్నమాట. మరి ఈ విషయాన్ని మీ అమ్మగారితో చెబితే మీకు ఇష్టం అయి నవే చేసేవారు కదా? " నవ్వు ఆపి చెప్పింది అర్చన.

"లేదు అమ్మ చేసే పద్ధతివేరు. నిజానికి నువ్వు చేసినప్పుడే నేను నేర్చుకున్నాను. అది ఎంత టేస్టీగా వుందనుకున్నావ్" అన్నాడు రాకేష్.

"అయితే అసలు వంటలన్నీ నాదగ్గిరే నేర్చుకుంటున్నారన్నమాట. రేపట్నించీ నేను కిచెన్‌లోకి రాను. ఎవరికేది కావాలో మీరే చేయండి" అంటూ అక్కడ్నించి తప్పు కోబోయింది అర్చన.

"ఓమైగాడ్. అసలు ఎట్రాక్షన్ నీవంట కాదోయ్ అమ్మాయ్. నువ్వే. నీకు అవీ ఇవీ అందిస్తున్నట్టూ మధ్యలో టేస్ట్ వంకన అదీ ఇదీ కడుపులో పడేస్తూ ఆడుతూ, పాడుతూ, నిన్ను చూస్తూ వుండచ్చు" అన్నాడు అర్చనవైపు అదోలా చూస్తూ రాకేష్.

"రాకేష్ మీరు చేసే చిలిపిపన్లు, సహాయం వంకతో తాకడాలు నాకు అర్థమై, నాలో అలజడి కలిగిస్తున్నారు" తలవంచు కుని బేలగా చెప్పింది అర్చన.

రాకేష్ అర్చనకు దగ్గిరగా వచ్చి ఆమె భుజం చుట్టూ చేయివేసి "ఔను అర్చనా, నీరాక నాలో కొత్తగా ఉత్తేజాన్ని నింపింది. అంతదాకా నాకేమిటో అయోమయంగా వుండేది. ఇక్కడ వుండాలని అనిపించేది కాదు. ఇప్పుడు నిన్ను వదిలి వెళ్ళాలనిపిం చదు" అన్నాడు.

అతడి చేతిని పక్కకు తొలగిస్తూ "రాకేష్ నేను అవిటిదాన్ని. కార్తీక్ వలన ఈ దేశం వచ్చి మీ అమ్మగారి ఆశ్రయంలో జీవిస్తు న్నాను. నేను మీ ఇంటికి ఒక సర్వెంట్ మెయిడ్‌లా మాత్రమే వచ్చాను. మీరు నన్ను కోరుకోవడం కేవలం ఆకర్షణ మాత్రమే" అంది అర్చన.

"కాదు అర్చనా! ఆకర్షణే అయితే నాకు చాలా అవకాశాలే వచ్చాయి. అది తప్పు కాదు ఈ దేశంలో. నువ్వు చూస్తున్నావుగా మా ఇంట్లో పద్ధతి అంతా ఇండియన్ కల్చర్ కదా? నేను నిన్ను ఆకర్షణతో కోరు కున్నానే అనుకో పోనీ... పెళ్ళి చేసుకుంటా నని మామ్‌తో చెప్పనా? నీకు ఇష్టమో కాదో చెప్పు చాలు" అన్నాడు రాకేష్ ఆమె చేతిని, తన చేతిలోకి తీసుకుని లాలనగా.

"నాకంత అదృష్టమా రాకేష్? కాని నేను కొన్ని బాధ్యతలు పూర్తిచేయాలి. అంతదాకా నాకు పెళ్ళిచేసుకోవాలనే ఆలోచన లేదు" అంది అతడి స్పర్శకు వివశురాలవుతూ.

"పోనీ నీకెప్పుడు ఇష్టం అయితే అప్పుడే పెళ్ళి చేసుకుందాం. నన్ను కాదనకు అంటూ చటుక్కున దగ్గరగా హత్తుకు న్నాడు" రాకేష్.

ఈ దృశ్యాన్ని చూసి కిచెన్‌లోకి గాబోతూ ఆగిపోయింది సుచిత్ర. తల్లి వచ్చిన అలికి డికి అర్చనను వదిలి దూరంగా వెళ్ళాడు రాకేష్. జరిగిందేమిటో అర్చన ముఖం చూసి గ్రహించిన సుచిత్ర, అదేమీగమనించ నట్టు.

"ఏమిటి ఇంత ఉదయాన లేచావు రాకీ? అబ్బో అప్పుడే కాఫీ మేకర్ కూడా ఆన్ చేశావా? " అంటూ ముగ్గురికీ కాఫీ కలిపి కప్పుల్లో పోసి తెచ్చింది. డైనింగ్ టేబుల్ దగ్గిర కూర్చుని కాఫీ తాగుతూ, "అర్చనా ఈరోజు వంట నేను చేస్తాను. బెల్ పెప్పర్ రోస్ట్" అంది ఓరగా రాకేష్‌వైపు చూస్తూ.

'అయితే మామ్‌కి అన్నీ తెలిసిపోయినట్టు న్నాయ్' అనుకుని "మామ్ ఈరోజు నేను లంచ్‌కి రాను. డాడ్ కంపెనీలో వుండాల

న్నారు" అన్నాడు.

"పోనీ లంచ్‌బాక్స్ తీసికెళ్ళు" అంది సుచిత్ర.

"నో మామ్" అంటూ క్షణం ఆగకుండా వెళ్ళిపోయాడు అక్కడ్నించి రాకేష్.

"అర్చనా, దా! ఇలా కూర్చో! రాకేష్‌ని పెళ్లి చేసుకోడం నీకిష్టమేనా? " అంటూ అడిగింది సుచిత్ర.

"నిజానికి నాకు పెళ్ళి, భర్తా అనే ఆశ లేదు ఆంటీ. ఎందుకంటే నేను శక్తిహీనురాల్ని. నావలన ఎవరికీ ఆనందం కలగకపోవచ్చు. ఎవరు మొదట జాలితో పెళ్ళిచేసుకున్నా, ఆ తర్వాత యదార్థం తెలిసివచ్చి, నాతో జీవితాంతం కాపురం చేయాలని అనుకోకపోవచ్చు. అంతకంటే ముఖ్యంగా మా అమ్మా, నాన్నలు వృద్ధాప్యంలో సుఖంగా జీవించాలి. మా తమ్ముడు ప్రయోజకుడు కావాలి. ఈ ఆశయంతోనే కార్తీక్ గారి సహాయం తీసుకున్నాను. అనుకోకుండా మీవంటి సహృదయుల ఆశ్రయం



లభించింది. నా జీవితానికి ఒక అర్థం కని పించింది. మీ రుణం తీర్చుకోడానికి, నాశక్తి నంతా ధారపోయాలనుకున్నాను. కానీ ఎక్కడ రాకేష్ ఆకర్షణలో పడిపోతానా అని భయంగా వుంది. ఒకరకంగా రాకేష్‌తో అనుబంధం నా జీవితానికి ఆలంబనగానూ కనిపిస్తోంది. అయినా నేనింకా ఏ నిర్ణ యమూ తీసుకోలేను. ఎందుకంటే పెళ్ళిచే సుకుని నా సుఖం నేను చూసుకుంటే నా కర్తవ్యం మరుగున పడిపోతుంది" అంటూ చెప్పింది అర్చన.

"అర్చనా! నువ్వు చెప్పింది వింటే నాకు సంతోషంగా వుంది. ఒక అమ్మాయివి, అంగవైకల్యం కలిగీ, నీవాళ్లను ఆదుకోవా లనే తాపత్రయపడుతున్నావు. నీకు సుఖప డగల అవకాశం వచ్చినా తృణీకరించి, మీవాళ్లగురించే ఆలోచిస్తున్నావు. నీలాంటి ఆడపిల్లగల నీ తల్లితండ్రులు అదృష్టవం తులు. నీ ఆశయం నెరవేరాలనే నేనూ కోరుకుంటున్నాను" అంది సుచిత్ర అర్చనను మెచ్చుకుంటూ.

మనసులోమాట సుచిత్రకి చెప్పినా ఒకే ఇంట్లో వుంటూ వెంటవెంట తిరిగే రాకేష్‌ని అదుపుచేయడం అర్చనకు చాలా కష్టంగా తోచింది. పైగా ఇంట్లో అందరికీ తెలిసిపో వడం, అందరికీ అర్చనంటే ఇష్టం వుండటం అతనికి మరింత ధైర్యాన్నిచ్చింది. అందువ లన అర్చన మాటలు పట్టించుకోవడంలేదు. ఏమైనా, మందలిస్తే "మా మీద నీకు నమ్మ కంలేదు. నీ ఆశయం పూర్తికాగానే వేరే వెళ్ళిపోవాలని చూస్తున్నావా అర్చనా" అంటూ బేలగా అడుగుతుంటే తట్టుకోలేక పోతోంది. అలా అని రాకేష్‌కి అధీనం కావ డమూ ఇష్టంలేదు.

ఓరోజు కార్తీక్ వచ్చినప్పుడు మగవాడైనా ఇండియానుంచి రావడానికి సహాయం చేశాడు .కనుక తన బాధనంతా అతడితో చెప్పింది.





"దీనికింత ఆలోచన ఎందుకు అర్చనా? పెళ్ళిచేసుకుని ఉద్యోగం చేసుకుంటూ నీ వాళ్ళకి నువ్వు అనుకున్న సహాయం చెయ్. సమస్య తీరిపోతుంది" తేలిగ్గా అనేశాడు కార్తీక్.

"అదంత న్యాయంగా వుంటుందా కార్తీక్? " సంశయంగా అంది అర్చన.

"ఇందులో న్యాయాన్యాయాల ప్రసక్తి ఏముంది అర్చనా? జయచంద్ర కుటుంబం చాలా మంచిది. నీ సంపాదన ఆశించరు. పైగా నువ్వు కూడా ఈ ఇంటికి ఎంత చాకిరీ చేస్తావో లెక్కేలేదు. అది కొనసాగు తూనే వుంటుంది. రాకేష్ ప్రెషర్ ఎక్కు వగా వుండి, నీ ఆశయం తీరడం అసాధ్యం అనుకుంటే సుచిత్రా మేడమ్‌తో ముందుగా చెప్పవచ్చు నా వారికి నా అవసరం వుంటుందని" అన్నాడు కార్తీక్.

"సరే! అలాగే చేస్తాను. మీరెందుకు ఇంకా పెళ్ళి చేసుకోరు కార్తీక్? మాకు మంచి సలహాలు ఇస్తున్నారు" చొరవగా అడిగింది అర్చన.

"అర్చనా... అనుకున్నవి అందరికీ జర గవు. నేను కావాలనుకున్న అమ్మాయి ఇంకా తన అంగీకారం తెలియచేయలేదు. నీలా పెళ్లి చేసుకో అని తొందర చేసేవారూ లేరు. చూద్దాం, సమయం వచ్చినప్పుడు అదే జరుగుతుంది" అన్నాడు ఎటూ కాకుండా జవాబు చెబుతూ కార్తీక్.

"ఆమె ఎవరో చెప్పండి కార్తీక్. లూసీయా? నీలిమా? నేను అడిగి తెలుసు కుంటాను. ఎందుకు ఆలోచిస్తున్నారో ఇంత కాలంగా అని!" అంది అర్చన అతడి సమస్య తానే పరిష్కరించగలననే ఆలోచ నతో.

"లేదు అర్చనా! నీకు తెలియదు. అలా మనం తొందర చేసినా వాళ్లు చెప్పరు. అసలు ఇక్కడ పద్ధతి గురించి నీకు ఇంకా తెలీదు. ఒకమ్మాయి, అబ్బాయి పరిచయం ఏర్పడి, దాన్ని పెంచుకుని పెళ్ళి చేసుకోవా లనే నిర్ణయానికి రావడానికి పరిమితి కాలం

అంటూ వుండదు. ఎంతకాలం అయినా పట్టవచ్చు. బహుశా అందుకే ఇక్కడి బ్రహ్మచారులు ఇండియా వచ్చి పెళ్ళి చేసుకోవాలనుకోవడం" అన్నాడు కార్తీక్.

"అందరికీ సహాయపడతారు. అందరి మంచీ చూస్తారు. మీ గురించి మీరు ఆలోచించకపోవడం అన్యాయం" అంది అర్చన.

"నా గురించి ఆలోచించడం స్వార్థం అవుతుంది అర్చనా! అలా అని అన్నిటికీ అతీతుణ్ణనేంకాదు. నా వరకూ అనేకరకాల వ్యాపకాలు కల్పించుకోగలను. ఇక్కడివాళ్ళు ఏం చేస్తున్నారు? మనం వారినుంచి ఎన్నో నేర్చుకోవాలి"

"మీరు ఇండియాని, బంధువుల్ని మిస్సయ్యానని భావిస్తారా? "

"లేదు. ఆత్మీయులు ఎక్కడైనా లభ్యమవుతారు. మనలో కలుపుకుపోగల తత్వం వుంటే, అసలు ఒంటరితనం ఫీలవకుండా వుండాలనే ఎక్కువగా ట్రావెల్ చేస్తాను. అర్చనా! నేను చూసిన ప్రాంతాలు గురించి చెబుతాను విను" అంటూ అతడు చూసిన ప్రదేశాల విశేషాలూ చెబుతుంటే మంత్రముగ్ధురాలై వింది అర్చన.

"అసలిక్కడి జీవితం విచిత్రంగా వుంటుంది అర్చనా! చూశావుగా మన ఇండియన్స్ అటు అమెరికన్స్‌తో కలిసిపోతారు. ఇంట్లో మన పద్ధతులు పాటిస్తారు. పూర్తిగా ఒకటే ఫాలో అవరు. ఇది తప్పనిసరి. నువ్వెలా ఫీలవుతున్నావు? ఇక్కడ నచ్చిందా నీకు? "

"నా దృష్టి అంతా నర్సింగ్‌మీదనే వుంది కార్తీక్! మరే ఆలోచనా రాదు. మొదట నేను వచ్చిన పని పూర్తి కావాలి. ఆ తర్వాతనే విహారాలు, వినోదాలూను. అందుకే పెళ్ళి కూడా వాయిదా వేస్తున్నాను. కానీ ఏం జరుగుతుందో తెలియకుండా వుంది. చాలాకాలమైంది మనం కలిసి. కాలం చాలా వేగంగా గడిచిపోతోంది కదూ? అప్పుడే నేను వచ్చి రెండేళ్ళు అయింది. ఒక్క సంవత్సరం గడిస్తే మా తమ్ముడి చదువు పూర్తవుతుంది. వాణ్ణి ఏం చేయాలి? ఇండియాలో కూడా నిరుద్యోగ సమస్య తీవ్రంగా వుంది. నేను చేయగల సాయం ఇంతేమరి. ఆ తర్వాత వాళ్ళ లక్ అంతే" అంది అర్చన.

"వాడు కూడా ఇక్కడికి వస్తానంటాడేమో? " అన్నాడు కార్తీక్.

"అంటే మాత్రం నేనేం చేయగలను? అమ్మానాన్నలను చూసుకోవద్దా? నేను కూడా మొదట కొంత డబ్బు సంపాదించి మన దేశం వెళ్ళిపోవాలని అనుకున్నాను. కానీ రాకేష్‌వలన ఆ అవకాశం లేకుండాపోయింది. అయితే కాదని వెళ్ళిపోవచ్చును కోండి కానీ, అన్నంపెట్టి, ఆశ్రయం ఇచ్చి చదువుకి సాయపడిన వారిపట్ల కృతఘ్నురాల్ని కాలేను. అంటే కన్న తల్లితండ్రులపట్ల కృతఘ్నురాలివి కాగలవా అంటారేమో! పెళ్ళి, సంసారం, మరో ఇంటికి వెళ్ళడం మనదేశంలో ఆడపిల్లకు తప్పనివి. అక్కడ వుండి సహాయం చేయలేకపోవచ్చు నా అంగవైకల్యానికి అసలు పెళ్ళి కూడా అవడమూ కష్టమే. అమ్మానాన్నల బరువు తగ్గుతుందనే వచ్చాను" అంది అర్చన.

ఆరోజు అర్చనా, కార్తీక్ చాలా విషయాలు మాట్లాడుకున్నారు. అతను వెళ్ళిపోయాక చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయింది అర్చన. 'కార్తీక్ కోరుకున్న అమ్మాయిలు అంగీకరించకపోతే ఇలాగే పెళ్ళి చేసుకోకుండా వుండిపోతాడేమో! మనసులో మాట చెప్పడంలేదు. ఇంతకన్నా అడగడానికి నేనుమాత్రం అతడికి ఏమవుతాను? అడగడమూ మర్యాదకాదు'

★ ★ ★

ఓరోజు హఠాత్తుగా అభిరామ్ వచ్చాడు. కబురు లేకుండా వచ్చిన అతణ్ణి చూసి కార్తీక్ ఆశ్చర్యపోయినా, లూసీ పిలిపించి

వుంటుంది అనుకున్నాడు.

కార్తీక్ ఫ్లాట్‌లోనే దిగాడు. లూసీ హోటల్‌లో ఫ్రీగా వుండమందిగానీ, అభిరామ్ ఇష్టపడలేదు. పైగా అతను ఉదయం వెళ్ళి, రాత్రి బాగా పొద్దుపోయాక రావడంవలన అంతగా ఇబ్బందీలేదు. శశికాంత్‌కి పెళ్ళి అయిందిట. అమ్మాయి బంధువులేట. మరి నీ సంగతి అంటే, "త్వరలోనే..." అన్నాడు తప్ప వివరాలు చెప్పనూలేదు, కార్తీక్ అడగనూలేదు. సేమ్ కంపెనీ అయినా అభిరామ్ వచ్చిన కారణం లూసీ చెప్పనేలేదు. ఒక సంవత్సరం నీతో వుంటాను అన్నాడు కార్తీక్‌తో అభిరామ్.

అతను వున్న సంవత్సరంలో చాలా విశేషాలే తెలిసివచ్చాయి కార్తీక్‌కి. అభిరామ్ తండ్రి భార్గవ చెప్పిన అమ్మాయిని పెళ్ళి చేసుకోలేదు. అందుక్కారణం లూసీ అభిరామ్‌ని పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకుంది. కంపెనీలో వుండడానికే ఇండియా నుంచి పిలిపించింది. బెంగుళూర్‌లో లూసీ కంపెనీ మూతపడింది. శశికాంత్ మరో కంపెనీకి మారాడు. అమెరికా పంపాలనుకుని అతడి తండ్రి ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. చివరికి అక్కడే స్థిరపడక తప్పలేదు. నిజానికి అభిరామ్‌కంటే శశికాంత్ తెలివైనవాడు. మెరిట్‌కంటే అడ్డదారిలో లూసీని మెప్పించి అమెరికా రాగలిగాడు అభిరామ్. అభిరామ్ రాకతో కార్తీక్ బైటకు రావలసిన పరిస్థితి ఏర్పడింది. లూసీకి తెలియకుండా కార్తీక్‌మీద పెత్తనం చేయడం, కంపెనీ తనదే అన్నట్లు ప్రవర్తించడం చూశాక, తోటి దేశీయుడి గురించి, కొలీగ్ గురించీ లూసీకి కంప్లయింట్ చేయలేక మర్యాదగా తప్పుకున్నాడు. అమెరికాలో పనిచేసేవారు వాళ్ళ ఇష్టం వచ్చినప్పుడు, కారణం చెప్పకుండానే బయటికి రావచ్చు అలాగే కంపెనీలు కూడా కారణం చెప్పకుండా ఉద్యోగాలనుంచి తొలగించనూ తొలగించవచ్చు కాబట్టి కార్తీక్ వచ్చేముందు ఒక్క జయచంద్రతో చెప్పడం, అతను ఆనందంగా తన కంపెనీలో చేర్చుకోవడం తదుపరి పరిణామాలు. రాకేష్ ఇప్పుడు కార్తీక్‌ని అంతగా పట్టించుకోవడంలేదు. ప్రస్తుతం అర్చన సౌందర్యాన్ని అర్చించే విధానంలో తల మునకలుగా వున్నాడు.

నీలిమ మైక్రోసాఫ్ట్ కంపెనీ సియాటెల్‌కి మారిపోయింది. వాళ్ళు ఎక్కువ పేమెంట్ ఆఫర్ చేయడంతో వెళ్ళేముందు క్యాజువల్‌గా కార్తీక్‌తో చెప్పినప్పుడు అతడికి మరో విషయమూ అర్థమయింది నీలిమ తన నుంచి దూరంగా వెళ్ళాలనుకుందని!

★ ★ ★

అర్చనకూ, రాకేష్‌కీ వైభవంగా పెళ్ళిచేశాడు జయచంద్ర. అంతా కలిసే వుంటున్నారు. 'ఉద్యోగం చేయడం, మానడం నీ ఇష్టమే' అని సుచిత్ర చెప్పినప్పుడు అర్చన కొనసాగించడానికే నిర్ణయించుకుంది. అయితే ఈ నర్సింగ్ ప్రొఫెషన్‌లో ఎప్పుడు కావాలంటే అప్పుడు మానుకోవచ్చు ఎప్పుడైనా హాస్పిటల్‌లో చేరవచ్చు కూడా!

నందితా, ఫిలిప్స్ కూడా మరో ఊరికి మారిపోయారు.

నీలిమ గురించే ఆలోచిస్తూ వుండేది.

అయితే నీలిమ పెళ్ళి ఆలోచన విరమించుకుని లోన్లీగా వుండాలనే నిర్ణయించుకున్నట్లు అర్థమై జయచంద్రా, తనూ ఒకసారి చెప్పి చూసినా ఫలితం లేక ఊరకుండిపోవలసి వచ్చింది.

నందితకి రెండోసారి ట్విన్స్ పాపలు పుట్టారు. నేనో పాపను పెంచుకుంటాను అంటూ తీసుకుపోయింది నీలిమ. నందిత కూడా ఇద్దర్నీ చూసుకోవడం కష్టమని, పరాయిదికాదు, స్వంత చెల్లెలేకదాని సంతోషంగా ఒప్పుకుంది. ఈ సంఘటనతో నీలిమ ఇక పెళ్ళి చేసుకోదనే నిర్ధారణకు వచ్చారంతా.

అసలు కార్తీక్, నీలిమా పెళ్ళి చేసుకుని వుంటే బాగుండుననుకున్నారు సుచిత్రా, జయచంద్రలు. ఇద్దరి మనసుల్లో ఏముందో




కానీ ఎవరికివాళ్ళు ఒంటరిగా మిగిలిపో యారు.

ఇండియా అమ్మాయిని పెళ్ళి చేసుకోవా లని ఏ కోశాన అనుకోని రాకేష్ విచిత్రంగా అర్చనను ఇష్టపడ్డాడు. అనుకోనివి జరగ డమే జీవితం. అయితే అన్నీ మంచిగానే వున్నాయి నీలిమ నిర్ణయం తప్ప.

★ ★ ★

రెండు సంవత్సరాలు గడిచేసరికి అభి రామ్ గురించి లూసీకి బాగా తెలిసివ చ్చింది. అతనొక అవకాశవాది. ఎంతసేపూ అమెరికాలో ఎంజాయ్ చేయాలనుకోవడం తప్ప, కంపెనీ బాగు పట్టించుకోకపోవడం, అతని మూలంగా కార్తీక్, నీలిమలు బైటకు వెళ్ళిపోవడంతో లూసీకి అతనితో తలనొ ప్పిగా తయారైంది. అసలు నీలిమా, లూసీ చాలాకాలంగా ఫ్రెండ్స్. నీలిమ వెళ్ళిపోతుం దని లూసీ ఎన్నడూ ఊహించలేదు. మనసు చికాగ్గా అనిపించి నీలిమను పిల్చింది ఓరోజు.

అభిరామ్‌ని అమెరికా తీసుకురావడంలో చాలా పొరబాటు జరిగిపోయిందని, అతడి వైఖరి గురించీ అన్నీ చెప్పినప్పుడు నీలిమ కూడా చెప్పేసింది లూసీతో. అతని కారణం గానే కార్తీక్, నేనూ బైటకు వచ్చేశామని.

ఆ తర్వాత లూసీ అభిరామ్‌ని నిలేసింది. అతను తడుముకోకుండా చెప్పాడు.

"అవును లూసీ, నేను అమెరికా రావాలని చేసిన ప్రయత్నాలు ఫలించక, నిన్ను ప్రేమించినట్టు యాక్ట్ చేశాను. పెళ్ళయి, గ్రీన్‌కార్డ్ వచ్చాక, మా ఇండియన్ ట్రెడిషన్ ప్రకారం నీ కంపెనీకి, నీకు యజమానిని నేనే అయ్యాను. నా ఇష్టం వచ్చినట్టు వుంటాను. నచ్చకపోతే డైవోర్స్ తీసు కుందాం. నా గ్రీన్‌కార్డ్ సేఫ్టీగా వుంటుంది" అన్నాడు నిర్లక్ష్యంగా.

"మీ ఇండియన్స్ భార్యను బాగా చూసు కుంటారని, చిన్నచిన్న బేదాభిప్రాయాలు వచ్చినా సర్దుకుపోతారనీ, ప్రేమాభిమానా లతో వుంటారని, వివాహ వ్యవస్థను గౌరవి స్తారనీ ఎన్నో అనుకుని నిన్ను ఈ దేశం తీసుకువచ్చాను. కానీ నువ్వొక మోసగాడి వని తెలిసివచ్చింది. పోలీస్ రిపోర్ట్ ఇచ్చా నంటే ఎందుకూ కొరగాకుండాపోయి జైల్లో కూర్చుంటావు. అయినా బెంగుళూర్‌లో కొంతకాలం నా కంపెనీకి వర్క్ చేశావు కనుకా, జనార్ధనంగారిమీదా, జయచంద్రగా రిమీదా గల రెస్పెక్ట్‌తో విడిచిపెడుతు న్నాను. వెంటనే వెళ్ళిపో" అంటూ లూసీ అభిరామ్‌ని చీవాట్లు పెట్టింది.

ఈ విషయం తెలిసి ఎక్కువగా బాధప డ్డాడు కార్తీక్.

"అభిరామ్ ఇటువంటి సిగ్గుమాలిన పని చేస్తాడనుకోలేదు సర్! పాపం లూసీ అతణ్ణి ఎంతగానో నమ్మింది. అంతకన్నా కంపె నీలో మంచి ఉద్యోగం, పేమెంట్ ఇచ్చింది. కృతజ్ఞతలేని మనిషి. ఇతను మన ఇండి యన్ కావడం బాధ కలిగిస్తోంది సర్..." అన్నాడు జయచంద్రతో.

"మనం ఏం చేయగలం కార్తీక్. మనిష నేవాడికి ఉచ్చనీచాలు వుండాలి. తండ్రికి తీసిపోకుండా వున్నాడు అభిరామ్. ఒకర కంగా శశికాంత్ చాలా బెటర్ కదూ?" అన్నాడు జయచంద్ర.

"మనం ఒకసారి అతనితో మాట్లాడి నచ్చ చెబుదామా?" ఆశగా అన్నాడు కార్తీక్.

"అవును. నువ్వు చెప్పింది కరక్ట్. చెప్పి చూద్దాం" అని అభిరామ్‌కి కబురు చేశాడు జయచంద్ర.

"ఏమిటీ పిలిచారట" అంటూ వచ్చాడు అభిరామ్.

"అవును అభిరామ్! మీ నాన్నగారితోగల బంధుత్వరీత్యా, నీతో కొన్నిమాటలు చెప్పా లని పిలిచాను. లూసీ చాలా మంచి అమ్మాయి. నిన్ను మంచి పొజిషన్‌కి తీసు కువచ్చింది. నీతో పరిచయాన్ని అలాగే మిగల్చక, పెళ్ళి చేసుకుంది. ఆ అమ్మాయి కోరుకుంటే పెళ్ళిచేసుకోడానికి మిలీనియర్స్

సిద్ధంగా వున్నారు. కానీ మన భారతీయుల మీద మంచి అభిప్రాయంతో, ఫ్యామిలీ లైఫ్ సుదీర్ఘకాలం కొనసాగుతుందనే నమ్మకంతో నిన్ను సెలక్ట్ చేసుకుంది. నువ్వు చేసింది ఏమిటీ? మంచి మాటలతో ఆమెను మెప్పించి, ఒక ప్లాన్ ప్రకారం అమెరికా వచ్చావు. ఆ అమ్మాయి ఆశలన్నీ సర్వనాశనం చేశావు. మంచిది కాబట్టి నిన్ను తేలికగా వదిలిపెట్టింది. లేకుంటే ఏమైనా చేసేది. మీ ఇద్దరిమధ్యా వుండాల్సింది పటిష్టమైన ప్రేమబంధం. నువ్వు ఆ బంధాన్ని నిర్దాక్షిణ్యంగా తెంచివేశావ్. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. లూసీకి సారీచెప్పి, ఆమెతో కలిసి వుండు. మన సాంప్రదాయం నిలబెట్టు. నీ భవిష్యత్‌ని తీర్చిదిద్దుకో" అన్నాడు మంచిగా నచ్చచెబుతూ.

"జయచంద్ర అంకుల్! ఈ అమెరికన్ లేడీ గురించి నాకు బాగా తెలుసు. ఏ లాభం ఆశించకుండానే బెంగుళూర్‌లో కంపెనీ స్టార్ట్ చేసిందా? పెట్టుబడి మాదిగా, లాభం తనదిగా మంచి పథకం వేసి ఇండియా వచ్చింది. సులువుగా నేను ఆమె ట్రాప్‌లో పడిపోయాను. మా నాన్నగారూ, జయదేవ్ అంకుల్ పెట్టుబడికి సిద్ధపడ్డారు. అది మోసంకాదా? నేను చేసిందే మోసమా? అసలు ఈ కారణంగానే నేను లూసీకి బుద్ధిచెప్పాలని, ఎత్తుకు పైఎత్తు వేశాను. ఆవిడ చిత్తయింది. అంతే తప్ప నేను కొత్తగా ఆవిడను మోసం చేయలేదు" అన్నాడు అభిరామ్.

"చాలా దారుణంగా మాట్లాడుతున్నావ్ అభిరామ్. లూసీ ఒక బిజినెస్ హోల్డర్‌గా మీరు పార్ట్‌నర్‌షిప్ తీసుకుంటారా అని అడిగి వుండవచ్చు ఎవరినైనా అదే పద్ధతిలో హేండిల్ చేస్తారు. మీ ఫాదర్ కావచ్చు మరెవరైనా కావచ్చు అంతమాత్రాన మోసం చేయడం ఏమీలేదు. అదలా వుంచు. ఇక్కడికి వచ్చాక నీ ప్రవర్తనకు అర్థం? ఆమె అనుభవం ముందు నీ అనుభవం ఎంత? కంపెనీలో సబార్డినేట్స్‌ని ఎలా చూడాలో నీకు తెలియదు. ఇండియాలో వేరు. ఇక్కడ వేరు. కార్తీక్ ఇండియన్ అయినంత మాత్రాన అక్కడిలా ప్రవర్తించడం మంచిదా. ఇక నీకూ లూసీకి మధ్య జరిగిన పర్సనల్ మేటర్ గురించి నాకు తెలియదు కానీ, నీమీద ఎంతో నమ్మకంతో నిన్ను కోరి పెళ్ళిచేసుకుంది. ఇంత త్వరలో నీపట్ల మనసు విరిగిపోయిందంటే కారణాలు ఏవైనా వైవాహిక జీవితాన్ని విచ్ఛిన్నం చేసుకోవడం మంచిది కాదు. నీకు ఆమె అర్థం అయింది చాలా తక్కువ. నీ వ్యక్తిగత విషయంలో కలగచేసుకోవడం మంచిది కాకపోయినా నీ శ్రేయోభిలాషిగా చెప్పాను. తొందరపడి లూసీని దూరం చేసుకోకు. ఆ అమ్మాయికి సారీ చెప్పి, జరిగింది మరిచిపొమ్మని, ఇద్దరూ హాపీగా వుండండి. లూసీవలన ఈ కంట్రీకి వచ్చి అవసరం తీరిపోయాక విశ్వాస ఘాతకుడిలా ప్రవర్తించడం మంచిదికాదు అభిరామ్. ఈ విషయం చెప్పాలనే నిన్ను పిలిచాను" అన్నాడు జయచంద్ర అభిరామ్‌ని మందలిస్తూ.

అభిరామ్ ఏమనుకున్నాడో జవాబు చెప్పలేదు కానీ ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు.

"అభిరామ్! మనిద్దరం పరిచయస్తులం. కలిసి పనిచేశాం. ఒకే కంట్రీనుంచి వచ్చాం. నేను చేసిన పనిలో తప్పుంటే తప్పకుండా సరిచెయ్. కానీ నువ్వు చేసిన పనిమాత్రం మంచిదికాదు. కంపెనీలో ఒక టెంపర్‌మెంట్‌తో చాలా హీనంగా మాట్లాడావు. ఇంటికి పిల్చి నా తప్పు ఏమిటో చెప్పి వుంటే దిద్దుకునేవాణ్ణి. కానీ కారణం లేకుండా అవమానించడం నాకు బాధ కలిగించింది. అందుకే బైటకు వచ్చాను తప్ప లూసీపట్ల నా రెస్పెక్ట్ చెక్కు చెదరలేదు. ఇకముందూ అలాగే వుంటుంది కూడా" తన మనసులో మాటను వెల్లడించాడు కార్తీక్.

"సారీ కార్తీక్! ఆరోజు ఎందుకలా ప్రవ




ర్తించానో నాకే తెలియదు. ఆ తర్వాత నన్ను నేను చాలా నిందించుకున్నాను. అది నా పొరబాటే అని ఒప్పుకుంటున్నాను" అన్నాడు.

"ఇలాగే లూసీ దగ్గర కూడా తప్పు ఒప్పుకుని సారీ చెప్పు. అంతా సరి అవుతుంది" అన్నాడు కార్తీక్.

ఆ తర్వాత నీలిమ చెప్పింది అభి తన కంపెనీలో ట్రై చేస్తున్నాడని. 'అంటే లూసీ దగ్గర వుండాలని అనుకోవడం లేదన్న మాట. పూర్ ఫెలో' అనుకున్నాడు జయచంద్ర

ఈ సంఘటన లూసీమీద ఎంతవరకూ ప్రభావం చూపించిందో తెలియదుకానీ కార్తీక్‌తో చెప్పింది ఓసారి.

"కార్తీక్... అభీని తీసుకువచ్చి పెద్ద పొరబాటు చేశాను. తగిన ఫలితం అనుభవించాను. పోనీ అంతటితో వూరుకున్నా బాగుండేది. పెళ్ళి చేసుకోవడం మరో పొరబాటు. నా లైఫ్‌లో ఎప్పుడూ రాంగ్ స్టెప్ వేయలేదు. ఇదే మొదటిదీ, ఆఖరిదీ" అంది తన బాధను కార్తీక్‌తో పంచుకుంటూ.

"లూసీ... ఎలాంటివారమైనా ఒక్కోసారి కొన్ని పొరబాట్లు జరుగుతాయి. కావాలని చేయకపోవచ్చు. పరిస్థితులు కూడా కారణం కావచ్చు లీవ్ దట్ మేటర్. నీకు అభ్యంతరం లేకపోతే నేను నీ లైఫ్ పార్ట్‌నర్ కావాలనుకుంటున్నాను. అంగీకరిస్తావా? " అడిగాడు కార్తీక్.

"నిజంగానా కార్తీక్? ఇప్పుడు జరిగినదంతా తెలిసి కూడా నన్ను కోరుకుంటున్నావా? అసలు నువ్వు నీలిమను పెళ్ళి చేసుకుంటావనుకున్నాను. ఎందుకంటే నీకు గుర్తుందా? నువ్వు వచ్చిన కొత్తలో నిన్ను ఇష్టపడితే నీనుంచి ఎటువంటి రెస్పాన్స్ లేదు"

చాలారోజులు నా వైపు తిప్పుకోవాలని ప్రయత్నించాను. చివరికి నీలిమను కోరుకున్నావేమో నేను తీసుకువచ్చిన కారణంగా ఆ మాట చెప్పడానికి సంకోచిస్తున్నావేమో అని అర్థం చేసుకుని అభిరామ్‌ని ఎంచుకున్నాను. అక్కడే పొరబాటు జరిగిపోయింది కదూ? ఇప్పుడు నువ్వే అడుగుతుంటే నమ్మకం కలగటంలేదు. నిజం చెప్పు సరదాగా అంటున్నావా? "

"నిజంగానే చెబుతున్నాను లూసీ. ఒకప్పుడు మీ ఇద్దరి గురించీ ఆలోచించి సందిగ్ధంలో పడినమాట కాదనలేను. నా అభివృద్ధికోరి, ఇండియాలోనూ, ఇక్కడికి వచ్చిన తర్వాత కూడా నాకు మంచి గైడెన్స్ ఇచ్చావు. నీ ఎంకరేజ్‌మెంట్ వల్లనే నేను ఇక్కడ సెటిల్ కాగలిగాను లూసీ. అది నాకెప్పుడూ గుర్తుంటుంది" అన్నాడు కార్తీక్.

"అంటే నువ్వు నన్ను లవ్ చేయడం లేదా? కేవలం రెస్పెక్ట్‌తో కృతజ్ఞతతోనే కోరుకుంటావా? " సందేహంగా అడిగింది లూసీ.

"లవ్, ఎఫెక్షన్, రెస్పెక్ట్ కలిసే వుంటాయి లూసీ. వేరుగా కాదు. అయితే వెంటనే ఎందుకు వెల్లడించలేదని నువ్వు సందేహించావేమో! చెప్పానుగా నీలిమపట్ల ఎట్రాక్ట్ కావడం, నీమీద రెస్పెక్ట్ నన్ను కన్‌ఫ్యూజ్ చేయడంతో ఒక నిర్ధారణకు రాలేకపోయాను. అందులోనూ మీరిద్దరూ క్లోజ్ ఫ్రెండ్స్ కదా! అదే కారణం. మరోలా అపార్థం చేసుకోకు ప్లీజ్" సిన్సియర్‌గా చెప్పాడు కార్తీక్.

"నిన్ను నమ్మకుండా వుండను కార్తీక్ ఒకసారి దెబ్బతిన్నాక నిజమా కాదా అనే సంశయం కలిగింది అంతే! నిన్ను చూశాకనే అభిరామ్ కూడా నీలాగ వుంటాడని నమ్మాను. తర్వాత తెలిసింది, నీకూ అతడికీ వర్క్‌లోనే కాదు నేచర్‌లో కూడా ఎంతో తేడా వుందని. వర్క్ సిన్సియారిటీ లేకపోతే నేను నేర్పవచ్చులే అనుకున్నాను. కాని అతడి నేచర్‌ని మాత్రం మార్చలేకపో

యాను. ఇకనుంచి అభి పేరు పొరబాటున కూడా తల్చుకోను. కార్తీక్! చెంతనుండి కూడా చాలా దూరంగా వుండిపోయాం. ఇప్పుడు నా దగ్గరకు రావడానికి సంకోచం ఎందుకు? వచ్చెయ్. కంపెనీ మనిద్దరిదీ" అంది లూసీ సంతోషంగా.

"లూసీ! ఈ ఒక్క విషయంలోనూ నన్ను మన్నించు. ఒక్కసారి ఏదో కారణంగా బైటికి వచ్చి జయచంద్ర సర్ దగ్గిర చేరాను. వెనక్కి రాలేను. నువ్వు అన్నివిధాలా సమర్థురాలివి. నేను లేకపోయినా ఫర్వాలేదు. ఇంతకుముందు నువ్వు ఒక్కదానివేకదా మానేజ్ చేశావు. ఇప్పుడు కూడా నువ్వు కోరిన ఎటువంటి సలహా అయినా పాటించడానికి సిద్ధంగా వున్నాను. వేరే చోట వుంటేనేం? సరేనా!" అన్నాడు కార్తీక్ లూసీని అనునయిస్తూ.

"అంతేనా లేక జయచంద్ర మీ ఇండియన్ అనే పార్షియాలిటీయా?" నవ్వుతూ అడిగింది లూసీ.

"నోనో అదేమీలేదు. ఎంత మాత్రమూ నాకాభేదం లేదని నీకు బాగా తెలుసు. సరదాగా అంటున్నావ్‌కదూ?" అన్నాడు కార్తీక్ ఆందోళనగా.

"జస్ట్‌ఫర్ ఫన్. అయ్ లవ్‌యు కార్తీక్" అంటూ అతడ్ని దగ్గరగా హత్తుకుంది కరిగిపోయిన లూసీ. కార్తీక్ ఆమెను పసివాడిలా అల్లుకుపోయాడు. ఇప్పుడు అతడి మనసు ఎంతో నిశ్చలంగా వుంది. ఎన్నేళ్ల ఒంటరితనమో ఇప్పటికి జంటను చేరుకుంది. 'నా జీవితంలోకి ఎవరిని ఆహ్వానించాలో తెలియక అయోమయంలో చాలా కాలం వృథా అయింది. ఇప్పుడిక ఆనందమయంగా సాగిపోతుంది. నేను కలలో కూడా అనుకోలేదు. ముందుగా ఇలా జరగాలని అనుకోనూ లేదు. రేపు జనార్ధనం గారికి ఫోన్ చేసి చెబితే నేను స్థిరపడినందుకు ఎంతగానో సంతోషపడతారు' అనుకున్నాడు కార్తీక్.



"నీలిమా! నేను ఇప్పుడు వట్టి బికారిని. నాకు నీ సపోర్ట్ కావాలి. అందుకే నీదగ్గిరకు వచ్చేశాను" అన్నాడు అభిరామ్.

"నేను చేయగల హెల్ప్ ఏముంది అభిరామ్! డాడ్‌ని ఏమైనా అడిగితే ఫలితం వుండేదేమో" అంది నీలిమ తనకేమాత్రం ఇంట్రస్ట్ లేనట్టు.

అంతటితో వదిలి పెట్టేస్తే ఎలా? భవిష్యత్ ఏమిటి అనుకుని "నేను ఇక్కడ వుండాలంటే నీ సహాయం కావాలి. అంటే మనిద్దరం పెళ్లి చేసుకుంటేనే అది సాధ్యం" అనాలోచితంగా అనేశాడు అభిరామ్.

"నువ్విక్కడ వుండాలని నేనేమీ కోరుకోవడంలేదు" ఠకీమని చెప్పింది నీలిమ.

"మనం మనం ఒక దేశీయులం. ఒకరికొకరు హెల్ప్ చేసుకోవాలి. నువ్వే నన్ను కష్టంనుంచి గట్టెక్కించాలి. లూసీ భ్రమలో పడి గుడ్డిగా వచ్చేశాను" అన్నాడు దీనంగా.

"చూడు మిస్టర్ అభిరామ్. మొదట్నించీ నీమీద నాకెటువంటి అభిప్రాయమూలేదు. ఇప్పుడు సడన్‌గా ఎలా పుట్టుకువస్తుంది.




సారీ! నానుంచి నువ్వేమీ ఆశించవద్దు. నాక సలు పెళ్లిచేసుకోవాలనిలేదు" అంది స్పష్టంగా చెబుతూ.

"అవును, మీరు ఇండియన్స్ అయినా అమెరికన్ సిటిజన్స్. ఇంకా మీలో భారతీయత వుందనుకోవడం నా పొరబాటు. మీకు పెళ్లి అవసరంలేదు నిజమే! కనుక నేను నీ బాయ్ ఫ్రెండ్‌గా వుంటాను. దీనికైతే అభ్యంతరం లేదుగా? " అన్నాడు అభిరామ్.

అందితే జుట్టు, అందకపోతే కాళ్లు. నీలాటి వాడు స్థిరమైన మాట మీద నిలబడడు. అని మనసులో అనుకుని పైకి "ఇంతగా అడుగుతున్నావ్ కాబట్టి నువ్వు చెప్పినట్టు మనం ఒకే దేశస్థులం కాబట్టి, నాకు బాయ్‌ఫ్రెండ్ అయ్యే అర్హత నీకు లేదు కాబట్టి మా ఇంట్లో పాపకి బేబీసిట్టర్‌గా వుండు. ఇదొక్కటే నేను చేయగల హెల్ప్" అంది నిస్సంకోచంగా నీలిమ.

"అలాగే వుంటాను. అంతేకాదు సర్వెంట్‌గా కూడా వుండి, నీ ఇల్లు చూసుకుంటాను" అన్నాడు అభిరామ్ ఈమాత్రం నిలవనీడ దొరికితే చాలని.

తనీమాట అనగానే కోపం వస్తుందనీ, ఎన్నో మాటలు అంటాడనీ అనుకున్న నీలిమ అతడు అంగీకరించగానే తెల్లబోయింది. వూరికేనే అతడెలాగా ఒప్పుకోడు. చేసేదిలేక వెనక్కి వెళ్లిపోతాడనుకుంది. కాని అన్నిటికీ సిద్ధమయ్యాడని నవ్వుకుంది.

ఈ విషయాన్ని ఇంటికి ఫోన్ చేసినప్పుడు అందరితోనూ చెప్పింది.

"ముందు ముందు ఏం చేయాలనుకుంటున్నాడో? ఇండియా మాత్రం వెళ్లేలాలేదు" అన్నాడు జయచంద్ర.

"అభిరామ్‌కి ఒక అభిప్రాయం అంటూ నిలకడగా వుండదు. గాలివాటుగా ఆలోచన రావడం తరవాయి అటువైపు మొగ్గుతూ ఉంటాడు. ఇలాంటి వ్యక్తి చాలా ప్రమాదకరమైన వాడు. ఇక్కడా స్థిరంగా వుండడు. మరొకరికి గాలం వేసేవరకే! పోనీలే నీకు బంధువు కదాని ఈమాత్రం ఆధారం చూపించావు. నన్నేమీ తప్పుపట్టకు డాడ్" అంది నీలిమ.

"అసలు నువ్వూ, లూసీ క్లోజ్ ఫ్రెండ్సని, ఆ అమ్మాయిని మోసం చేస్తే నీకూ కోపం వస్తుందనీ అర్థం చేసుకోడేం. పోన్లే అతడి దారిన అతడ్ని పోనీ. మంచిపని చేశావ్" అని కూతుర్ని మెచ్చుకున్నాడు జయచంద్ర.

"డాడ్! కార్తీక్, లూసీ ఫోన్‌చేసి చెప్పారు. వాళ్లిద్దరూ కలిశారటకదా? " మామూలుగా చెబుతున్నా, ఆ గొంతులో ఏదో నిరాశ ధ్వనించింది.

"అవును. లూసీ ఒక మంచి నిర్ణయాన్ని ఆలస్యంగా తీసుకుంది. మామ్‌తో మాట్లాడు" అని సుచిత్రకి ఇచ్చాడు జయచంద్ర. నీలిమ జీరపోయిన గొంతులో నిరాశను భరించలేక.

"నీలూ! నేను మాత్రం చాలా డిసప్పాయంట్ అయ్యానురా. నేను నిన్నూ, కార్తీక్‌ను ఊహించుకున్నాను" అంది సుచిత్ర.

"మామ్! ఈరోజు నీతో చెబుతున్నాను. నేను కూడా కార్తీక్‌ని ఆశించాను. కానీ లూసీ అంటే అతడికి ఇష్టం అని గ్రహించాను. అందుకే చాలాకాలం అతను తన అభిప్రాయం చెప్పలేదు. బహుశా అభిరామ్, లూసీల సెపరేషన్ గురించి అతడు ముందే ఊహించి వుండచ్చు అందుకే వెయిట్ చేశాడని అనిపిస్తోంది. కార్తీక్ ఆ సందిగ్ధంలో వున్నందున, నేను కూడా మాట్లాడలేదు. పోనీయ్, ఇప్పుడు కలిశారు. లూసీకి నేను కంపెనీ పార్టనర్‌ని ఒకప్పుడు. అందుకు నాకు సంతోషంగానే వుంది" తెచ్చిపెట్టుకున్న ఆనందంతో చెబుతోంది నీలిమ అని కన్నతల్లి గ్రహించింది. అయితే ఏంచేయగలదు? 'ఎవరి లైఫ్‌ని ఎలా విధి నిర్ణయించగలదో' అనుకుంది.

"మరి ఇక ఎవరూ నీ మనసులో లేరా




నీలూ? " ఆప్యాయంగా అడిగింది సుచిత్ర.

"ఇప్పటికి ఎవరూలేరు అమ్మా! ఇక ముందు సంగతి చెప్పలేదు" నీలిమ తల్లిని మామ్ అనీ, అమ్మా అనీ పిలుస్తూంటుంది. అదో అలవాటు.

"కార్తీక్‌ని, లూసీని తప్పించుకోవడానికేనా మాకు దూరంగా వెళ్ళిపోయావు? నీమీద దిగులుగా వుందిరా నీలూ..." ఆర్ద్రంగా అంది సుచిత్ర.

"అయితే వచ్చేయ్ అమ్మా! కొద్దిరోజులు వుండి వెడుదువుగానీ. అమలను చూసి చాలా రోజులైంది. ఇప్పుడది ఎన్ని కబుర్లు చెబుతోందో. మొన్నీమధ్య అక్క వచ్చినప్పుడు దాని దగ్గరకు పోనేలేదు. నా దగ్గిరే హత్తుకుపోయింది" అంటూ నందిత కూతురు గురించి చెప్పింది.

"అలాగే అనుకుంటున్నాను. నెక్స్ట్ వీక్ డాడ్, నేనూ ఇద్దరమూ ప్లాన్ చేయాలి" అంది.

"అలా అంటావు కానీ రావు. నీకు మాకంటే అర్చన ఎక్కువైపోయిందిలే" సరదాగా అంది నీలిమ.

"ఎక్కువ కాదమ్మా! అందరూ ఒకటే నాకు. వస్తానుగా. రేపే టికెట్ రిజర్వ్‌చేసి ఫోన్‌చేస్తాను. ఓకే? " అంది.

"ఆర్ యూ ష్యూర్? " అడిగింది నీలిమ.

"ష్యూర్" చెప్పింది సుచిత్ర.

ఇద్దరూ వచ్చేసరికి నీలిమ చెప్పినట్టు అభిరామ్ వెళ్లిపోయాడు.

"ఎక్కడికి పోయాడో ప్రబుద్ధుడు? " అన్నాడు జయచంద్ర.

"ఎవరో ఒకమ్మాయితో (సిటిజన్‌తో) ఫ్రెండ్‌షిప్ ప్రారంభించాడు. ఆ తర్వాత ఆ అమ్మాయిని రిజిస్టర్ మారేజ్ చేసుకున్నాను అన్నాడు. ఇప్పుడా అమ్మాయి దగ్గిరే వుంటున్నాడు. ఆ అమ్మాయి ఇండియన్ కాదు, వయసు ఏభై సంవత్సరాలుంటాయి. ఇదిగో ఫొటో" అంటూ చూపించింది నీలిమ.

"అవున్లే ఇక్కడ ఏభై సంవత్సరాల వాళ్లని కూడా అమ్మాయిలనే అనాలి. లేకపోతే తంతారు. అందులోనూ బ్లాక్" అంటూ నవ్వాడు జయచంద్ర.

"చివరికిలా సెటిల్ అయాడన్నమాట. కొందరు ఇండియన్స్‌ని అమెరికా మోజు ఏ పనైనా చేయిస్తుందన్నమాట. చదువుంది. మంచి జాబ్ వుంది. ఫాదర్‌కీ మంచి పేరు, ప్రతిష్ఠలున్నాయ్. ఇండియాలో వుంటే ఏంటి నష్టం? లూసీకి మాయమాటలు చెప్పి ఈ దేశం వచ్చి సాధించిందీ ఏమీ లేదు. కొందరు భవిష్యత్‌ను ఎలా పాడుచేసుకుంటారో..." అంది సుచిత్ర.

నందిత కూతురు అమలతో కాలమే తెలియదు. ఒక వారం గడిపి కాలిఫోర్నియా వెళ్లాలని బయలుదేరుతూ "అమ్మాని నేను తీసుకు వెడతాను. అక్కడ బోర్‌గా వుంది" అంటూంటే నీలిమకి పంపడం ఇష్టంలేకపోయినా రెండేళ్ల తర్వాత తీసుకువస్తే అంత ఇబ్బంది వుండదనిపించింది.

"సరే తీసికెళ్లు. నేనూ వస్తూంటాలే" అంది తప్పనిసరిగా పాపను పంపుతూ.

అర్చనకి సంతానంలేరు. ఎందరో డాక్టర్స్ పరీక్షించి సారీ అన్నారు. ఇప్పుడు అమలతో కొంత ముచ్చట తీరుతుంది అనే ఆలోచనతో తీసుకు వచ్చింది సుచిత్ర.

ఇప్పుడు ఇక అమల అల్లరికి అంతేలేదు. దాన్ని నలుగురూ ముద్దు చేస్తున్నారు.

నీలిమకి నాలుగురోజులు అమలమీద బెంగ అనిపించినా వాళ్ల ముచ్చటా తీరుతుంది. పైగా నలుగురు వున్నారు చూసుకోవడానికి అనుకుంది.

అమల రెండో సంవత్సరం పుట్టినరోజుకి అంతా కలిశారు. నందిత అమలను ఈసారి తనతో తీసుకు వెడతానంది. తల్లి ప్రేమ కానీ నీలిమ ససేమిరా ఒప్పుకోలేదు. "ముందేమో అడిగితే అలాగే తీసుకెళ్లు. దాని బాధ్యతంతా పూర్తిగా నీదే అన్నావు. ఇప్పుడు నా కూతుర్ని నేను తీసుకుపోతాన

నడం ఏం న్యాయం? పెంచింది నేను. నేనివ్వను" అంది నీలిమ.

"అప్పుడేదో అన్నానులే! కానీ నాకు ఇప్పుడు తీసుకువెళ్లాలని వుంది" అంటూ కళ్లనీరు తెచ్చుకుంటే ఫిలిప్స్ ఓదార్చి "పాపం నీలూ ప్రాణాలన్నీ అమలమీద వుంచుకుని పెంచింది. ఇప్పుడు తీసుకు వెడతాననడం న్యాయం కాదు నందూ! ఒంటరిగా వున్న నీలూకి పాప తోడు చాలా అవసరం. వుండనీయ్! అంతగా అయితే నీలూని మన ఊరు వచ్చేయమందాం. అప్పుడు మీ ఇద్దరికీ కనిపిస్తుంటుంది బేబీ" అన్నాడు ఇద్దరికీ మధ్య రాజీ చేస్తూ.

"ఇది బాగుంది ఫిలిప్స్! నేను మా మేనేజర్ని అక్కడికి మారే అవకాశం వుంటుందా అని అడుగుతాను" సంతోషంగా చెప్పింది నీలిమ.

నీలిమను చూసిన కార్తీక్ మనసులో అనుకున్నాడు, 'నా కారణంగానే నీలిమ అన్ మారిడ్‌గా వుండిపోయిందా' అని! సుచిత్రా, జయచంద్రలు కూడా నీలిమ నిర్ణయానికి బాధపడ్డారు. 'ఒకోసారి ఒకర్ని చూసి ఇష్టపడతాం. జీవిత భాగస్వామి అయే అవకాశం లేనంత మాత్రాన పూర్తిగా ఇలా ఒంటరిగా మిగిలిపోవలసిన అవసరం ఏముంది? అంతకుమించిన వారు లోకంలో ఇక లేనేలేరా? ఒక్కొక్కరిలో ఒకో గుణం మనకు నచ్చుతుంది. అలా అని అందరూ జీవిత భాగస్వాములు కాలేరు కదా? లైఫ్ పార్ట్‌నర్ అయేది ఒక్కరే! ఎప్పటికైనా నీలిమ మనసు మారదా?' అనే ఆశతో ఎదురు చూస్తున్నారు. జనార్ధనం, జానకీ జరుగుతున్న ఒక్కొక్క సంఘటనను తెలుసుకుని ఇలా జరుగుతుందనుకోలేదు అనుకోవడం తప్పితే ఏమీ చేయలేకపోయారు. ఎప్పుడైతే లూసీ, అభిరామ్ కలిశారో ఇక కార్తీక్, నీలిమా పెళ్లి చేసుకుంటారనే భావించారు. అభిరామ్ దురుసుతనంతో ప్రవర్తించడం, అతి త్వరలోనే లూసీ నుంచి విడిపోవడం, కార్తీక్, లూసీలు కలవడం చివరికి నీలిమ ఒంటరిగా మిగిలిపోవడం అయోమయంగా తోచింది.

జయచంద్ర చాలా ముందుచూపుతో నీలిమకు మంచి వరుణ్ణి తెచ్చుకోవాలనే ఆలోచనతో ఎన్నో ప్రణాళికలు వేసుకున్నాడు. కాని అవేమీ సత్ఫలితాలను ఇవ్వలేదు. విదేశాలలో స్థిరపడిన కుటుంబాల్లో రకరకాల పరిణామాలు జరుగుతున్నాయి. కొందరు ఎక్కడ ఏదేశంలో వున్నా తల్లితండ్రుల సాంప్రదాయాలకు అనుగుణంగా నడుచుకుని ఇండియన్ అమ్మాయిలనే పెళ్లిచేసుకున్నారు. అలా అని వారి జీవితాలు సరియైన మార్గంలోనూ నడవలేదు.

★ ★ ★

"మనం వెళ్లినప్పుడు ఇందిరగారని ఒకావిడను సుచిత్ర పరిచయం చేసింది. ఆవిడ చాలా మంచి మనిషి. పిల్లలను భారతీయ సాంప్రదాయంలో పెంచి పెద్దచేసి అన్ని విషయాలూ వివరించి ఈ దేశానికి, పరాయి దేశానికి గల తేడాను, పద్ధతులను చక్కగా తెలియచెప్పి కొన్నాళ్లు అబ్బాయి, అమ్మాయిలు ఒకరినొకరు అర్ధం చేసుకున్న తర్వాతనే వాళ్లంతట వాళ్లు అడిగిన తర్వాతనే కూతురికి పెళ్లి చేసినా ఇద్దరు పిల్లలు కలిగాక కూతురూ, అల్లుడూ అభిప్రాయభేదాలు వచ్చి విడిపోయారుట. విడివిడిగా వేరే పెళ్లిళ్లు చేసుకుని ఇప్పుడు బాగానే వున్నారు. అంటూ సుచిత్ర చెప్పింది. ఒకోసారి పెద్దవాళ్లు చేసిన పెళ్లి అయినా విఫలం కావచ్చు. పిల్లలు ఇష్టపడి చేసుకున్నప్పుడు సఫలమూ కావచ్చు" అంది జానకి భర్తతో.

"లోపం ఎవరిలో వుందని చెప్పగలం? ఒకరకంగా చిన్నప్పటి పెళ్లిళ్లే నయంగా తోస్తోంది. అయితే అలా అంటే ఒప్పుకునే వాళ్లే లేరు. చిన్నప్పుడు బలవంతంగా ఒప్పించి చేసినా జీవితాంతం ఆ భావన కృంగదీస్తుంది. మరి విదేశాలలో వుంటున్న వారి పిల్లలకు ఏరకంగా పెళ్లిళ్లు చేయాలి?




నిర్ణయాన్ని వారికే విడిచిపెట్టాలా? లేక మా మాట విని మేం చెప్పిన వాళ్లనే పెళ్లి చేసుకోమనాలా? విచిత్రం ఏమిటంటే జానకీ! అక్కడి అబ్బాయిలు, ఇండియన్ అమ్మాయిని పెళ్లి చేసుకోడానికి ఇష్టపడుతున్నా అక్కడి అమ్మాయిలు మాత్రం ఇండియన్ అబ్బాయిలను చేసుకోడానికి సిద్ధంగా లేరు. ఎందుకో తెలుసా? ఇక్కడ అబ్బాయిలు గ్రీన్‌కార్డు కోసమే పెళ్లికి అంగీకరిస్తారని. అభిరామ్ సంగతి చూశావుగా! ఒకవేళ చేసుకున్నా అబ్బాయిలు తీరా అమెరికా వెళ్లాక ఈ అమ్మాయివలన నేను అమెరికా రాగలిగానని నన్ను చిన్నచూపు చూస్తోంది అనే ఆత్మన్యూనతా భావంతో ఎప్పుడూ బాధపడుతూంటారు" అన్నాడు తన అభిప్రాయం చెబుతూ.

"కార్తీక్ కూడా అలా వెళ్లినట్టేకదా? వాడు లూసీ వలన వెళ్లానని ఏమీ బాధపడలేదుగా? పైగా అభిరాం లూసీకి డైవోర్స్ ఇచ్చినా వాడు చేసుకోననీ అనలేదు. వాళ్లిద్దరూ చక్కగా కాపురం చేసుకుంటున్నారు. ఒక విషయం అనిపిస్తుందండీ అసలు పరస్పరం ఇష్టం అంటూ వుంటే భేదాభిప్రాయాలు రావని. ఈ రకమైన ఇష్టంవల్లనే వీళ్లిద్దరూ సుఖంగా వున్నారు. కానీ మనం మరోసారి అమెరికా వెళ్లే అవకాశం లేదుకదా? " అంది దిగులుగా జానకి.

"అదా అసలు బాధ? జయచంద్రతో చెబుతాను. మీ పిన్ని ఓసారి రావాలనుకుంటోందని. అలాగే రమ్మంటాడు. దానికేం భాగ్యం? " అన్నాడు జనార్థనం.

"అలాని కాదు. ఏదో పెళ్లి, శుభకార్యం అంటే వెళ్లచ్చు ఊరికే సరదాగా వస్తానంటే ఏం బాగుంటుందీ ఎంత మేనల్లుడైనా. వూరికే అన్నాలెండి" అంటూ మాట మార్చింది జానకి. నిజానికి కార్తీక్ ఏమైనా

రమ్మంటే బాగుండునని ఆశగా వుంది ఆవిడకి. కొద్దిరోజుల తర్వాత జానకి కోరుకున్నట్టే కార్తీక్ ఫోన్ చేశాడు. 'నాకంటూ ఇండియాలో వున్న ఆత్మీయులు మీరే! ఇప్పుడు మిమ్మల్ని మా ఇంటికి తీసుకురావాలని ఆశపడుతున్నాను. కాదనవద్దు మీకెప్పుడు వీలుగా వుంటుందో చెబితే టిక్కెట్స్ పంపిస్తాను. మళ్ళీ వారం ఫోన్ చేస్తాను ఆలోచించి చెప్పండి' అన్నాడు.

జానకి సంతోషానికి అంతేలేదు. 'ఎంత బుద్ధిమంతుడు? మనల్ని మరచిపోకుండా రమ్మంటున్నాడు. ఇలాటివాళ్లు ఈ రోజుల్లో నూటికీ కోటికీ ఒకళ్లుంటారు. వాడి లెక్కే వేరు. బంగారు తండ్రి వాడికి మనం చేసింది ఏమీలేనేలేదు. కన్నబిడ్డకంటే ఎక్కువగా ఇంకా మనల్ని గుర్తువుంచుకున్నాడంటూ' మురిసిపోయింది.

"వాడు మనవాడు సరే! లూసీ? ఆపిల్ల చూడు. మనల్ని తీసుకురమ్మని చెప్పింది ఆ అమ్మాయేట. అదీ చెప్పుకోవలసింది. వెళ్లడం, వెళ్లకపోవడం వేరే విషయం. కొందరు మాటవరసకి అయినా చెప్పరు కావలసినవాళ్లయినా" అని.

"అసలు జయచంద్ర చేసిన పెద్దపొరబాటు ఏమిటంటే ఆరోజు నేను రాసిన ఉత్తరం చదవకపోవడం అనుకున్నానుకానీ, అసలు తప్పు నాది! తాతా, అమ్మమ్మని పెద్దవయసులో కార్తీక్ వదిలి వెడితే, వాళ్లు బెంగపడతారని జయచంద్రని వారించాను. అలాకాక కార్తీక్‌ని తీసుకువెళ్లడానికి ప్రోత్సహించి వుంటే, వేరేగా వుండేది జానకీ! అప్పుడు కార్తీక్ దగ్గిర మనకి మరింత స్వతంత్రం వుండేది. ఇప్పుడు ఎంతైనా లూసీ పరాయి దేశస్థురాలు. పద్ధతులు వేరుగా వుంటాయి. మన వలన వారికి ఇబ్బంది కలగవచ్చు. మంచీ మర్యాద కల అమ్మాయే కాని, మనకే ఏదో మొహమాటంగా అనిపిస్తుంది కదూ? " అన్నాడు.

"అవునండీ! మీరు చెప్పిందంతా అక్షరాలా నిజం. మరోసారి వస్తాం. ఇప్పుడేవో పన్లు వున్నాయని చెప్పండి" అంది జానకి అంతదాకా ఉత్సాహపడి, తీరా అవకాశం వచ్చాక, నిదానంగా ఆలోచించి.

జయచంద్ర నందిత కూతుళ్ళిద్దరి ఫొటోలు, ఫ్యామ్లీ ఫొటోలు పంపించాడు. చాలాసేపు అవే చూస్తుండిపోయారు భార్యాభర్తలిద్దరూ. "నీలిమ పెంచుతోందట అమలను. నందిత కూతుర్ని వదలటానికి బెంగపడుతూంటే 'నువ్వు ఈ ఊరు వచ్చేసెయ్' అన్నాడట ఫిలిప్స్. మరి ఏం చేస్తుందో నీలిమ! దాన్ని తల్చుకుంటే బాధగా వుంటుంది నాకు" అంది జానకి ఫొటోల్లో నీలిమను చూస్తూ.

"ఎందుకే బాధ? అక్కడ అలాటివి మామూలే! వాళ్ళమ్మా నాన్నలే అంతలా బాధపడరు. అక్కకూతుర్ని కాకపోయినా ఎవరో అనాథలనూ పెంచడం వాళ్లకి ఎంతో ఆనందంగా వుంటుంది. అదొక మంచిపని అని భావిస్తారు. ఒకొక్కక్కరికి ఒకో పనిలో ఆనందం వుంటుంది. దేశసేవ చేయాలని ఒకరికి అనిపిస్తుంది. సమాజసేవ కొందరికి, వికలాంగుల సేవ, అనాథాశ్రయం ఇలా రక రకాలుగా ఆశయాలుంటాయి. వాటిని నిర్వ ర్తించడంలో వాళ్లకు ఎంతో సంతోషం కలుగు తుంది. వీటికి సంసారం, స్వార్థం అనే ఆలో చనరాదు. అటువంటి కోవకు చెందినదే నీలిమ. అమ్మాయిని అభినందించాలి కానీ, ఏదో నష్టపోయిందని భావించరాదు. అందరి శ్రేయస్సు కోరి ఆశీర్వదించి మన పెద్దరికాన్ని నిలబెట్టుకోవాలి. ఇప్పుడే కార్తీక్‌కి జయచం ద్రకీ వివరంగా ఉత్తరాలు రాద్దాం. ఫోన్లో ఇన్ని మాటలు చెప్పలేం కదా?" అన్నాడు జనార్థనం.

★ ★ ★

"జయా! కంపెనీకి కార్తీక్ వచ్చాడు. కాని, వారసుడు అయ్యే అవకాశం అతడికి ఇస్తావా?" అడిగింది సుచిత్ర భర్తను.

"అతను నీలిమకు భర్త అయినప్పుడు, మన ఇంటికి అల్లుడు అయినప్పుడే ఆ అర్హత కలిగి వుండేది. ఇప్పుడు ఆ అవకాశంలేదు" అన్నాడు.





"నువ్వేమాట అన్నావు జయా! గుర్తుందా? నీలిమ వరుడి ఎంపికలో నేను ఫెయిల్ అయితే, అవకాశం నీకే ఇస్తానని" అంటూ గుర్తు చేసింది సుచిత్ర.

"అవును. గుర్తు వచ్చింది. కానీ ఇప్పుడు గుర్తుచేసి ప్రయోజనం ఏమిటి చిత్రా?"

"జయా! నువ్వు నా గురించి చాలా తక్కు వగా అంచనా వేశావు కదూ? నీతో చెప్ప కుండా నేనో సాహసం చేశాను. ఇప్పుడు నీ వద్రీ చూస్తే అది బయటపెట్టడం మంచి దిగా తోస్తోంది. నామీద కోపం తెచ్చుకోవు కదా?" అడిగింది సుచిత్ర.

"తెలిసీ నిన్ను ఎప్పుడూ తక్కువ చేయను చిత్రా. నువ్వు నా జీవిత సర్వస్వానివి. నువ్వు మన కుటుంబం కోసం నాతో చెప్ప కుండా ఏం చేసినా నాకు సంతోషం కదా? మన అందరి శ్రేయస్సు కోరేదానివి. చెప్పు" అన్నాడు జయచంద్ర.

"మీరు జనార్థనం మామతో కలసి మీ ఊరు వెళ్ళినప్పుడు, నేను అత్తను తీసుకుని కోల్‌కతా వెళ్లాను కదా? అప్పటికే మనం భార్గవ, జయదేవ్‌గారినీ కలిశాం. వారి అబ్బా యిలు మనకు ఏమాత్రమూ నచ్చలేదు. అంటే రూపురేఖలకు, ఆస్తిఅంతస్థులకూ కాదు. మనం కోరుకున్న వ్యక్తిత్వం లేనం దుకే! కోల్‌కతాలో నా చిన్ననాటి ఫ్రెండ్ శైతాలిని కలిశాను. ఆమెది చాలా విషాద చరిత్ర. భర్త యాక్సిడెంట్‌లో మరణించాడు. శైతాలికి ఏమందులకూ లొంగని అనా రోగ్యం. నేను వెళ్ళేసరికి చివరిదశలో వుంది. ఆవిడ కొడుక్కు ఆర్థిక సహాయంలేక, వున్న డబ్బు శైతాలి అనారోగ్యానికి కరిగిపోగా, అసహాయస్థితిలో చదువు మధ్యలో ఆగిపో యింది. నన్ను చూసి తన బాధలు వివరిం చింది. నేను వెంటనే ఆమె కొడుకు సందీ ప్‌ను నావెంట తీసుకువెడతాననీ, అతడి గురించి బాధపడవద్దని మాట ఇచ్చాను. రెండు రోజులకే ఆమె మరణించింది. సందీ ప్‌ను చూడగానే నాకు తప్పక సహాయం చేయాలని ఎందుకు అనిపించిందో తెలుసా?

# ఏరిన ముత్యాలు

★ గమ్యం చేరుకోవడం కంటే నమ్మకంతో ప్రయాణం చేయడం ముఖ్యం.

– టెన్నిసన్

★ తప్పు చేసిన మనిషి తనను బయటపెడతారనే భయం లేకుండా స్వేచ్ఛగా సంచరించలేడు.

– రామాయణం

★ లేని వస్తువును సంపాదించుకోవడం యోగం. సంపాదించిన వస్తువును కాపాడుకోవడం క్షేమం.

– చామ్‌ఫోర్ట్

★ నెరసిన జుట్టు వయసుకి చిహ్నమే కానీ వివేకానికి కాదు.

– శామ్యూల్ జాన్‌సన్

★ మీకు మూడుకోట్ల మంది దేముళ్ల మీద విశ్వాసం ఉన్నా ఆత్మవిశ్వాసం లేకపోతే మీకు ముక్తిలేదు.

– వివేకానంద

★ ముళ్ల మధ్య ఉన్న గులాబీ పువ్వు మందహాసం చేసినట్టే కష్టకాలం నడుమ ఉన్నప్పుడు నీవు కూడా ఉల్లాసంగా ఉండాలి.

– స్కాట్. ఫిట్జ్ గెరార్డ్

★ ఒక ఆశావాది మర్చిపోయేందుకు నవ్వుతాడు. ఒక నిరాశావాది నవ్వటం మర్చిపోతాడు.

– మార్గరెట్ సిరింగ్

★ కేవలం ముట్టే డబ్బుకోసం మాత్రమే పని చేసేవారికి అంతకిఅంతే తప్ప ఇంకేమీ ముట్టదు.

– ఎబ్బర్ట్

★ ప్రతి ఒక్కరినీ నమ్మడం ఎంత పొరపాటో ఏ ఒక్కరినీ నమ్మకపోవడం అంతే పొరపాటు.

– బట్లర్

★ దేముడు జీవితాన్ని సులభతరంగానే చేశాడు. దాన్ని జటిలం చేసినవాడు మానవుడే.

– స్వామీశివానంద

★ పరాజయభయం కలిగినవాడు తన పనిని పరిమితం చేసుకుంటాడు

– హెన్రీఫోర్డ్

సేకరణ: **అండమ్మ**

అతడిలో చేయూతలేక మరుగునపడిన విజ్ఞాన తృష్ణ. నేను ఇండియాలో చాలామందిని గమనించాను. ఇప్పుడు ఇండియాలో చాలా మార్పు వచ్చింది. టీనేజ్ పిల్లల్లో ఆడ, మగా కూడా నైతికవిలువలకు తిలోదకాలిచ్చారు. తల్లితండ్రులను లెక్కచేయరు. యూరోపియన్, వెస్ట్రన్ కల్చర్ బాగా వంటపట్టి, డేటింగ్, విచ్చలవిడి స్నేహాలు ఎక్కువయ్యాయి. కొందరు అమ్మాయిలనూ, అబ్బాయిలనూ అడిగితే పెళ్ళికి ముందు ఆడ మగా స్నేహాలు తప్పుకావని చెప్పారు. పెళ్ళిళ్ళు కూడా తల్లితండ్రుల ప్రమేయం లేకుండానే చేసుకుంటామన్నారు. 'మీది తొందరపాటు చర్య అయితే ఏం చేస్తారంటే' విచారిస్తూ ఓ మూల కూర్చోం. డైవోర్స్ తీసుకుని స్వేచ్ఛగా మాకాళ్లమీద మేం నిలబడతాం. అసలు పెళ్ళి అవసరమే మాకు కనిపించడంలేదు. అటువంటి బాధ్యతలకూ, బాదరబందీలకూ దూరంగా వుండటమే మాకు ఇష్టం అన్నారు. ఇవన్నీ చూస్తే నాకు తలతిరిగింది. మన



దేశం చాలా మారిపోయింది. ఒకప్పటి నైతి కసిద్ధాంతాలను సులువుగా తుడిచిపెట్టేశారు అని అర్థంచేసుకున్నాను. అందుకే షైతాలి కొడుకు సందీప్‌కి అమెరికా వచ్చే ఏర్పాట్లు చేశాను. మా అమ్మానాన్నల దగ్గిరకు చేర్చాను. అతను ఇప్పుడు నాతో చెప్పకుండా ఏ పనీ చేయడు. అతను ఎంత మంచిగా వున్నాడో చూస్తే నీకు ఆశ్చర్యం కలుగుతుంది. పిలిపించమంటే పిలిపిస్తాను" అంటూ చాలారోజులుగా దాచిన విషయం తెలియచేసింది.

"వాట్? చిత్రా నువ్వు, ఇంతమంచి పని చేయడం నాకు మాత్రం ఆనందం కాదా? పిలిపించు అతణ్ణి, తక్షణం పిలిపించు. అతన్ని చూడాలని నాకు చాలా ఆత్రుతగా వుంది" వుద్వేగంతో అన్నాడు జయచంద్ర.

మరో వారానికి సందీప్ వచ్చాడు. జయచంద్ర అతడ్ని చూసి చాలా సంతోషించాడు. నేను చేయలేని పని చిత్ర గుట్టుచప్పుడు కాకుండా చేసేసింది అని అతడు భార్య సాహసాన్ని మెచ్చుకున్నాడు.

అంతేకాదు నీలిమకీ సందీప్‌కీ కొద్దికాలం క్రితం పరిచయం చేసినప్పుడు, వారిమధ్య ప్రేమానురాగాలు ఏర్పడ్డాయనీ త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నారని కూడా జయచంద్రకు చెప్పింది సుచిత్ర.

"అదెలా జరిగిందో చెప్పు చిత్రా!" అడిగాడు భార్యను.

"నీలిమ మా అమ్మానాన్నలను చూడాలని వెళ్ళినప్పుడు సందీప్‌ని చూసింది. అదేం విచిత్రమో వెంటనే అతడితో చెప్పింది. 'నువ్వు కూడా సియాటిల్ వచ్చెయ్ సందూ' అని! అంతదాకా వాడు నీలూని చూడనేలేదు. నాకు ఫోన్‌చేసి అడిగాడు. 'నీలూ తనతో ఇటు రమ్మంటుంది వెళ్లనా? అని'

"నా ఇష్టప్రకారం చేయడం కాదు. నీకు వెళ్ళాలనిపిస్తే వెళ్లు. ఇక నీ మంచిచెడ్డలు నువ్వే నిర్ణయించుకోవాలి. ప్రతీది నేను చెప్పినట్టు చేయనవసరంలేదు. నా పర్మిషనూ అవసరంలేదు' అన్నాను. ఆ తర్వాత నీలిమ నాతో చెప్పింది. సందీప్ వచ్చాడనీ, అతన్ని ఇండియానుంచి తీసుకువచ్చిన విషయం మొన్ననే అమ్మమ్మద్వారా తెలిసిందనీ అతను తనకు చాలా నచ్చాడనీ, అందుకే వెంటనే తను వర్క్‌చేస్తున్న కంపెనీకి పిలిపించాననీ!

అప్పుడే నాకు అర్థం అయింది. సందీప్‌ని నీలూ లైక్‌చేస్తోందని, సందీప్ కూడా నీలిమ పట్ల ఇంట్రస్ట్‌తో వున్నాడనీ అర్థం అయింది. మరిప్పుడు నువ్వు, నీ కంపెనీలో సందీప్‌కి జాబ్ ఇస్తావో మానుకుంటావో ఆలోచించుకో" అంది సుచిత్ర.

"చిత్రా! నిజానికి కార్తీక్‌కి నేనేమీ సహాయపడవలసిన అవసరంలేదు. రాలేదు కూడా! నాన్నగారు చెప్పిన మాట ప్రకారం నేను ఇండియాలో సూర్యంగార్ని కలిసినప్పుడు కార్తీక్‌కి అవసరం అయితే సహాయపడాలనుకున్నాను. అప్పుడు అతను అందుబాటులో లేకపోవడంతో ఆ విషయం వదిలేశాను.

అసలైన సహాయం అందవలసిన సందీప్‌ని, సరియైన టైమ్‌లో ఆదుకుని, చాలా మంచి పని చేశావు చిత్రా! నాకు రాని అవకాశం నీకు లభించింది. అంతేకాక ఇక జీవితంలో పెళ్ళి గురించే ఆలోచించని నీలిమకు జీవితంపట్ల ఒక అవగాహనా, లక్ష్యం ఏర్పడేలా చేశావ్. తండ్రిగా నేను చేయవలసిన దానికంటే తల్లిగా నీలూ లైఫ్‌ని తీర్చిదిద్దావ్. నిన్ను అభినందిస్తున్నాను. ఇక, మన కంపెనీకి ఎంతవరకూ అర్హుడో చూడాలి. ఈ విషయంలో నిరాశ కలిగినా బాధలేదు. నీలూ లైఫ్ ముఖ్యంకదా మనకు. నా జీవిత సహచరిగా, నీ కర్తవ్యాన్ని ఎంతబాగా నిర్వహించావ్ చిత్రా" అంటూ మెచ్చుకోవడం సుచిత్రకి చెప్పలేనంత ఆనందం కలిగించింది.

అయితే ఇక అమలను నందితకి అప్పగించడానికి నీలిమ వెనకాడదు అనుకున్నారు ఇద్దరూ.

'ఈ గుడ్‌న్యూస్ బాబాయి వింటే చాలా ఆనందిస్తాడు. వెంటనే ఫోన్ చేయాలి అను




కుంటూ' జనార్ధనానికి ఫోన్ చేశాడు జయ చంద్ర.

"బాబాయ్, నీకో గుడ్ న్యూస్. నీలిమకి తగిన జోడీ కుదిరింది. సందీప్ అనీ చిత్ర ఫ్రెండ్ సన్ అతడు" అంటూ సందీప్ వివ రాలన్నీ చెప్పాడు.

"అలాగా, చాలా సంతోషంరా జయా! మీ పిన్ని నీలిమ గురించి ఒకటే బాధపడిపో యేది. అమ్మాయి జీవితం కుదుటపడిందని చాలా ఆనందిస్తుంది. అంతేకాదు సందీప్‌ని చూడాలి. పదండి వెడదాం అంటూ మళ్ళీ ప్రయాణం అవుతుందేమో" నవ్వుతూ అన్నాడు జనార్ధనం.

"తప్పకుండా రండి బాబాయ్. ఆ మాట నేనే చెప్పాలనుకుంటున్నాను బాబాయ్! ఈతరం యువతీయువకుల వింతపోకడలు చూశాక, పిల్లలకు మంచి పెళ్ళి సంబంధం కుదర్చడం చాలా కష్టంగానే వుంది. ఇక్కడ స్థిరపడిన భారతీయ కుటుంబాలవారు, ఎంతగా బాధ పడుతున్నారో నాకూ అను భవం అయింది. మనదేశంలో కూడా విదేశీ అనుకరణ జాడ్యం వ్యాపించాక, పిల్లల పెళ్ళిళ్లు పెద్ద సమస్యగానే వున్నాయి. అయితే వారికి నేనొక సలహా ఇవ్వాలనుకుంటు న్నాను. ఇండియాలో మనకున్న బంధువు ల్లోనో, స్నేహితుల్లోనో, ఆర్థికసహాయమూ, నిలువనీడాలేని అభాగ్యులను తీసుకువచ్చి ప్రయోజకుల్ని చేస్తే, మనకి ఎంతో తృప్తి, జన్మభూమికి సాధ్యమైనంతగా రుణం తీర్చుకో వడం అవుతుందని. అవసరం అయితే, ఇష్ట పడితే, వారిని అల్లుడిగానూ చేసుకోగల అవ కాశం వుంటుందని! అబ్బాయిలే కాదు, అమ్మాయిల్నీ తీసుకురావచ్చుననీ, వారిని కోడ లిగా కుటుంబ సభ్యురాలిగా ఆదరించనూ ఆదరించవచ్చుననీ చెప్పాలనుకుంటున్నాను. అర్చనను తీసుకువచ్చిన కార్తీక్ కూడా ఈవి ధంగా చేసిన కారణంగానే కదా రాకేష్‌కి కష్టంలేకుండా భార్య లభించింది. ఏమంటావ్ బాబాయ్? " అన్నాడు జయచంద్ర.

"అవున్రా జయా! నువ్వు చెప్పింది ఆచరణ యోగ్యమైన గొప్ప సలహా. ఏదేశం వెళ్ళినా మనదేశం, మన ప్రజలు, మన వారు వారికి ఉపకారం చేయాలనుకోవడం, భారతీయులుగా మీకర్తవ్యం! అది పాటించాలనుకోవడం కంటే మాలాటివారికి ఆనందం ఏముంటుందీ?

నందిత చాలా సులువుగా తన జీవిత భాగస్వామిని ఎంచుకోగలిగింది. ఇలాటివారికి సమస్యలేదు. ఎవరితోనైనా సులభంగా కలిసిపోగలరు. లూసీ, కార్తీక్ మొదట కొంత సంశయించినా చివరికి వాళ్లూ సరియైన నిర్ణయం తీసుకోగలిగారు. నీలిమలాటి సున్నిత మనస్కులతోనే సమస్య. వారికి కావలసింది తెలుసుకోలేక తెలిసినా ఎన్నో రకాల సంశయాలతో ఏ నిర్ణ యమూ తీసుకోలేక సతమతమవుతూంటారు, ఒంటరిగా మిగిలిపోతారు.

సుచిత్ర చేసిన సాహసం, తీసుకున్న స్వయం నిర్ణయం, మంచికే కావడం మాకూ ఆనందమే! అనుకోకుండా ఊహించనివిధంగా సందీప్ నీ ఇంటికి అల్లుడు అవుతున్నాడన్న మాట" అని ఆయన తన సంతోషాన్ని వ్యక్తీ కరించాడు.

జయచంద్ర జీవితంలో ముఖ్యఘట్టాలను అధిగమించి తన కంపెనీకి వారసుణ్ణి తీర్చి దిద్దే పనిలో తలమునకలైపోయాడు.

నీలిమ సందీప్‌తో కలసి తండ్రి కంపెనీ లోనే చేరిపోయింది. ఇప్పుడు కార్తీక్‌ని, లూసీని చూసినా ఏమీ బాధగా వుండదు. లూసీ తనకు ప్రాణస్నేహితురాలు. ఆమె సుఖంగా వుండటంకన్నా కావలసిందిలేదు. నిజం చెప్పాలంటే తనకు, తన కంపెనీకి సూటయ్యేలా కార్తీక్‌ని తీర్చిదిద్దింది లూసీయే! ఫలితం దక్కాల్సింది కూడా ఆమెకేను. ఇందులో ఎంతమాత్రమూ సందేహంలేదు. ఒకవేళ సందీప్‌ని కనుక నేను కలుసుకోలేక పోయుంటే ఒంటరిగానే మిగిలిపోదును. నష్ట మేమిటీ? అనుకుంది నీలిమ.

*

# ఏరినముత్యాలు

* కష్టాలను అరువు తెచ్చుకోవడం మీ స్వభావం అయితే మీకోసం అరువు తెచ్చుకోండి. అంతేగానీ వాటిని మీ పొరుగింటి వాడికి అప్పుగా ఇవ్వకండి.

  – కిప్లింగ్

* గొప్పదనం బలంలో లేదు, అది బలాన్ని సరిగ్గా వాడుకోవడంలోనే ఉంది.

  – హెన్రీవార్డ్ బీచర్

* మనుషుల మంచి ఆలోచనలలో మెలిగేవ్యక్తి నిజంగా అతి గొప్పవాడు.

  – శామ్యూల్ బట్లర్

* కాదూ కూడదు లాంటి మాటలతో కూడిన మనసు బీడువారి ఎండిపోతుంది.

  – ఇవాన్ టుర్జినోవ్

* భావోద్వేగానికి బానిస అయిన వ్యక్తి తనకు తాను యజమాని కాలేడు.

  – ఒక సూక్తి

* మీకు తెలియదన్న విషయ అవగాహన చదువు దిశలో మీరు వేసే గొప్ప అడుగు అవుతుంది.

  – డిస్రేలి

* మంచీ చెడులకు సంబంధించిన అందరి ఖాతా దేముడిదగ్గర ఉంటుంది. అతనికి మించిన లెక్కల గుమాస్తా ఈ భూప్రపంచంలో వేరొకడు లేడు.

  – గాంధీజీ

* సత్యాన్ని మీరు పాతిపెట్టినా అది మళ్లీ చిగురించి మొలకెత్తుతుంది. కానీ అసత్యం గిలగిల్లాడి కొట్టుకుంటూ తనని పోషించినవారి కళ్లముందే మాయ మవుతుంది.

  – బ్రయాంట్

* మీ పిల్లలు తమ జీవితంలో బాగుపడి ముందుకు వెళ్లాలనుకుంటున్నారా? అయితే రెండింతలు కాలం వారితో గడపండి. డబ్బు మాత్రం సగమే ఖర్చు చేయండి.

  – అబిగల్ వాన్ బురేన్

* దేముడు అంతా మీ మంచికోసమే చేస్తాడు. ఈ విషయం మీకు తర్వాత తెలుస్తుంది. కొంచెం ఓపిక పట్టాలి.

  – స్వామీ శివానంద

* స్వయంకృషి, లేదా ఇతరుల మూర్ఖత్వం ఈ రెండింటి ద్వారానే మనం ఈ ప్రపంచంలో నెగ్గుకురాగలము.

  – జీన్‌డిలా బ్రుయర్

* దృఢత్వం పొరకింద మృదుత్వంగల తండ్రి, కోమలత్వపుపొర కింద దృఢత్వం గల తల్లి... వీరి కలయికే ఉత్తమ తల్లిదండ్రులు.

  – సిడ్నీహ్యారిస్

సేకరణ: **దాసరి వెంకట రమణా రావు**

# చతుర ప్రపంచం

## ఊహించనివి

భవిష్యత్తు గురించి చెప్పడం చాలా కష్టం. ఒక్కొక్కసారి అనుకున్నవి జరగక ఊహించనివి జరుగుతూవుంటాయి జీవితంలో.

"నీవు సెక్రటరీగా పనిచేయడానికి సరిపడే కోర్సులో చేరు. లేదా పెళ్ళిచేసుకో" అంటూ సినిమా హీరోయిన్ అవకాశంకోసం ఎదురుచూస్తున్న మార్లిన్‌మన్రోని 1944లో ఓ మోడలింగ్ ఏజెన్సీ ఇంటర్వ్యూ చేసి నిరుత్సాహ పరిచింది. కానీ చరిత్ర మరోవిధంగా వుంది.




1897-99ల మధ్య లండన్‌లోని రాయల్ సొసైటీ అధ్యక్షుడుగా పనిచేసిన లార్డ్ కెల్విన్ శాస్త్రజ్ఞులు కనిపెట్టిన మూడు ముఖ్యమయిన పరికరాలను తోసిపుచ్చాడు. అవి మానవాళికి ఎంతమాత్రం ఉపయోగించవని విమర్శించాడు.

ఆయన మాటల్లో...

"రేడియోకి భవిష్యత్ లేదు"

"ఎక్స్‌రేలనేవి మోసం తప్ప నిజంకావు"

"విమానం అనే పరికరం శాస్త్రీయంగా అసంభవం"

మరో శాస్త్రజ్ఞుడయిన కేంబ్రిడ్జ్‌లో ఎయిరోనాటిక్ ఇంజనీర్ థామస్ హక్స్‌లేకి జెట్ ఇంజన్ ప్లాన్‌ని దాని నిర్మాత నింక్‌విట్టిల్ చూపిస్తే "ఇది కాగితాల్లో చాలా ఆసక్తిదాయకంగా వుంది. కానీ ఇది సాధ్యపడని విషయం" అని కొట్టిపారేశాడు.

టీవీ విషయంలో కూడా రేడియో టైమ్స్ అనే అమెరికన్ పత్రిక ఎడిటర్ రెక్స్‌లేంబర్ట్ తప్పు అంచనా వేశాడు. 1936లో ఎడిటోరి



యల్‌లో ఆయన "నా జీవితకాలంలో కానీ, తరువాత తరం కాలంలో కానీ టీవీ ఉద్భ వించడం సాధ్యంకాదు" అని రాశాడు. పదేళ్ల తిరక్కుండానే టి.వి. లక్షలాది అమె రికన్ల ఇళ్లల్లో చోటు సంపాదించుకుంది.

ఇలాగే యు.ఎస్. ఎడ్మిరల్ విలియం లీహై 1945లో "ఆటంబాంబు ఈ శతా బ్దంలో ప్రయోగించబడదు" అన్న కొద్దికాలా నికే జపాన్‌మీద అమెరికా ఆటంబాంబుని ప్రయోగించింది.

1989లో వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ 1991కల్లా బ్రిటన్‌లో పదిలక్షల ఎయిడ్స్ రోగగ్రస్థులుంటారని పేర్కొంది. కానీ 1991లో తేలిన అలాంటి కేసులు బ్రిటన్‌లో 8699 మంది మాత్రమే.

1965లో డ్యూక్ ఆఫ్ ఎడిన్‌బరో 'బీటిల్స్' అనే పాప్‌సాంగ్ గ్రూప్ శుద్ధఫ్లాప్ అని కామెంట్ చేశాడు. కానీ త్వరలోనే వాళ్లు నెంబర్‌వన్‌గా అత్యధిక సంఖ్యలో అమ్ము డయ్యే ఎన్నో పాటల రికార్డులని వెలువరిం చారు.

1914లో బెర్లిన్ యూనివర్సిటీ ప్రొఫెసరొ కాయన "ఆడవాళ్లు వైట్‌కాలర్ జాబ్స్‌లో రాణించలేరని బ్రెయిన్‌తో పనిచేస్తే ఆడవా ళ్లకి మనలా బట్టతల వస్తుందని" వాదించా డాయన.

'గాన్ విత్ ది విండ్' అనే హాలీవుడ్ సినిమా ఈరోజుకీ అత్యధిక మొత్తం కలెక్ట్ చేసిన సినిమా. అయితే ఆ కథని చదివిన యం.జి.యం. స్టూడియోకి చెందిన ఓ ఎగ్జి క్యూటివ్ "ఇది వద్దు. సివిల్ వార్ నేప థ్యంలో తీసిన ఏ సినిమా కూడా ఒక్క పైసా సంపాదించదు" అన్నాడు.

1954లో ఎల్విస్‌ప్రెస్లీని ఓ మ్యూజిక్ డైరె క్టర్ "నీకు పాడటం చేతకాదు. ట్రక్కులు నడుపుకుని జీవించమని నా సలహా" అని తిరగ్గొట్టాడు. కానీ ఎల్విస్ అమెరికాలో సింగర్‌గా నెంబర్‌వన్ స్థానానికి చేరుకు న్నాడు. అతని రికార్డుని ఈరోజుకీ ఎవరూ బద్దలుకొట్టలేకపోయారు, ఒక్క మైకేల్‌జా క్సన్ తప్ప. అలాగే యం.జి.యం. తీసిన "ది విజర్డ్ ఆఫ్ ది ఓజ్" అనే చిత్రంలోని మొదటిపాట దృశ్యపరంగా చాలా హిట్ట యింది. ఆ పాట కోసం చాలామంది ఆ సినిమాని మళ్ళీమళ్ళీ చూసేవారు. కాని ఓ ఎగ్జిక్యూటివ్ ఆ చిత్రం చూశాక "ఆ ఇంద్ర ధనుసు పాట' ఏం బాలేదు. దాన్ని తీసేద్దాం" అని సూచించాడు.

---

## అసలు కారణాలు

మానవతా దృక్పథం వున్న ఏ వ్యక్తీ సాధారణంగా నేరం చెయ్యడు. ఒకవేళ అతను తప్పనిసరి పరిస్థితుల్లో నేరంచేసి ఖైదీగా పట్టుబడినా అందరికీ భిన్నంగానే వుంటుంది అతడి ప్రవర్తన. ఖైదీ అనగానే అతనియందు మామూలుగానే ఎవరికీ సానుభూతి కలగదు. అతను ఏ పరిస్థి తుల్లో నేరం చేశాడోనన్న విషయంవైపు ఆలోచనే పోదు చాలామందికి. అయితే ఏ పరిస్థితుల్లో నేరం చేసినా తప్పే. శిక్ష తప్ప నిసరే. అయితే అతడు జైలు జీవితకాలంలో తన సత్ప్రవర్తనతో శిక్షాకాలం తగ్గించుకుం దుకు ప్రయత్నించవచ్చు

సాధారణంగా ఖైదీలు తప్పించుకుందుకు ప్రయత్నాలు చేస్తూ వుంటారు. అవ కాశంకోసం ఎదురుచూస్తూ వుంటారు. అలాంటి అవకాశం జీవితఖైదు అయిన కాలూషేక్ అనే అతనికి లభించింది. బ్రహ్మ పూర్‌లోని జైల్లో జీవితఖైదు అనుభవిస్తు న్నాడు కాలూషేక్. అతణ్ణి ఒకరోజు బీర్ భూమ్‌లోని రామ్‌పూర్ హాత్‌కోర్టుకు ఇద్దరు పోలీసులు, నలుగురు ఎస్కార్టులు బస్‌లో తీసుకువెళ్తుండగా, ముర్షిదాబాద్‌లోని గోగ్రా మేమోర్ అనేచోట ఓ లారీ ఆ బస్‌ను తీవ్రంగా ఢీకొట్టింది. బస్‌లోని ఏడుగురు







ప్రయాణీకులు, డ్రైవరు, ఇద్దరు పోలీసులు, నలుగురు ఎస్కార్ట్‌లు అందరూ తీవ్రమైన గాయాలపాలయ్యారు.

అదృష్టవశాత్తూ కాలూ షేక్‌కు ఎటువంటి గాయాలూ తగలలేదు. కలిసొచ్చిన అవకాశాన్ని వినియోగించుకుని తప్పించుకుని పరుగుతియ్యకుండా, మానవతా భావంతో గాయపడిన వారందరినీ అటు వచ్చిన ఓ వాహనంలో పోలీస్ హాస్పటల్‌కి తీసుకెళ్ళి చికిత్స చేయించాడు. వారంతా ప్రమాదం నుంచి బయటపడ్డారని భావించాక, అతను దగ్గర్లోవున్న పోలీస్ స్టేషన్‌కెళ్ళి తన విషయం చెప్పుకుని సరెండరయ్యాడు. ఈ సంఘటన విని, ముర్షిదాబాద్ డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్ చాలా సంతోషించాడు.

"ఇది అపూర్వం! తాను తప్పించుకు వెళ్ళడానికి వీలుచిక్కినా, ఓ ఖైదీ అలా చెయ్యక గాయపడిన వారిని కాపాడడం అనేది ఎంతో శ్లాఘనీయమైన విషయం. అతని శిక్షను తగ్గించవలసిన ధర్మం కోర్టుకుంది" అన్నారు.

## అనగనగా ఒక ఎయిర్ హోస్టెస్..

తరచూ విమానంలో ప్రయాణించేవారు ఎంపికకి అవకాశం వుంటే ఆ దారిలో ప్రయాణించే ఏ ఎయిర్‌లైన్ విమానాన్ని ఎన్నుకుంటారన్న దాని మీద వివిధ విమానాల కంపెనీలు పరిశోధన చేసి తెల్సుకొన్న విషయం ఏమిటంటే ఎయిర్ హోస్టెస్‌లే ఆ నిర్ణయానికి బాధ్యత వహిస్తారని. వారిలోని మర్యాద, మన్నన, అందం, సహాయం చెయ్యడం అనే లక్షణాలకి ప్రయాణీకులు ప్రాధాన్యత ఇస్తారని తెలిసింది. అందుకే విదేశీ విమానం కంపెనీలు ఎయిర్‌హోస్టెస్‌ల ఎంపిక మీద ఎంతో జాగ్రత్త తీసుకుంటాయి.

అయితే విమానంలో ప్రవేశించిన తొలి ఎయిర్‌హోస్టెస్ ఎవరు? 1930, మే 15న యునైటెడ్ ఎయిర్‌లైన్స్ కంపెనీవారు శాన్ ఫ్రాన్సిస్కోనించి షికాగో వెళ్ళే విమానంలో తొలిసారిగా ఎయిర్‌హోస్టెస్‌ని ప్రవేశపెట్టారు. 14 మంది ప్రయాణీకులు గల ఆ విమానంలో మిస్ ఎల్లెన్ ఎర్చ్ ఎయిర్‌హోస్టెస్‌గా ప్రయాణించి ప్రయాణీకులకి కాఫీ, టీలు అందించింది. ఆ విమానం దారిలో ఒహాయ్, చెయెన్నే, సాల్ట్ లేక్ సిటీ, రినో

అనే వూళ్లల్లో ఆగుతూ వెళ్లింది.

యునైటెడ్ ఎయిర్‌లైన్స్ తాలూకు డిస్ట్రిక్ట్ మేనేజర్ స్టీవ్ సింప్సన్ కథ ఇది. ఆ రోజుల్లో విమానంపై ప్రయాణానికి చాలా మంది భయపడేవారు. కుర్ర అమ్మాయి విమానంలో ప్రయాణిస్తుంటే వాళ్లకి ధైర్యంగా వుంటుంది అన్న ప్రాతిపదిక మీద ఎయిర్‌హోస్టెస్ పద్ధతి పుట్టింది అంటాడా యన. అయితే వాళ్లు ప్రయాణికులతో సభ్యతగా వుండాలి కాబట్టి నర్స్ వృత్తిలో వున్న వారు సాధారణంగా విసుక్కోకుండా సేవ చేస్తారని నర్స్‌లనే ఎయిర్‌హోస్టెస్‌లుగా ముదురు ఆకుపచ్చ రంగువి ఎందుకు నిర్ణయించారంటే ప్రకృతికి దగ్గరగా వున్న రంగని. క్రమేపీ వాళ్ల దుస్తులు సెక్స్ అపీల్‌ని వ్యక్తం చేయడానికి అనుకూలంగా మార్చారు. ప్రయాణీకులతో ఆహ్లాదంగా ప్రవర్తించే తీరుమీద వాళ్లకి పాఠాలు నేర్పడం కూడా ఆరంభించారు. ఎయిర్‌హోస్టెస్‌లే తమ విమానంలో ప్రయాణికులను ఆకర్షించేది అని గ్రహించాక వాళ్లకి ఆయా పద్ధతులను నేర్పడానికి అనుభవజ్ఞులతో అందుకు తగ్గ కోర్స్‌లని రాయించి వాళ్లకి ఆ విషయాల్లో కొన్ని వారాలపాటు శిక్షణ ఇచ్చే




తీసుకోసాగారు. మిస్ ఎల్లెన్ ఎర్చ్ నర్స్. తర్వాత వాళ్లు 25 ఏళ్ల లోపు వయసు వార్తై, అవివాహితలయితేనే చూడడానికి ఆకర్షణీయంగా వుంటారు కాబట్టి అలాంటివారినే ఎన్నుకోసాగారు. విమానంలో ఎంత తక్కువ బరువు ప్రయాణిస్తే అంత ఇంధనం పొదుపు అవుతుంది కాబట్టి వాళ్లు సన్నగా వుండాలని కూడా నిర్ణయించారు. మిగిలిన ప్రయాణీకులనించి వారు వేరని గుర్తించడానికి అనువుగా స్కర్ట్, లాంగ్ కోట్ యూనిఫాంగా చేశారు. ఆ దుస్తులు కూడా పద్ధతిని కూడా ప్రవేశపెట్టారు. నెలకి కనీసం 100 గంటలు విమానంలో పనిచేయాలన్న నియమం కూడా పెట్టారు. విదేశీ విమానకంపెనీలన్నీ ప్రైవేట్ యాజమాన్యంలో వున్నాయి. కాబట్టి ఇప్పటికే ఈ నియమావళిని అవి పాటిస్తున్నాయి. కానీ ప్రభుత్వ రంగంలోవున్న మన ఎయిర్ ఇండియా, ఇండియన్ ఎయిర్‌లైన్స్‌ల్లో ఈ విషయాల్లో తేడా వచ్చిందనే చెప్పాలి. వివాహితులు కూడా ఎయిర్‌హోస్టెస్‌లుగా కొనసాగగలగడం ఇందుకు ఓ ఉదాహరణ.



# 'కక్షశిల' పై సమీక్షలు

అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన చిలుకూరి దేవపుత్ర నవల 'కక్షశిల' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## 'పెన్న' సాక్షిగా

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

రాయలసీమ ఫ్యాక్షనిజాన్ని కేవలం అగ్రకులాల ఆధిపత్యపు పోరుగా హింస, దౌర్జన్యమే నేపథ్యంగా, కొట్టుకోవడం, నరుక్కోవడమే కథనంగా చూపిస్తూ, సామాన్య ప్రేక్షకులకు తప్పుడు అవగాహన కలిగిస్తూ వస్తున్న నేటి సినిమాలుంటున్న తరుణంలో సామాన్య పాఠకునికి సైతం అర్థమయ్యే రీతిలో ఫ్యాక్షనిజానికి వెనుక వున్న చారిత్రక, సామాజిక, రాజకీయ అంశాలను రామచంద్ర పాత్రద్వారా పరిశోధనాత్మకంగా విశదీకరిస్తూ ఘర్షణ వుండేది ఎక్కువగా రెడ్ల కులంలోనే అయినా వాళ్ల ముఠాలలో చేరి ఎక్కువగా దళితకులానికి చెందిన మాల, మాదిగ, ఎరుకుల, లంబాడీ, బోయ, ఈడిగ కులాలకు చెందిన వాళ్లే కొట్లాటకు పోయి దెబ్బలు తిని, చచ్చి, జైలుపాలై, పరస్పరం కక్షలు కార్పణ్యాలు పెంచుకుంటూ, ఆస్తులు తగలబెట్టుకుంటూ, పంటలను నాశనం చేసుకుంటూ అత్యంత దయనీయమైన భీతావహమైన జీవితాన్ని గడుపుతున్న వైనాన్ని ఆయా పాత్రలద్వారా అత్యంత వాస్తవంగా చిత్రీకరించగలిగారు రచయిత.

ఫ్యాక్షన్ బలంగా వున్న ప్రాంతాల్లో దానికి భయపడుతూ, దూరంగా బతికే వారు కూడా ఆ ఫ్యాక్షన్‌లో ఎలా భాగమై పోతారో అందుకు సామాజిక, ఆర్థిక, పరిస్థితులు ఎంత బలీయంగా పనిచేస్తాయో




రంగయ్య పాత్రద్వారా చక్కగా చెప్పారు.

ఎపుడో శ్రీకృష్ణదేవరాయల కాలంలో పాల్యంకర్ వ్యవస్థగా పుట్టిన పాలెంగాళ్లే ఫ్యాక్షనిస్టులుగా పరిణితిచెందిన వైనాన్ని, గ్రామాల్లో ముఠాకక్షల తీరుతెన్నులను, అవి సమాజంమీద వాటి ఆధిపత్యం పోరును నెలకొల్పడానికి చేసే అకృత్యాలను కళ్లకు కట్టించారు. ఆస్తుల సంపాదనకూ, రాజకీయాధికారాన్ని పొందడానికి ఫ్యాక్షన్ వధ్యశిలలపై అమాయకులైన దళితులను బలిచేస్తున్న ఫ్యాక్షనిస్టులుగా హనుమంతరెడ్డి, నాగప్పరెడ్డి వంటి పాత్రలు వుదాహరణలైతే బలి పశువులుగా పక్కీరప్ప, శ్రీరాములు

పాత్రలు ఉదాహరణలు. మాదిగ దండోర, మాల మహానాడుల మధ్య వైషమ్యాలను చాలా సందర్భశుద్ధిగా అవగాహన చెందించారు రచయిత. అదేవిధంగా పోరుబాట కమ్యూనిస్టుల వ్యవహారసరళి నిజమైన సామాజిక న్యాయస్థాపన, పీడిత ప్రజల పక్షమేనా అన్న సందేహం కలిగించక మానదు.

నేటితరానికి ప్రతినిధులుగా రాబోయే తరంలో కలుగబోయే సాంఘిక మార్పులకు ప్రతీకలుగా అభిషేక్, శ్రీప్రియ, లత, రామచంద్రల వివాహాల ద్వారా రచయిత ప్రస్ఫుటం చేశారు.

మొత్తానికి తమకు ఉపకారం చేసిన గొంచిగాడుపై అపారమైన విశ్వాసాన్ని చూపే నైజాన్ని, బానిస భావజాలం దళితుల్లో జీర్ణించుకున్న వైనాన్ని, అదే విధంగా రెడ్లకెదురు వచ్చే వాణ్ణి తల నరికైనా తమ ఆధిపత్యాన్ని నిలుపుకొనే తీరు, ఫ్యాక్షనిజాన్ని వ్యభిచారంకన్నా హీనంగా భావించినా బయటకు రాలేనితనాన్ని, ఆయా బలహీనతలు ఆయా వర్గాల్లో పెన్న సాక్షిగా రాయలసీమలో నీళ్లలో నీళ్లై ప్రవహిస్తూ, సంస్కృతిలో భాగమైన విధం ఆద్యంతం హృద్యంగా మలిచారు. ఆఖరున యుద్ధప్రాతిపదికన అన్ని వర్గాలవారికి ఫ్యాక్షనిజాన్ని ఉమ్మడి శత్రువుగా నిర్మూలించి అభివృద్ధికి పాటుబడమని ఆకాంక్షించడం ముదావహం.

***– తమ్మినేని విజయరమ***
నరసరావు పేట

# రతనాలసీమ

***(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)***

**'రాయలేలిన సీమ రతనాలసీమ'** అన్నాడొక కవి.

వర్తమాన సమాజంలో ఆ రతనాలసీమ భూస్వాములు వర్గసామరస్యం కూడా లేకుండా సహజ శత్రువులుగా మారారు. ఎవరికి వారే సింహం గుహలలాగా తమ నివాసాల్ని రక్షణ దుర్గాలుగా మార్చుకొని దినదిన గండంగా జీవితాలు సాగిస్తున్నారు. అటువంటి ప్రమాదకర, క్రూర సామాజిక జీవితం గడిపే ఫ్యాక్షనిస్టుల జీవితాల్ని కళ్లకు కట్టినట్లుగా చిత్రించిన నవల 'కక్షశిల'.

మాల, మాదిగ, కులాల మధ్య వున్న వైషమ్యాలకు కారణాలను, వారి వారి జీవన విధానాలను, వృత్తులను గురించిన విశ్లేషణ, మాల మహానాడు, మాదిగ దండోరాల పేర్లతో ఆ రెండు కులాల వారు ఘర్షణ పడటం అనర్థదాయకమన్న సందేశం వున్న నవల కక్షశిల.

మాల రంగయ్య, మాదిగ ఈశ్వరి మంచి మిత్రులైనా, మధ్యలో కారణాంతరాలవల్ల వైరి వర్గాల్లో చెరొక పక్షంలో చేరిపోయారు.

అయినా ఆపద సమయాల్లో ఒకరినొకరు కాపాడుకొని ఆప్తమిత్రులనిపించుకున్నారు. కులవైరుధ్యాల కక్షలు, మారణ కాండలు, వాళ్లలోని మానవత్వాన్ని స్నేహాన్ని చెరిపి వేయలేకపోయాయి.

విద్యావంతులైన మాలయువతి లత, మాదిగ యువకుడు రామచంద్ర ప్రేమించుకొని దంపతులై, పోరునష్టం పొందులాభం, అనే లోకోక్తిలోని సత్యాన్ని నిరూపించారు. ఆ రెండు కులాల వారికి కనువిప్పు కల్గించారు.

నవయౌవనం, కండపుష్టి, వున్న పాలేరు నల్లప్పతో కేవలం కామంతో వెంటాడి సంబంధం పెట్టుకున్నది భూస్వామి కూతురు పార్వతి. అయాచితంగా అందిన ఆ పొందులో ప్రమాదం వుందని తెలిసి కూడా ఆ ఆనందానికి బానిసై ప్రాణాపాయం తెచ్చుకున్నాడు నల్లప్ప.

కావాలని వెంటాడి లోబరచుకున్న నల్లప్ప మంటల్లో కాలిపోతున్నా దాన్ని ఆపమని శ్రీప్రియ హెచ్చరించినా పార్వతి ఆపే ప్రయత్నం చెయ్యలేదు. నల్లప్పపోతే మరో పుల్లప్పని చూసుకోగల అనాగరిక




బుద్ధి పార్వతిది. తన భద్రత తాను చూసుకుంది.

చదువు, సంస్కారం, సంపద, సంపాదన లేని అట్టడుగు కులంలోని ఒక జీతగాడికి ఆస్తి, అంతస్థు ఒక స్థాయి చదువు, నాగరికత, వున్న కూతురు భార్య కావటానికి యే భూస్వామీ అంగీకరించడు. ఆ స్థానంలో నల్లప్ప తండ్రి వున్నా వేమారెడ్డి చేసిన పనే చేసేవాడు. వర్తమాన సమాజపు స్థితి, గతి అలావుంది.

సామాజిక పరిజ్ఞానం, కళాభిమానం, సంస్కారం వున్న శ్రీప్రియ తాను దొర కూతురైనా మాల కులానికి చెందిన చిత్రకారుడు అభిషేకాన్ని మనసారా ప్రేమించింది. అతనితో పెండ్లికి సిద్ధపడింది. ఫ్యాక్షనిస్టు ఇనుప చెరని ఛేదించింది. కావాలనుకున్నది సాధించింది. ఆ పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పన ప్రశంసనీయం.

కృష్ణదేవరాయల కాలంనాటి పాల్యంకర్ వ్యవస్థ పాలెంగాళ్ల వ్యవస్థ గాను, కాలక్రమంలో పాలెంగాళ్ల వ్యవస్థ ఫ్యాక్షనిస్టుల వ్యవస్థగానూ రూపాంతరం చెందిన చారిత్రక సత్యాన్ని సమగ్రంగా విశ్లేషించిన రచయిత దేవపుత్రగారు అభినందనీయులు.

పూజ్యబాపూజీ పుట్టిన అక్టోబరు నెలలో ఆణిముత్యంలాంటి సందేశాత్మకమైన నవల అందించిన చతురకి నా అభినందనలు!

*– నాదెండ్ల లీలామాధురి*

హైద్రాబాద్

## కర్ణుడి చావుకి కారణాలు

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

చిలుకూరి దేవపుత్ర చతుర నవల 'కక్షశిల' ఫ్యాక్షనిజంపై పరిశోధనావ్యాసం అంటే అతిశయోక్తి అనిపించుకోదు. అదేరీతిలో కొందరు రచయితలలాగా 'తాంబూలాలిచ్చేశా, తన్నుకు చావండి' అన్నట్లు తనకు తోచిన, నచ్చిన ఒక సందేశాన్ని ముగింపుగా పాఠకులకు అందజేశారు.

ఎక్కడైనా ఫ్యాక్షనిజం అనేది ఎలా పుడుతుంది. పెరుగుతుంది, దాని పరిణామం ఎవరిమీద చూపుతుంది, బాగుపడేదెవరు, నష్టపడేదెవరు, అసలు ఫ్యాక్షనిజం లేని పరిస్థితిలో అక్కడి వాతావరణం తర్వాత ఏ విధంగా మారిపోతుంది అనే అంశాలతో విపులంగా పాఠకుల ముందుంచిన రచయిత అభినందనీయుడు.

ఫ్యాక్షనిస్టులు తమ కార్యకలాపాలను వదలలేకపోవడానికి కర్ణుడి చావుకు ఎన్నికారణాలో అన్ని వుండవచ్చు తెలిసో, తెలియకో సింహం తోక పట్టుకొంటే... వదిలితే ఒక కష్టం, వదలకపోతే మరో ఇబ్బంది.

మనిషిలోని స్వార్థపరత్వం, ఓర్వలేనితనం, అత్యాశలాంటివి సంఘంలో ఫ్యాక్షనిస్టులను తయారుచేసి, పెంచిపోషిస్తున్నాయి. ఏనాడు మనిషి పై అవలక్షణాలను అదుపు చేసుకుంటాడో ఆనాడు ఫ్యాక్షనిస్టులకు సంఘంలో స్థానం ఉండదు.

చివరగా, రచయిత చెప్పినట్లు కుల తత్వాన్ని వీడి, వసుధైక కుటుంబంగా సమాజం మారితే, మారగలిగితే మానవాళికి శ్రేయస్కరం.

*– యస్. హరనాథబాబు*

హైదరాబాద్ - *500 044*

## చక్రబంధంలో...

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఫ్యాక్షనిజం నేపథ్యంలో సాగిన 'కక్షశిల' రాయలసీమ బాంబుల సంస్కృతిని, దళిత వర్గాలపై ఆధిక్యతను, భూస్వామిక దోపిడీ విధానాల్ని ప్రతిబింబించింది.

ఇరువురు ఫ్యాక్షన్ నాయకుల చక్రబంధంలో బలిపశువులుగా మారిన దళితుల సామాజిక దయనీయతకు అక్షరరూపం.



రంగయ్యలాంటి దళితుడు ఫ్యాక్షన్ నాయకుల అండ చేరడం ఇష్టంలేకపోయినా విధిలేక వారి పంచన చేరి దినదినగండంగా బతకాల్సిరావడం, అతనిలోని ఆత్మవేదన, పరిస్థితుల ప్రభావంలో సంఘర్షణ చూస్తే సగటు దళితుడు రాయలసీమలో ఎదుర్కొంటున్న నిత్య ఘర్షణ ఎలాంటిదో అర్థమవుతుంది.

రాయలసీమలో అటు ఫ్యాక్షనిజం, ఇటు నక్సలిజం వలన కొన్నివందల కుటుంబాలు ఆత్మీయుల్ని కోల్పోయి, దుఃఖసాగరంలో మునిగి జీవచ్ఛవాలుగా ఉన్నారనే రచయిత వాక్కులు అక్షరసత్యాలు.

రాయలసీమలో దళితవర్గాలు భూస్వాముల కిరాయిసైన్యంగా మారటంతో వారి బంధుమిత్ర గణాలు వ్యతిరేక ఫ్యాక్షనిస్ట్ పంచన చేరడం వారు చచ్చేదాకా ఊడిగం చేయడంవలన ఇక్కడ సామాజిక చైతన్యం కలగడంలేదనేది యథార్థం. ఈ నవలలో రంగయ్య, శ్రీరాములు, ఈశ్వర్ పాత్రలు ఈ విషయాన్ని స్పష్టం చేశాయి.

నల్లప్పను దారుణంగా హతమార్చడం దళితులపై అగ్రవర్ణాల దమనకాండకు నిదర్శనం కాగా పార్వతి, నల్లప్పలాంటి పాత్రలు గత చరిత్రలో ఎన్నో వచ్చాయని నల్లప్పలాంటి బలిపశువులు ఎందరో అనే ఆవేదన రాకమానదు.

దళితుల జీవనచిత్రణలో గతంలో వేలాది రచనలు వచ్చినా ఫ్యాక్షనిజం, తీవ్రవాదం, కులవర్గీకరణ, భూపోరాటం నేపథ్యంలో హృదయాంతర ప్రేమల్ని స్పృశిస్తూ అన్ని కోణాల్లో ఉత్కంఠగా ఉన్న 'కక్షశిల' రచయిత చిలుకూరి దేవపుత్రకు అభినందనలు.

– కె.యల్. మరియన్న
కాజీపేట

## రెండు విషసర్పాలు

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మానవుల్లో హింసాప్రవృత్తి విపరీతంగా పెరిగిపోయింది. ఇది కేవలం రాయలసీమలాంటిచోట ఫ్యాక్షన్ రూపంలో మాత్రమే లేదు. ప్రపంచవ్యాప్తంగా ఏదోరూపంలో ఉంది. బుష్ యుద్ధం చేసినా, ఉగ్రవాదులు హింసాకాండకు దిగినా, నక్సలైట్లు హత్యలు చేస్తున్నా, పోలీసులు ఎన్‌కౌంటర్లు చేస్తున్నా ఫలితం ఒకటే మారణకాండ! జీవితం విలువ గడ్డిపోచ. ఏ మతమూ దీన్ని అరికట్టలేకపోవడం, కనీసం తగ్గించలేకపోవడం చూస్తే మతం విలువలు శూన్యస్థాయికి వచ్చాయి అని తెలుస్తుంది. దీనికి తోడు ముఖ్యంగా మనదేశంలో కులం, మతం అనేవి రెండు విషసర్పాలుగా కాటేస్తున్నాయి. వీటిని మన నాయకులే పెంచి పోషించడం మన దేశ దౌర్భాగ్యం. కక్షశిల నవలకి రక్తపాతమే ప్రధాన అంశం. మాల మాదిగ స్పర్థలు రెండో అంశం. ఈ రెండు అంశాలని రచయిత కళ్ళకి కట్టినట్లు చూపించారు.

– కె. రామారావు
హైదరాబాద్

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

